# విషయసూచిక



## ఆరణ్యపర్వము, సప్తమాశ్వాసము.

శ్రీ

హరిహరహిరణ్యగర్భేభ్యోనమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆరణ్యపర్వము, ప్రథమాశ్వాసము.



కీర్తిశ్రీవల్లభ
లోకజనస్తుత్య సర్వలోకాశ్రయ ర
త్నాకరపరివృతసకలధ
రాకాంత జితారి రాజరాజనరేంద్రా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు పాండవులు నిజాయుధంబులు ధరియించి కృష్ణాసహితులై [1]యుత్తరమించి యరిగిన నింద్రసేనాదులైన మూలభృత్యులు పదునాలుగువేలరథంబులతోడ సుభద్రాభిమన్యుప్రతివింధ్యాదులం దోడ్కొని వారిపిఱుందన యరిగి రంత నప్పాండవులం జూచి పౌరులెల్లఁ బరమదుఃఖితులై. 2

క. చనునె యధర్మద్యూతంబున నిట్టుల పాండురాజపుత్త్రులఁ బ్రభులన్
వనగతులఁ జేయ దుర్యోధన ధృతరాష్ట్రులకు విగతదయహృదయులకున్. 3

క. క్రూరతరధార్తరాష్ట్రుని, కారము వారింపరైరి గాంగేయుఁడు న
బ్భారద్వాజుఁడు గృపుఁడు ను,దారుఁడు విదురుండు నేమి దలఁచిరో బుద్ధిన్.

సీ. కర్ణజయద్రథగాంధారు లాప్తులై, యుండంగ లోభి దుర్యోధనుండు
రాజుఁ గానీతని రాజ్యంబునం దెట్టు, లుండఁగ నేర్తు మీయుర్వి నింక
నేది ధర్మువు ప్రజ లెవ్వరు గాతురు, పరమధార్మికులైన పాండుసుతుల
యడిగినచోటికి యరుగుద మని వారి,పిఱుఁదన చని [2]పాపభీతమతులు

ఆ. వీరులార మమ్ము విడిచి మీ కరుగంగఁ, జనునె మాకు నొండు శరణ మెద్ది
సాధులకు నసాధుసహవాసమునఁ బాప, సంప్రయోగ మగుట సందియంబె. 5

1. 'ఉత్తరమించి' యనుటకుఁ జూడు 'ఏఁగె నుత్తరమించి తమ్ములతో' (ఆరణ్య, ౪-౨) ఇది 'తీర్థమించు' వంటిది. క. యుత్తరించి. ఆ. యుత్తరం బధిగమించి, 2. గ. పాపభీతులార,

క. తిలలును నీళ్ళును వస్త్రం,బులుఁ బుష్పసుగంధవాసనమున సౌరభముం
బొలుపెసఁగఁ దాల్చుఁ గావున, నలయక సత్సంగమమున * నగుసద్గు

వ. సాధుసమ్మతంబు లైనగుణంబుల నొప్పి జన్మవిద్యాకర్మంబులం బ్రశస్త
ర్యవృత్తుల రైనమీసహవాసంబున నుండి ధర్మవిదులముఁ గృతార్థులవ
దుష్కృతంబులయం దనారంభు లయ్యును జనులు దుర్జనదర్శనస్పర్శనస
సహాసనంబులం జేసి ధర్మవిహీను లగుదురు గావున నేము దుర్యోధ
బున నుండనోపము మాయనుగమనంబున కొడంబడవలయునని కృ
లైన నప్పౌరులం జూచి ధర్మతనయుం డిట్లనియె.

క. మాయందు లేనిగుణములు, మీయనురాగమునఁ జేసి * మిగిలి వెలింగె
మీయనుగతి మాకు నభి,ప్రాయము వనవాసదుఃఖ*భర మోపుదురే.

తే. వలవ దుడుగుండు మీరని * వారి నెల్లఁ, గరుణఁ బాండవజ్యేష్ఠుండు * గ్రవ
బౌరు లట్లు నివర్తింపఁ * బడి నిరంత,రార్తనాదులై యరిగి * హస్తిపురికి

వ. ఇట్లు [1]పాండవులు కృతప్రస్థానులై గంగాతీరంబునం బ్రమాణాఖ్య
విడిసి గంగాస్నానంబు సేసి నాఁటి పగలును రాత్రియు నంద యుం
బ్రభాతసమయంబున.

చ. పరువడి నగ్నిహోత్రములు * బంధులు శిష్యులుఁ దోడ రామహీ
సురవరు లెల్లఁ బాండునృప * సూనుఁ యొద్దకుఁ బ్రీతి నేగుదెం
చిరి బహువేదఘోషములఁ * జేసి నిరస్తసమస్తకిల్బిషో
త్కరులగుచున్న ధన్యులు జగ*త్పరిపూజ్యులు బ్రహ్మసమ్మితుల్.

వ. ఇట్లు దమతోడన వనవాసంబు సేయ నిశ్చయించి వచ్చినవిప్రుల నతిప్రీ
బున నర్చించి తదాశీర్వాదంబుల నభినందితుండై ధర్మతనయుండు వారల

క. అపహృతసర్వస్వుల మై, సపత్నులనికారమునఁ బ్ర*చండాటవిలో
విపులఫలశాక మూలము, లుపయోగించుచును నిష్ఠ * నుండెదము మాత్రో

క. రానేల వచ్చి నవయం,గా నేల నివాసములకుఁ * గ్రమ్మఱి చనుఁ డు
గ్రానేకప శార్దూలభ,యానకవనవాస మర్హ*మగునే మీకున్.

వ. అనిన విని బ్రాహ్మణులు పరమదుఃఖితులై మీరు కాని మాకు నొండ
మమ్ము ననన్యశరణ్యుల విడుచుట ధర్మంబు గాదు.

ఆ. ఆశ్రితులను భక్త * [2]లగువారి నెప్పుడు, నన్యులైన విడువ*రట్టె విప్ర
వరుల భక్తిపరుల * వసుధేశ మీయట్టి, ధార్మికులకు విడువఁ * దగునె

1. అ. దమతోడవనవాసంబు సేయ వచ్చువారల నిలిపి పాండవులు. 2. క. లైనవారి భక్త జాలరట్టె, జ. అగువారి నన్యుల నైన విడువఁజాలరట్టె.

వ. అస్మదీయాన్వేషణోపాయచింత సేయవలదు వన్యమూలఫలంబుల నేము తెచ్చికొని యుపయోగించుచు జపహోమాదిపుణ్యక్రియల మీకుం బ్రియంబు సేయుచు నుండెద మధర్మవర్తి యయి మీ కపకారంబుసేసిన ధార్తరాష్ట్రులరాష్ట్రంబున నుండ నోప మనిన వారలరాక కొడంబడి. 17

తే. ఇష్టమృష్టాన్నములఁ దొల్లి యెల్లప్రొద్దుఁ, దృప్తులగు చున్నవసుమతీదేవవరులఁ
గానలందు శాకాశనులఁగాఁగ నెట్లు, సూడనోపుదు నని ధర్మసూనుఁడపుడు.

—* శౌనకుఁడు ధర్మరాజునకు ధర్మంబులు సెప్పుట. *—

వ. శోకమూర్ఛితుండై మహీతలంబుపయిం బడిన నాతని నాశ్వాసించి శౌనకుం డను బ్రహ్మఋషి దొల్లి యాత్మన్యవస్థానార్థంబు జనకగీతంబులయిన శ్లోకంబుల యర్థంబులు యుధిష్ఠిరున కిట్లనియె. 19

క. శోకభయస్థానంబు ల, నేకంబులు గలిగినను విహీనవివేకుం
డాకులతఁ బొందు నట్లు వి, వేకము గలవాఁడు [1]బుద్ధివిగతుం డగునే. 20

క. శారీరమానసమహా, దారుణదుఃఖములఁ జేసి తఱిఁగి శరీరుల్
క్రూరతరబాధఁ బొందుదు, రారెంటిని జెఱుతు రార్యు లమలినబుద్ధిన్. 21

వ. వ్యాధి శ్రమానిష్టసంస్పర్శ నేష్టవివర్జనంబు లనునాల్గింటం బుట్టి శారీరదుఃఖంబు లాశుక్రియాదిప్రతియోగంబుల నుపశమిల్లు మఱి స్నేహజంబులయిన మానసదుఃఖంబులు జలంబుల నగ్ని యుపశమిల్లునట్లు విమలజ్ఞానంబునం జేసి యుపశమంబునుం బొందు. 22

క. స్నేహార్ణవమగ్నుం డయి, దేహి మహాదుఃఖముల నధృతిఁ బొందును దుః
ఖాహతుఁడు శోకతాప వి, మోహియగున్ స్నేహమూలములు రాగాదుల్. 23

వ. కావున బంధుమిత్రధనసంచయంబులవలని స్నేహంబు విడుచునది పద్మపత్రంబు [2]నీరం బొందనియట్లు తెలివిగలవారి నెట్టియెడలను స్నేహంబు వొందదు స్నేహంబున రాగంబును రాగంబునం గామంబును గామంబునం గ్రోధంబును గ్రోధంబునం దృష్ణయు వర్తిల్లు. 24

క. అది సర్వదోషముల కా, స్పద మది దురితక్రియానుబంధంబులకున్
మొదలు నిరంతరదుఃఖ, ప్రదమని మది నెఱిఁగి తృష్ణఁ బాతురు సుమతుల్.

వ. మఱియుఁ దృష్ణాతురుం డర్థలోభంబునఁ గోటరస్థంబయిన యనలంబునం జేసి దగ్ధంబగు వృక్షంబునుంబోలె వినాశంబునుం బొందు నట్ల యర్థాసక్తుండైనవాఁడు శుభంబులు వడయ నోపండు మృత్యువువలనం బ్రాణులకు భయంబు గలుగున ట్లర్థవంతులకు రాజ చోర స్వజన జలానలంబులవలన భయంబు నియతంబు. 26

తే. జలములందు మత్స్యంబులు చదలఁ బక్షు, లామిషం బెట్లు భక్షింపు నట్లు దివిరి

1. క. బుద్ధివికలుం. 2. క. జ. నీరం బొరయనియట్లు

యెల్లవారును జేరి యనేకవిధుల, ననుదినంబును భక్షింతు రర్థవంతు. 27

క. అర్థమ యనర్థమూలం, బర్థమ మాయావిమోహనావహము నరుం
డర్థార్జనదుఃఖమున న, పార్థీకృతజన్ముఁ డగుట పరమార్థ మిలన్. 28

వ. అట్టియర్థంబువలన దర్పకార్పణ్య మాన భయోద్వేగంబులు పుట్టుఁగావున[1] నర్థోపార్జనచింత సేయవలదు రూప యౌవన ధన విభవప్రియసంవాసంబు లనిత్యంబు లగుట నందు బుద్ధిమంతులు విమోహింప రనిన నమ్మునివరునకు ధర్మతనయుం డి ట్లనియె. 29

సీ. ఆత్మోపభోగార్థ మర్థలాభేచ్ఛ నా, కెన్నండు లేదు మహీసురాగ్ర
గణ్యుల నత్యుగ్ర కాననాంతరమున, నెవ్విధంబున భరియింతునొకో
యని యిప్డు వగచెద ననవద్యగుణయుక్తి, ననఘ మాయట్టి గృహస్థతతికిఁ
బోష్యుల నెయ్యెడఁ బ్రోవక యుండను, విప్రుల నతిథుల వృథయపుచ్చఁ

ఆ. జనునె నిజధనంబు సంవిభాగించి యీ, వలయు సాధురక్ష వలయుఁ జేయ
నభిమతాశ్రమంబులందు గృహస్థాశ్రమంబ కాదె యుత్తమంబు వినఁగ. 30

వ. [2]మఱి యార్తునకు శయనంబును భీతునకభయంబును దృషితునకు జలంబును బుభుక్షితునకు నన్నంబును శ్రాంతునకు నాసనంబును నిచ్చుట సనాతనం బైన యుత్తమగృహస్థధర్మంబు తృణభూమ్యుదక ప్రియవచ నాదరదానం బెల్లవారికి [3]నశ్రమంబ యాత్మార్థంబుగా నన్నపాకంబును నసాక్షికభోజనంబును వృథాపశుఘాతంబును బాపహేతువు లగ్నిహోత్రంబులు ననడ్వాహంబులు నతిథి బాంధవ విద్వజ్జన గురు మిత్త్రి భామినీ నివహంబు లపూజితంబులై యెగ్గుసేయునుగావున గృహస్థుండు సర్వసంతర్పకుండు గావలయుం గావునం బ్రతిదినంబును బక్షిశునకశ్వాపదార్థంబు సాయంప్రాతలయందు వైశ్వదేవంబుసేసి యమృతాశియు విఘసాశియుఁ గావలయు యజ్ఞశేషం బమృతంబు నాఁ బరఁగు [4]నతిథిభుక్తశేషంబు విఘసంబు నాఁబడు నట్టివృత్తి వర్తిల్లువాఁ డుత్తమగృహస్థుండనిన ధర్మరాజునకు శౌనకుం డి ట్లనియె. 31

క. హారివిషయాభిలాషము, గారణముగ నెంతయెఱుక గలవారును దు
ర్వారవికారముఁ బొందెదు, వారు నిజేంద్రియము లవి యవశ్యములగుటన్. 32

వ. సంకల్పజంబైన కామంబునం గలిగినమనస్సుచేతం బ్రేరితం బై శ్రోత్రాదీంద్రియంబులు శబ్దాదివిషయంబులం బరిభ్రమించుటం జేసి విషయాభిలాషవిశిఖవిద్ధులై దేహులు తేజోలుబ్ధంబులైన శలభంబులుంబోలె శోకానలంబునం బడి తమ్మెఱుంగక యవిద్యాకర్మతృష్ణలం జేసి సంసారచక్రంబునందుఁ బ్రవర్తిల్లుదు రట్టి

1. అ. నర్థత్యాగంబు సేయవలయు రూప. 2. క. మఱి యార్తభీతుల కభయంబును, 'మఱి తృషితునకు జలంబును బుభుక్షితునకు నన్నంబును శ్రాంతునకు శయనంబును నిచ్చుట' అని పైత్ప్రతులపాఠము. 3. అ. నశశ్వంబ. 4. గ. భోమ్యభుక్త.

బ్రహ్మాదితృణపర్యంతభూతప్రవృత్తియందు రాగద్వేషవిముక్తులై యభిమాన మత్సరంబులు విడిచి వేదచోదితంబైన సమ్యక్సంకల్పసంబంధం బింద్రియనిగ్రహంబు వ్రతవిశేషంబు గురుసేవనం బాహారయోగం బధ్యయనాగమంబు కర్మసన్న్యాసంబు చిత్తనిరోధం బను నెనిమిదింటను ధర్మానుష్ఠానంబు సేసిన మహాత్ములు దమతమతపోమహత్త్వంబునం జేసి సంసారంబు జయింతురు నీవును శుశ్రూషాశ్రవణగ్రహణ[1]ధారణోహాపోహార్థవిజ్ఞానతత్త్వజ్ఞాన [2]సమన్వితుండవు నీచేతం [3]బ్రారబ్ధంబు లైనయవి సర్వంబులును సంపన్నంబులగు. 33

క. వసు రుద్రాదిత్యాదులు, వసుధేశ దపంబుగౌరవంబున నైశ్వ
ర్యసమృద్ధు లైరి తపమునఁ, బ్రసిద్ధముగ నిష్టసిద్ధి వడయుము నీవున్. 34

వ. తపస్సిద్ధు లైనవారు దమతలంచినదాని నశ్రమంబునం బడయుదురు కావున నీవు నుపశమవంతుండవై తపంబుసేసి యోగార్థసిద్ధి వడసి బ్రాహ్మణుల[4]ననుచరించుచు నీమనోరథంబు సఫలంబు సేయు మనిన శౌనకువచనంబు సేకొని భ్రాతృమధ్యగతుం డైనధర్మతనయుండు ధౌమ్యునకు నమస్కరించి యి ట్లనియె. 35

తే. వనమునకువచ్చినప్పుడు వలవదనఁగఁ, డనిననునుఁ గికమిత్రోన్నయముగు దెంతు
మనిరిబ్రాహ్మణుల్ వీరికాహారమేయు, పాయమున నుగ్రవనమునఁ బడయనేర్తు.

వ. వీరల విడువనోప నేమి సేయుదు ననిన విని ధౌమ్యుండు పెద్దయుం బ్రొద్దు చింతించి ధర్మరాజున కి ట్లనియె. 37

ఆ. భూతరాశి తొల్లి పుట్టి బుభుక్షాభి, తప్తమయినఁ జూచి తద్భయంబు
నపనయింపఁ గడఁగి యదితిసుతాగ్రణి, కమలబాంధవుండు గరుణతోడ. 38

వ. ఉత్తరాయణగతుం డై యుర్వీరసంబు పరిగ్రహించి దక్షిణాయనగతిం బర్జన్యభూతుం డై యోషధులం బడసి రాత్రులయందుఁ జంద్రకిరణామృతంబునం జేసి వానిం దడుపుచు వర్ధించి యం దన్నంబు పుట్టించి [5]ప్రజాప్రాణధారణంబుసేయుటం జేసి యన్నం బాదిత్యమయం బని యెఱింగి తొల్లి భీమ వైన్య కార్తవీర్య నహుషాదులు యోగసమాధిస్థితులై సూర్యభజనంబున నన్నంబుఁ బడసి యాపదలవలనం బ్రజల సముద్ధరించిరి కావున. 39

లయగ్రాహి.
వారిరుహమిత్త్రు నమరోరగమునిద్యుచరచారణగణప్రణుతుఁ జారుగుణు భూతా
ధారు నఖిలశ్రుతిశరీరు హరి శంకర సరోరుహభవప్రతిము దారుణతమిస్రా
దారణమరీచిపరిపూరితదిగంతరు నఘారి నతికారుణికు సూరుఁ ద్రిజగద్ర
తౌరతు సహస్రకరుఁ గోరి భజియింపుము మనోరథఫలంబు లగు భూరిభుజ నీకున్.

వ. అని ధౌమ్యుండు విశుద్ధాత్ముం డైన ధర్మరాజునకు సూర్యుం డర్యముండు భగుం

1. గ. ధారణరుచివిజ్ఞాన. 2. జ. సంబంధితుండవు. 3. గ. ప్రారంభితం బైన. 4. క. భరింపుచు నీ మనోరథంబు సఫలం బగు ననిన. 5. గ. ప్రజా[illegible]ణంబు.

డనునివి మొదలుగాఁగలనామంబుల యష్టోత్తరశతంబు నభీష్టసిద్ధిప్రదంబయినదాని విస్పష్టార్థవర్ణోచ్చారణంబును విధియుక్తంబునుగా నుపదేశించి దీనిం దొల్లి యింద్రువలన [నారదుండు వడసె నారదువలన (వసు వసురాజు వడసె నాతని వలన) నేను బడసితి] నేను నీ కిచ్చితి నిది దేవనిర్మితంబు దీన నాదిత్యు నతి భక్తి నారాధింపు మనిన. 41

— * ధర్మరాజు సూర్యు నారాధించి వరంబు గొనుట. * —

సీ. హితుఁ డైనతనపురోహితునుపదేశంబుఁ, జేర్మితోఁ జేకొని ధర్మసుతుఁడు
నెమ్మిఁ బుష్పోపహారమ్ముల నాదిత్యుఁ, బూజించి భాగీరథీజలంబు
లం దుండి విషయంబులం దింద్రియంబుల, [1]ననవరతావధానమున నొడిచి
వాయుభోజనుఁడుఁ బ్రాణాయామపరుఁడు నై, సూర్యాదినామముల్ సూర్యుఁ గుఱిచి
ఆ. జపముసేయుచున్నఁ దపనుఁ డాతనికిఁ బ్రత్యక్ష మయ్యె త్రిలోకచక్షుఁ డమర
వరుఁడు దురితహరుఁడు తరణి త్రయీమూర్తి, వనజమిత్త్రుఁ డిట్టులనియెఁ గరుణ.

వ. నీతపమునకు మెచ్చితి నీ(వరణ్యమున నుండఁగల) పండ్రెండేండ్లును వన్యఫలమూల కంబులు నీమహానసంబున ద్రుపద రాజపుత్త్రిచేత సాధితంబు లై యక్షయంబు లైన చతుర్విధాహారంబు లగు నని వరం బిచ్చి వనజహితుం డంతర్హితుం డైన.

చ. అడరఁగ ధర్మనందనుఁ డహర్పతిచేత వరంబు పేర్మితోఁ
బడసి మహీసురోత్తముల భవ్యులఁ బల్వుర నిర్వహించె న
ప్పుడు ద్రుపదాధిరాజసుత పొల్పుగ వండినశాకమూలముల్
గడురుచి నిష్టభోజనసుఖంబును దృప్తియుఁ జేయుచుండఁగన్. 44

వ. ఇట్లనేకసహస్రమహీసురవరుల ననుదినంబును నభిమతభోజనంబులం దనిపి విఘసామృతభోజనంబులం దృప్తులైన [2]తనపతులభుక్తశేషంబు ద్రుపదపుత్త్రిక యుపయోగించుచుండం గొన్నిదినంబు లంద యుండి పాండవులు బ్రాహ్మణులచేతం గృతస్వస్త్యయను లై బ్రహ్మర్షిసంఘంబులతోఁ గామ్యకవనంబున కరిగి రంత నిట ధృతరాష్ట్రుండు విదురుం బిలిపించి నీవు భార్గవుకంటె బుద్ధిమంతుడవు పాండవకౌరవులకు సముండవు సమ్మతుండవుఁ జెప్పుమింక నప్పాండవు లేమి సేయువా రనిన విదురుం డి ట్లనియె. 45

మత్తకోకిలము. దేవమూర్తులు పాండుపుత్త్రులు ధీరచిత్తులు వారి పెం
పే వెఱుంగనివాఁడవే ధరణీశ వాయుసుతుండు గాం
డీవియుం భుజవిక్రమప్రకటీకృతుల్ వివిధాస్త్రవి
ద్యావిశేషులు వైరివీరులఁ దక్క నిత్తురె పోరులన్. 46

క. కదిసి యధర్మద్యూతం,బున భేదము పుట్టెఁ బాండుపుత్త్రులకును నీ
తనయుల కని మును చెప్పిన, విన నొల్లక కొఱకుపలుకులవింటిని కడఁకన్. 47

1. గ. ననవరతానుధ్యానమున నొడిచి. 2. పొమ్మ భుక్త.

వ. ఇంక నయినను వారి రావించి తొల్లి నీచేతం బడయంబడిన రాజ్యంబునందుఁ బ్రతిష్ఠించి కీర్తియు ధర్మంబును నిలుపుము రాజ్యంబును ద్రివర్గంబును ధర్మమూలంబులు గావున నందవర్తిల్లు మధర్మవర్తి యయి కర్ణశకునిదుశ్శాసనశిక్షితుండైన దుర్యోధను దుశ్చేష్టితంబుల కొడంబడ వలవదు. 48

తే. వీనిఁ బుట్టినపాపంపువేళఁ బెక్కు, దుర్నిమిత్తముల్ పుట్టిన నిర్ణయించి
యేను జెప్పితిఁ దొల్లియు వీనిచేత, నెట్టుఁ గౌరవులకు నెగ్గు పుట్టు ననియు.

వ. కులదూషకు దూషించి కులంబు రక్షించుట ధర్మువు ధర్మరాజు నఖిలమహీరాజ్యరక్షకుం జేసి పుత్త్రపౌత్త్రమిత్రామాత్యబంధువర్గంబుల నెల్ల రక్షింపుము సభామధ్యంబునందు ద్రౌపదీభీమసేనులం బ్రార్థింప దుశ్శాసనుం బంపుము. 50

చ. అతిశయతామరోత్తముఁ డహార్వతితేజుఁ డజాతశత్రుఁ డూ
ర్జితుఁ డజితుండు నీసుతులు సేసినయెగ్గు దలంపఁ డాతనిన్
ధృతి ననునీతుఁ జేయుము ప్రతీపకులోత్తమ యిట్లయైన నీ
[1]కృతమునఁ గౌరవాన్వయ మకిల్బిషకీర్తిఁ బ్రకాశితం బగున్. 51

వ. అని పలికిన విదురుపలుకులు విని కడు నలిగి ధృతరాష్ట్రుం డి ట్లనియె. 52

క. నాదేహంబునఁ బుట్టిన, యాదిసుతుల్ విడువ నెట్టు లగు నాత్మజులం
గా దనక విఘాతించు ద, యాదూరులు గలరె యిట్టు లన నీ కగునే. 53

వ. నీవు నాకొడుకులయున్నతి కెన్నండు సహింపవు నీసహాయత్వంబు నే నొల్లఁ బాండవులకడ కేనియు నొండుగడ కేనియు నీకిష్టం బైనచోటికి నరుగు మనిన నాక్షణంబ విదురుండు మనోజవైకరథారూఢుండై పాండవులకడకుం గామ్యకవనంబున కరిగె నంత నతనిరాక దవ్వులం గని ధర్మరాజు భీమసేనున కి ట్లనియె. 54

సీ. గాండీవ మాదిగాఁ గలయాయుధావలు, లుక్కివంబున నప్పు డొడిచికొనఁగ
మఱచినవాఁ డయ్యు మందాత్ముఁ డాధార్త, రాష్ట్రుండు గాంధారరాజతనయు
వచనముల్ విని యక్షవతి నెపంబున వానిఁ, గష్టుఁ డైకొని సమకట్టి మనల
మగిడింపఁగా దుష్టమతిఁ జేసి విదురుఁ బు, త్తెంచెఁగా కున్న నే తేరఁ డితఁడు

ఆ. నింక జూద మాడ నే నోప నిది పని, గాఁగ వచ్చు నొక్కొ కడఁగి విదురుఁ
డేమి సేయువార మితని నియోగంబు, మనకుఁ జేయ కునికి మానుషంబె. 55

వ. అని తమలోఁ బలుకుచున్నసమయంబున విదురుం డేతెంచిన నతనికిఁ బ్రత్యుద్గతు లై వినయప్రియసత్కారంబుల సంతుష్టుం జేసి తదాగమననిమిత్తం బడిగిన వారికి విదురుం డి ట్లనియె. 56

క. మతి వారికి మాకును గడు, హితుఁడవు చెప్పుమయ్య యింక నెయ్యది కార్య
స్థితి యని ధృతరాష్ట్రుం డే, కత మిష్టం బైనకార్యగతి న న్నడుగన్. 57

వ. ఏ నుభయపక్షంబులవారికి జగంబునకు లగ్గుగ హితం బైనవిధంబు సెప్పిన నది

1. క: కతమున,..మకల్మషకీర్తిఁ.

సర్వజనరుచికరం బైన యాహారంబు రోగాతురునకు నరుచికరం బైనయట్లయత
నికి రుచియింపదయ్యె. 58

ఆ. కార్యగతుల తెఱఁగు కలరూపు సెప్పిన, నధికమతులు దానిఁ[1]నాదరింతు
రల్పకార్యబుద్ధు లగువారలకు నది, విరసకారణంబు విషముపోలె. 59

వ. దానఁ జేసి ధృతరాష్ట్రుండు న న్నొల్లక యెగ్గులు పలికి నీవు విపరీతచేతస్కుండ
వై యుండ వలవదు పాండవులకడకుం బొమ్మనిన వచ్చితి రూపలావణ్యవతియై
వృద్ధశ్రోత్రియునిచేతం బరిణీత యైన తరుణియుంబోలె రాజ్యలక్ష్మి యద్దురాత్ము
నందు విరక్తయ కాని ప్రీతిఁ బుట్టింపదు. 60

ఆ. ధర్మరహితు లైనధార్తరాష్ట్రులకు భూ,రాజ్యలక్ష్మి సుస్థిరంబు గాదు
ధర్మతనయ నిన్నుఁ దద్రాజ్యసంపదల్, వలచి తమకుఁ దామ వచ్చి పొందు.

వ. నావచనంబున నెగడునది యనిన ధర్మరాజు నట్ల చేయుదు నని యున్నంత నిట
ధృతరాష్ట్రుండు పాండవులయొద్ద విదురునునికి యెఱింగి ధృతిహీనుండై తన
హృదయంబును దృష్టియుంబోని విదురుం బాసి నిమిషంబేని నిర్వహింప
నోపక సంజయున కిట్లనియె. 62

క. నెమ్మిగలవాని నాచి, త్తమ్మెఱిఁగెడువాని విదురు ధర్మప్రియు నా
తమ్ము నిట వేగఁ దోడ్కొని, ర మ్మరుగుము కామ్యకాఖ్యరమ్యాటవికిన్. 63

వ. అని పంచిన నప్పుడ సంజయుం డతిత్వరితగతిం గామ్యకవనంబున కరిగి. 64

మ. ధరణీదేవసహస్రసంకులముతో ధౌమ్యుండు ధర్మక్షమా
భరణుల్ నల్వురు దమ్ములున్ విదురుఁడుం బాంచాలియుం బ్రీతిబం
ధురు లై [2]కొల్చుచు నుండ నున్నబుధమిత్రస్తుత్యున్ ధర్మరాజుం బ్రభా
స్వరతేజుం బ్రభుఁ గాంచి సంజయుఁడు సంజాత ప్రమోదాత్ముఁ డై. 65

క. వనవాసము సేసియుఁ బ్రభు,వనరాజ్యము సేయునట్టివడువున సంతో
షనిబద్ధబుద్ధి యగు యమ, తనూజునకు భక్తి నెఱఁగి తా నిట్లనియెన్. 66

వ. మిమ్ము ధర్మార్థవిదుం డైనవిదురునిం గౌరవేంద్రుం డెప్పుడుం దలంచుచుండు
మీయనుమతంబునఁ దనయనుజుం దోడ్కొని తేర నన్నుఁ బుత్తెంచె ననిన విని
ధర్మరాజు విదురున కిట్లనియె. 67

తే. సర్వజనులును ధృతరాష్ట్రశాసనంబు, సేయుచున్నచో మనకు విశేషభక్తిఁ
జేయవలయుఁగావున నెడసేయ కరుగు, మనిన విదురుండు గజపురి కరిగెనంత.

వ. ధృతరాష్ట్రుండును వినయవినమితోత్తమాంగుం డైన విదురు నతిస్నేహంబునం
గౌఁగిలించుకొని మూర్ధాఘ్రాణంబు సేసి నీవు నిత్యక్షమానిరతుండవు నాబుద్ధి
లేమికి క్షమియింపు మనిన విదురుం డి ట్లనియె, 69

1. క. ననుచరింతు. 2. గ. కొల్వఁగ నొప్పుచున్నబుధబంధురున్

ఆ. నీవు నీ సుతుండు ✽ నెఱిఁ దప్పి పలికినఁ, బథ్యమయినపలుక ✽ పలుక వలయు
వీరు లయిన పాండ✽వేయులతో విగ్ర, హంబు సేయు టిది న✽యంబుగాదు. 70

వ. అనుచు నెప్పటియట్ల కార్యసహాయుం డై విదురుండు ధృతరాష్ట్రునొద్ద నున్న నయ్యుద్ధప్రసంగమంబునకు శంకించి దుర్యోధనుండు కర్ణశకునిదుశ్శాసనులతో ని ట్లనియె. 71

క. పాండవహితుఁ డగువిదురుఁడు, వెండియుఁ జనుదెంచి కార్య✽విధులందు సహా
యుం డయ్యెనతనితోడ హి, తుండయి మంతనముసేయఁ✽దొడఁగెఁ గావిభుఁడున్.

వ. వీర లింకఁ బాండవుల నిందులకు రావించువార లయిన నగ్నివిషజలంబులు ప్రయోగించి వారల కపాయంబు సేయుద మనినవిని శకుని దుర్యోధనుం జూచి యిట్లేల బాలిశం బైనమతిఁదలంచితివి విదురధృతరాష్ట్రులువిపరీతమతులై రావించినను నిత్యసత్యనిరతు లైన యప్పాండవులు దముచేసిన సమయంబు సలుపక యేల వచ్చువా రగుదు రనిన శకునిదుర్యోధనులకుఁ గర్ణుం డి ట్లనియె. 73

ఉ॥ ఇ త్తఱిఁ బన్నిపోయి పయి ✽ నె త్తి రణం బొనరించి వారలన్
మి త్తికి నంపి ధాత్రి నిర ✽ మిత్రముఁ జేయుద మిట్టులైనఁ ద
ద్వృత్తులు నీక దక్కుఁ గురు ✽ వీర కడంగుము నావుడున్ మదో
న్మత్తుఁడు కౌరవుం డతని ✽ మాటకు సంతస మంది చెచ్చెరన్. 74

వ. సమరసన్నద్ధుఁడై సమస్తబలంబును సమకట్టి వెలువడినం దన దివ్యదృష్టి నంతయు నెఱింగి కృష్ణద్వైపాయనుండు వచ్చి యిది ధర్మంబుగా దుడుగు మని దుర్యోధనుని వారించి ధృతరాష్ట్రున కి ట్లనియె. 75

క. పుడమియు రాజ్యముఁ గోల్పడి, యడవుల నేకతమ యున్న✽యప్పాండవులం
గడఁగి వధియింపఁగా నీ,కొడు కరిగెడు నిట్లు తలఁపఁ ✽ గూడునె బుద్ధిన్. 76

క. ధృతియుతు లై [1]సత్యవ్రత, రతులయి పదమూఁడు వత్స✽రంబులు ధర్మ
స్థితి సలిపి వార కడఁగెద, రతులపరాక్రములు మీఁద✽నాహవమునకున్. 77

క. వనగతులని వారలపైఁ, జని భంగముఁ బొంది రాఁగ ✽ సమకట్టెడు నీ
తనయుఁడు గావున నీ వా, తని వారింపు మది యనుచి✽తంబని నెమ్మిన్. 78

క. విను [2]నీవును, గురుఁడును శాం,తనవుఁడు విదురుండు నుండి ✽ తగునె యధర్మం
[3]బున నీ. యుపేక్ష నవయం, బును బాండవవిగ్రహంబు ✽ పుట్టుట లగ్గే. 79

వ. అనిన విని ధృతరాష్ట్రుండు దుఃఖితుం డై నాకును గాంధారికిని భీష్మవిదురకృపద్రోణులకు ననిష్టంబైనదుష్టద్యూతంబు [4]ప్రవర్తించి దుర్బుద్ధి యైన దుర్యోధనుం బుత్త్రస్నేహంబున విడువనోప (నేమిసేయుదు) ననిన ధృతరాష్ట్రునకుఁ గృష్ణద్వైపాయనుం డి ట్లనియె. 80

1. గ. యురుసత్యవ్రతు లై. 2. అ. మేను నీవు గురుశాంతనవులు, 3. జ. బు నుపేక్షింపఁగఁగ నవయంబునఁ. 4. ఇది ప్రేరణార్థకము.

—♦ ధృతరాష్ట్రునకు వ్యాసుఁ డింద్రసురభిసంవాదంబు సెప్పుట. ✱—

ఆ. ఎల్ల సెయ్యములకుఁ దల్లిదండ్రులయందు, సుతులవలని సెయ్య మతిశయంబు
ధనము లెంత గలిగినను సుతరహితుల, కెమ్మెయిని మనఃప్రియమ్ము లేదు.

వ. తొల్లి సకలగోమాత యయినసురభి సురరాజుకడకుంబోయి కరుణంబుగా నేడ్చిన
దానిం జూచి సురపతి విస్మితుండై యిట్లేల రోదనాకులితలోచనవయి యున్న
దాన వెల్లవారికి లగ్గ కదా యనిన నింద్రునకు సురభి యి ట్లనియె. 82

క. నీ వజ్రము రక్షింపఁగ, నా వారికిఁ దక్కఁ ద్రిభువనంబులఁ గల భూ
తావలి కెల్లను గుశలము, దేవేంద్ర జగత్త్రియప్రదీప మహాత్మా! 83

వ. దీనిం జిత్తగింపుము బలంబు గలబలీవర్దంబులతో బలహీనంబు లయినవానిం
బూన్చిన నవి దుర్వహాభార వహనమహా లాంగలాకర్షణంబులయం దసమర్థంబు
లైన నడచియుం బొడిచియు ములుకోలలం గుట్టియుఁ దిట్టియు దుర్బలబలీవర్దంబుల
జనులు బాధింపం జూచి యేను దానికి దుఃఖించెద ననిన సురభికి సురపతి
యిట్లనియె. 84

క. నీకు నపత్యశతంబు ల,నేకంబులు గలవు వాని కేకాకృతి దుః
ఖాకులత సంభవింపదు, శోకింపకు మనిన సురభి సురపతి కనియెన్. 83

వ. దేవా! దీనాననంబులయి దుర్బలంబులయిన యపత్యంబులదుఃఖం జే నెట్లు
చూడ నోపుదు ననిన నగి యింద్రుండు దానికిం గరుణించి వర్షంబునఁ దృణవర్ధ
నంబు సేసి దుర్బలబలీవర్దంబులకు బలంబు గావించె నని యింద్రసురభిసంవా
దంబు (వేదంబులందు) వినంబడుఁగావున నీకుం బుత్త్రస్నేహంబుసామాన్యంబు
గా దైనను దీనులై వనంబున నవయుచున్న యప్పాండవులకుదయాళుండవగుము.

తే. నీవుఁ బాండుండు విదురుండు నెమ్మినాకు
నొక్కరూపైనయట్లు నీ కుదితయశులు
నీ సుతులు నూర్వురును బాండునృపతనూజు
లేవురును నొక్కరూపకా నెఱుఁగవలయు. 87

క. సుజనుల సహవాసంబున, గుజనులు సద్ధర్మమతు లగుట నిక్కము ధ
ర్మజు నొద్దనుండి నీ యా, త్మజుఁడు ప్రశాంతుండు ధర్మమార్గుండునగున్. 88

వ. రాజర్షియైన ధర్మరాజుతోడి సహవాసంబు సర్వజనహితంబు గావున నాతనినుపా
సించి దుర్యోధనుం (డతనియొద్ద) గొండొక కాలం బుండునట్లుగాఁ బనుపుమట్ల
యిన నుభయపక్షంబులకు లగ్గగు ననిన ధృతరాష్ట్రుండు గృతాంజలియయి
మునీంద్రా దుర్యోధనుండు నా పలుకులు వినండు కురుకులంబు రక్షించునట్టి
బుద్ధిగల దేని వాని మీర శిక్షింపుం డని మ్రొక్కిన.

క. అనఘుఁడు మైత్రేయుం డను, మునినాథుఁడు వచ్చి ధర్మమున నాతనిఁ దా
ననుశాసించుఁ దిరంబుగ, నని చెప్పుచు నప్పరాశరాత్మజుఁ డరిగెన్. 90

వ. అంత. 91

ఉ. న్యాయవిదుండు కామ్యకవనంబున ధర్మజునొద్దనుండి మై
త్రేయుఁడు ధీయుతుం డరుగుదెంచిన నప్పుడ యమ్మునీంద్రు నిం
ద్రాయితుఁ డాంబికేయుఁ డుచితస్థితిఁ బూజితుఁ జేసి నాత్మ ని
శ్శ్రేయసలాలసుం డయి విశేషసపర్యలఁ జేసి భక్తితోన్. 92

వ. ఇట్లు దనచేతం బూజితుం డై సుఖవిశ్రాంతుం డైన మునివరునకు ధృతరాష్ట్రుండు ముకుళితహస్తుం డై భట్టారకా యెందుండి వచ్చితి రని యడిగిన నతనికి మైత్రేయుం డి ట్లనియె. 93

చ. అలఘుతపోభరంబున జటాజినముల్ ధరియించి రూక్షవ
ల్కలములు గట్టి కూరలును గాయలుఁ బండ్లు భోజనంబుగా
నలయక కామ్యకం బనుమహావిపినంబున నున్న పాండవే
యులకడనుండి వచ్చితిఁ గురూత్తమ నీసుతు నిన్నుఁ జూడఁగన్ 94

వ. ఏ నఖిలతీర్థదర్శనార్థంబు పరిభ్రమించుచుఁ గురుజాంగలంబున కరిగి యందుఁ గురుకులోత్తము లైన పాండుపుత్త్రులం జూచితి. 95

ఆ. అనిన నవనతాస్యుఁడయి ధృతరాష్ట్రుఁడి, ట్లనియె నెట్లు సెప్పెఁడయ్య యందు
పాండవులకు సత్యభాషణులకుఁ గుశ,లంబె వార లిటఁ దలంతురొక్కొ. 96

క. అమితభుజశక్తి నంతక,సము లప్పాండుసుతు లిందు సౌభ్రాత్రస్నే
హమునకు విచ్ఛేదముగా, సమయాతిక్రమము సేయ సమకట్టరుగా. 97

వ. అనిన మైత్రేయుం డి ట్లనియె. 98

క. చనుదెంచి మహామునివరు, లనవరతము వారలకుఁ బ్రియం బొనరఁగ దీ
వన లీఁగఁ జేసి కుశలము, మనుజేశ్వర వారు ధర్మమతియుతు లగుటన్. 99

క. వారలు సమయము దప్పిన, వారిజరిపుహితులగతు లవశ్యముఁ దప్పం
వారికి నకారణంబ ని,కారము నీకొడుకు సేసెఁ గడు నహితుం డై. 100

వ. అని దుర్యోధనుం జూచి యయ్యా నీవు బుద్ధి గలవేనిఁ బాండవులతో విరోధంబుడుగు మట్లయిన నీకును వారికిం గురుకులంబునకు లగ్గగు నాపలుకుఁ జేకొనుము.

సీ. వజ్రసంహనను లవార్యపరాక్రముల్, పాండుకుమారు లాఖండలాభు
లందఱు నాగశతాయుతప్రాణు లు,గ్రాహవకాంక్షు లుత్సాహపరులు
వారలలో బలవంతుఁడు బకహిడిం,బాసురు లనువారి [2]నాసురమునఁ
జంపె నాగాయుతసత్త్వు జరాసంధు, నెక్కటి యోర్చె నయక్కజుండు

తే. ఘోరవనమున వీరుఁ గిమ్మీరుఁ డనుసు, రారి [3]నిశ్చలఘనభీకరాంగుఁ బట్టి
పోర వధియించినట్టి సమీరజునకు, భూరిభుజునకు మార్కొనువారుఁ గలరె.

1. అ. నాహాతమున. 2. క. ఘోరరణమున. 3. అ. నిశ్చలభీకరాంగారు.

—* మైత్రేయుఁడు దుర్యోధనుని శపించుట *—

వ. వారికి వాసుదేవధృష్టద్యుమ్నులు సంబంధసహాయులు జరామరణవంతు లైన
మనుజులు వారిం జెనకి యెట్లు జీవింతురు నీవు వారితోఁ జోడంబడి యుండుమిది
కార్యం బనిన మైత్రేయుపలుకు లాదరింపక పాదాంగుష్ఠంబున నేల వ్రాయుచు
బాహువు లెత్తి తొడలు సఱచి నగుచున్నయాదుర్యోధనుం జూచి మైత్రేయుం
డలిగి యీయపరాధంబున నాహవం బగు నందు భీముగదాఘాతంబుననీయూ
రుయుగళంబు భగ్నం బయ్యెడుమని శాపం బిచ్చిన వెఱచి ధృతరాష్ట్రుండు
మునీంద్రా యట్లు గాకుండం బ్రసాదింపు మనిన నమ్మునివరుం డి ట్లనియె. 103

తే. కడఁగి సమబుద్ధి వీనికిఁ గలిగెనేనిఁ, గాదు శాపఫలం బట్లు గాక బుద్ధి
హీనుఁ డై గర్వితుం డగునేని శాప,హవ్యవాహఫలంబు వీఁ డనుభవించు.

వ. అని ప్రసన్నుం డైన మైత్రేయునకు నాంబికేయుం డి ట్లనియె. 105

క. కిమ్మీరుం డనురక్కసుఁ, డమ్మారుతతనయుచేత నత్యుగ్రవనాం
తమ్మున నిహతుం డయినవి,ధ మ్మెట్టులు సెప్పు మద్భుతం బిది యనినన్. 106

వ. నాపలుకులు నీకొడుకు వినఁడ యేనేల చెప్పెద దీనిం బాండవసహాయు లైన
విప్రులచేత విదురుం డిమ్మగా నెఱింగినవాఁ డతనివలన విను మని చెప్పి మైత్రే
యుండరిగినం గిమ్మీరవధకథాశ్రవణ[1]పరుండై తన్నడిగినధృతరాష్ట్రునకు విదురుం
డిట్లనియె నిందుండి చని పాండవులు మూఁడహోరాత్రంబులు నిరంతర
ప్రయాణంబు సేసి కామ్యకవనంబుఁ జొచ్చువా రొక్కనాఁటియర్ధరాత్రంబున
రాక్షసప్రచారవేళ యందుఁ బరిభ్రమించుచు రాక్షసమాయ గావించుచున్న
వాని నతినిశితదంష్ట్రాకరాళుం బైనతనవదనగహ్వరంబుఁ దెఱచి గ్రుడ్లు మెఱవ
బభ్రుకేశంబులు దూల బాలార్కరశ్మియుతం బయినబలాహకంబునుంబోలె
సకల ప్రాణిభయజనకంబుగా గర్జిల్లుచున్నవాని [2]నిజపాదఘట్టితమహీతల ప్రచ
లనవేగ వేల్లితవల్లీపల్లవబాహుపరిరంభణసుఖంబుఁ బాదపంబుల కాపాదించు
చున్నవాని నెదుర నొక్కరక్కసుని గనిరంత వాఁడును బ్రాహ్మణసంఘంబు
ముందటఁ గృష్ణాజినావృతులై వచ్చుపాండవుల దవ్వులం గని మార్గనిరోధి యై
మహాపర్వతంబునుంబోలె నున్న నదృష్టపూర్వప్రమాణం బైనవాని దేహంబుఁ
జూచి నిమీలితనయనయయి దుశ్శాసన కరాకృష్టవికీర్ణ వేణీభరంబు వెనువెంట
నొలయం బాంచాలి పంచపర్వతంబులనడిమినదియుంబోలెఁ బతులనడుమ భయ
వ్యాకులచిత్తయైన నింద్రియంబులు విషయరతిం బరిగ్రహించునట్లు లేవురు
నక్కోమలిం బట్టుకొని భయపడకుండ నాశ్వాసించుచున్నంత. 107

క. రక్షోఘ్నమంత్రముల నా,రాక్షసమాయాపరిస్ఫురణఁ జెఱిచెఁ గ్రియా
దక్షుఁడు ధౌమ్యుఁడు పాండవు, లీక్షించుచు నుండఁగా నష్టహీన ప్రతిభన్. 108

1. క. కౌతూహలుం డై. 2. క. ఘ. నిజపాద ఘట్టన మహీతల ప్రచార వెల్లిత వల్లీ పల్లవ.

వ. అంత. 109

క. ప్రతివిహితమాయు నత్యా, యతభుజయుగుఁ గోపఘూర్ణితారుణవిస్ఫా
రితనేత్రు నసురఁ జూచి భ, రతకులనందనుఁడు ధర్మరా జిట్లనియెన్. 110

వ. నీ వెవ్వరివాఁడ వెవ్వండ వీవనంబున నేల యున్నవాఁడ వనిన వాఁ డి ట్లనియె.

క. ఏను బకాసురునసుజుఁడఁ, గినాశుఁడ మానవులకుఁ గిమ్మీరుఁ డనం
గా నెగడుదు నీకామ్యక, కాననమున సర్వసత్త్వఖాదనబుద్ధిన్. 112

క. పాయక యుండుదు రాక్షస, మాయల సమరంబు సేసి మనుజుల విగతో
పాయులఁ జంపుచు భక్షణ, సేయుదు నమరాదులకు నజేయుఁడఁ బోరన్. 113

వ. నాకు వెఱచి యెల్లవారును నతిదూరంబున దీనిం బరిహరింతురు మీ రెవ్వరిం
దుల కేల వచ్చితిరి మి మ్మందఱ వధియించి యిపుడ భక్షించెద ననిన వానికి
యుధిష్ఠిరుం డి ట్లనియె. 114

ఆ. ఏను ధర్మసుతుఁడ నీతఁడు భీముండు, వాఁడు విజయుఁ డల్లవారు గవలు
[1]పాండవేయుల మనుప్రథ వనవాసంబు, సేయవచ్చితిమి విశేషయుక్తి. 115

సీ. అనవుడు రాక్షసు లట్టహాసంబుతో, నెట్టు భీముండె యీతఁ డేమి
పుణ్యమో వీని నెప్పుడు సంపఁ గాంతునో, యనియున్నచోఁ దానయయరుగుదెంచె
నధిక మాయన్న బకాసురు నాయిష్ట, సఖు హిడింబాసురుఁ జంపి యున్న
ఖలు మ్రింగి జీర్ణంబు గావింతు వాతాపిఁ, దడయక మ్రింగినతపసియట్ల

ఆ. యనిన రక్కసునకు [2]నదిగిన యగ్రజు, నలుక యెఱిఁగి వీరుఁ డర్జునుండు
మొనసి గాండివంబు మోపెట్టె నవశిత, ఖడ్గపాణులైరి కవలు నంత. 116

—♦ కిమ్మీరుం డను రాక్షసుఁడు భీముచేఁ జచ్చుట. ♦—

ఉ. ఘోరపరాక్రముల్ ప్రబలకోపవరుల్ పృథుసారభూరి భూ
మీరుహపాణు లుద్ధతు లమిత్రవిఘాతులు వీరబృందబృం
దారకు లార్చు చొండొరులఁ దాఁకిరి దారుణభంగిఁ బొంగి కి
మ్మీర సమీర సూనులు సమీరవిధూతపయోధులట్టిరై. 117

తరలము. పొరిని వారలచేతియున్నత[3]భూరుహాయుధముల్ పర
స్పరకఠోరశిరస్స్థలంబులపై వడిం బడి మత్తకుం
జరశిరఃపతితంబు లైన లసన్మృణాళములట్ల జ
ర్జరిత మయ్యెఁ దదారవ ప్రతిశబ్ద మొప్ప [4]నగంబులన్. 118

వ. ఇట్లొక్కముహూర్తంబు వృక్షయుద్ధంబు సేసి యాసన్నమహీరుహంబులు సమ-
సిన నయ్యిద్దఱు శిలాయుద్ధంబునకుఁ దొడంగి చేయునెడం బవనజనిక్షిప్తనిష్ఠుర
శిలాహతహృదయుండై భానుం బట్టుకొనుస్వర్భానుండునుం బోలెఁగిమ్మీరుండు

1. అ. పాండవులము సమయపడి వన 2. నలిగిన. 3. భూరిభూరుహముల్. జ. భూరుహా యుతమౌల్. 4. ఖ. అ. నఖంబునన్.

భీముం బట్టుకొనిన భీముండు వాని హీనబలుంగా నెఱింగి కృతాంతదండానుకారంబులయిన తనబాహుదండంబుల నమ్మనుజకంటకు కటికింత ప్రదేశంబులు పట్టుకొని నేలం బెట్టి దేహయష్టి విఱిచి బకుం జంపినవిధంబునఁ గిమ్మీరు విగతప్రాణుం జేసి. 119

తే. బకహిడింబులు హతులైనఁ బనవి పనవి, యఱచిశోకింపఁగానక యమపురమున
కరిగి తక్కట రాక్షస యనుచుఁ దెరువు,వాయఁ బావనిదత్కళేబరము వైచె.

వ. ఇట్లు ధర్మరాజువచనంబునఁ గిమ్మీరు నశ్రమంబున వధియించి తద్వనవాసులకు రాక్షసభయం బుడిపినమహావీరునమ్మారుతాత్మజుధర్మార్జుననకులసహదేవులును ధౌమ్యాదిమహీసురవరులును బ్రశంసించి రని విదురుండు గిమ్మీరువధ సెప్పిన విని ధార్తరాష్ట్రులకు హృదయదలనం బయ్యెనిటఁ బాండవులు కామ్యకవనంబున నుండునంత. 121

—* యాదవపాంచాలాదులు పాండవులకడ కేతెంచుట. *—

సీ. వసుమతీరాజ్యంబువలన నిరస్తులై, మునివృత్తి నత్యుగ్రవనములోన
నవయుచుఁ బాండుభూనాథనందను లున్న,వారని విని యతిక్రూరమతుల
ధృతరాష్ట్రసుతుల నిందించుచుఁ బాంచాల, యాదవవృష్ణిభోజాంధు లెల్ల
నచ్యుత ప్రముఖులై యప్పాండవులకడ, కేతెంచి శోకపరీతు లగుచు

ఆ. నున్న నధికధర్మయుక్తుఁ డుపేంద్రుండు, నికృతిఁ జేసె పాపనియతబుద్ధిఁ
బాండవులకు నట్లపాయంబు సేసిన, ధార్తరాష్ట్రులకును దద్ద యలిగి. 122

క. అనిఁ గర్ణశకునిదుర్యో,ధనదుశ్శాసన నవాస్త్రధారాపాతం
బునఁ దృప్తి వొందు వసుధాం,గన రాక్షసకాకగృధ్రగణములతోడన్. 123

క. అవినీతుల వధ్యులఁ గౌ,రవపాంసులఁ జంపి ధర్మరాజునకుఁ గురు
ప్రవరున కొనరింతమ యీ,యవనీరాజ్యాభిషేక [1]మవిజితశక్తిన్. 124

వ. అని యుగాంతకాలకుపిత కృతాంతాకృతి నున్నజగన్నాథు జనార్దనుం బ్రశాంతచిత్తుం జేసి యర్జునుం డతని నిట్లని కీర్తించె. 125

ఆ. పూజ్యుఁడవు పురాణపురుషుండ వీవుండ, వప్రమేయుఁడవు చరాచరంబు
లయిన భూతరాసు లచ్యుత నీయంద, పుట్టు నిలుచు లయముఁ బొందుచుండు.

వ. నీవు దొల్లి గంధమాదనంబునం గందమూలఫలాశనుండవై పదివేలేండ్లు తపంబు సేసి పుష్కరంబున నేకాదశసహస్రవర్షంబులు జలంబుల యాహారంబుగా నుండి ప్రభాసంబను తీర్థంబున దివ్యసహస్రవర్షంబు లేకపాదస్థితుండవయి యుండిబదరీవనంబునం [2]బవనంబు భక్షించుచు నూర్ధ్వబాహుండవయి యేకపాదంబున ననేకసహస్రవర్షంబులు నిలిచి సరస్వతీసత్త్రంబున [3]నవకృష్టోత్తరాసంగుండవై నియమకృశీకృతశరీరంబుతోఁ బంద్రెండువర్షంబు లశేష వ్రతంబులు సలిపిననతపో

1. గ. మనహితబుద్ధిన్. 2. జ. దళ్ఫలంబులు. 3. గ. నవకృష్టోత్తరా,

నిధానంబవు నిఖిలలోకజైత్రుండ వయి చైత్రరథంబున నుత్తమక్రతువు లనేకం
బులు సేసియొక్కొక్క క్రతువునకు నూఱు నేసిలక్షలు సువర్ణంబులుదక్షిణలిచ్చిన
యజ్ఞపురుషుండవు తపోయజ్ఞంబులు రెంటను సమృద్ధతేజుండ వయి దైత్యదాన
వేంద్రుల వధియించి యింద్రున కింద్రత్వం బేకాధిష్ఠితంబు సేసిన లోకప్రభుండ
వదితికిం గశ్యపునకు నుదయించి యింద్రానుజుండవై త్రివిక్రమంబులం ద్రిజగం
బుల నభివ్యాపించిన విశ్వరూపధరుండవు. 127

క. నరకశిశుపాలు రాదిగ, ధరణీకంటకుల నధిక తరదర్పులు బ
ల్వీర వధియింపఁగ మహి నవ, తరించినమహాత్ముఁడవు సుస్థిరశక్తిన్. 128

క. అనృతము మదమును మత్సర, మును గ్రోధము[1]ననువికార ములు వొరయునె ని
న్ననుపమగుణముల నీకొరు, లెన వోల్పఁగఁ గలరె సురముకసీంద్ర ప్రణుతా. 129

వ. అని కృతాంజలి యయిన ధనంజయుం జూచి దనుజభంజనుం డిట్లనియె. 130

తే. నరుఁడు నారాయణుండునాఁబరగు నాది,మునుల మిద్దఱమందునీవనఘ నరుఁడ
వేను నారాయణండ నకనూనశక్తి, యతులమై మర్త్యయోనిఁ బుట్టితిమి పేర్మి.

తరువోజ. నిరతంబుగా నేను నీ వనుభేదనియమంబు లే [2]దైక్యనిష్ఠయ మనకు
నిరువురకును నీకు నిష్టుండ నాకు నిష్టుండు మఱి నీ కనిష్టుండ నాకుఁ
గర మనిష్టుం డట్లుగా నమ్ముమనుచు ఘనభుజుల్ భువనోపకారైకమతులు
హరియునర్జునుఁడు బ్రియముతోడఁదగిలియన్యోన్యహితభాషు లగుచుండునంత.

— ♦ ద్రౌపది శ్రీకృష్ణునితోఁ దనపరిభవంబు సెప్పి దుఃఖించుట ♦ —

వ. అఖిలరాజలోకపరివృతుం డయియున్న నారాయణునొద్దకు వచ్చి ద్రుపదరాజ
పుత్త్రి ముకుళితకరాంబుజ యయి నిన్ను నాది ప్రజాసర్గంబునఁ బ్రజాపతి వనియసి
తుం డయినదేవలుండును సత్యంబువలన యజ్ఞం బుద్ధరించుటంజేసి నిత్యసత్య
మయుండ వయినయజ్ఞపురుషుండవని కశ్యపుండును శిరంబున దివంబును బాదం
బుల మేదినియును లోచనంబుల సూర్యుండును నవయవంబుల లోకంబులు నభి
వ్యాపించుటంజేసి సర్వమయుండ వని నారదుండును నక్షయజ్ఞాననిధి వని సర్వ
మునిముఖ్యులును జెప్పిరి. 133

మధ్యాక్కర. అని నివృత్తు లై పుణ్యచరితు లైయాత్మప్రబోధ
వినిహితచిత్తు లై సర్వధర్మార్థ విదు లయి తృప్తిఁ
దన రెడు రాజర్షి వరులకును యోగ ధరులకు సాధు
జనులకు గతి నీవ నిత్యకారుణ్య సర్వశరణ్య. 134

వ. నీయంతఃకరణ ప్రవృత్తి కగోచరం బెద్దియు లేదయినను నావడినపరాభవం బెఱిం
గించెద. 135

సీ. పార్థివప్రభుఁడై నపాండుమహీపతి, కోడల నయి యుద్ధకుశలు లయిన

1. క. నిర్విచారమును. జ. దుర్వికారమును. 2. అ. కున్కి నిక్కము మనకు.

పాండుతనూజులకు భార్యనై ప్రఖ్యాతుఁడ, వైనసీసఖుండును నై యధికశక్తిం
బరఁగుధృష్టద్యుమ్నునకు భగినినై ధృతరాష్ట్రుపట్టిచే సభఁ దలపట్టి యీడ్వఁ
బడి పాపకర్ముచే బరిధాన మొలువఁగంగఁబడి దారుణం బైన పరిభవంబు

ఆ. పడితి నట్టినన్నుఁ బాండవుల్ సూచుచు, నుండి రౌరులపోలె నుక్కు దక్కి
యాపగాతనూజుఁ డాది గాఁగల వృద్ధ, బంధుజనులుఁ జూచి పలుక రయిరి.

క. శరణనినవారిఁ గరుణా, కరు లయి రక్షించుపురుషకారాన్వితులే
శర ణనియడిచిన నాలిం,పర భీమార్జునులబాహుబల మేమిటికిన్. 134

వ. భ్రాతృపుత్త్రబంధుజనంబులు నాకుం గలిగియు లేని వారయి రట్టియెడం గర్ణుండు
నన్నుం జూచి నగియె. 138

ఆ. కర్ణునగవు లోకకర్ణితుం డగుమన్న, నేనుచెయిదికంటె శిఖయపోలె
నడరి నామనంబు నతిదారుణక్రియ, నేర్చు చున్నయది మహీధరుండ. 139

వ. తొల్లి వేదాధ్యయనంబు సేయుచు బాలకేళివినోదంబుననున్న కాలంబునఁ బ్రమా
ణకోటియందు సుప్తుండయిన భీమసేను నంటఁగట్టి గంగమడుపునం ద్రోపించియు
విషంబుఁ బెట్టియు విషసర్పంబులం గఱపించియు [1]జననీసహితు లైనయేవురను
వారణావతంబున లక్కయిల్లుసొచ్చి యందు దహనంబుఁ బ్రయోగింపంబంచియు
ననేకంబులైన యపకారంబులు సేసి యిప్పుడు దుర్యోధనుం డధర్మద్యూతంబున
రాజ్యంబు నపహరించి రాజలోకసమక్షంబునం దమ్ము నిరాకృతులం జేసినను
బరాక్రమపరాఙ్ముఖు లైనపాండవులు నాపరిభవంబు నెట్లు దలఁచెదరని బాష్ప
ధారాస్నపితపయోధరయయి పాణిపల్లవంబుల నయనసమార్జనంబు సేయుచున్న
పాంచాలిం జూచి వాసుదేవుం డిట్లనియె. 140

చ. తనుకుచు నున్ననీహృదయతాపనిమిత్తమునన్ సురేంద్రనం
దనుపటుబాణపాతహతిఁ దద్ధృతరాష్ట్రబలంబు మృత్యుసా
దనమున కేఁగు జుమ్మిదియతథ్యము నా వచనంబు దప్ప ది
వ్యనిధు లేఁడు నింకిన దివంబును రాత్రియు సంచలించినన్. 191

వ. అనిన నర్జునుండు ద్రౌపదిం జూచి యిట్లనియె. 142

ఉ. ఈ పురుషోత్తముండు మనకుం దడకుం గుశలంబు సేయుచుం
బాపకలంక పంకములఁ [2]బాయఁగఁ జేయుటఁజేసి దుర్మదో
ద్దీపితశత్రుసంహతి హతిం బరమార్థమ పొందు నేల సం
తాపము నీకుఁ జేయఁగఁ [4]దిగ్ధామజయోన్నతి గల్గి యుండఁగన్. 143

1. 'లాక్షాగృహంబున నుండి బనిచి యెవ్వ రెఱుంగకుండ ఘోరానలంబు దరికొలుప బనిచియున్నట్టిదుర్యోధనుం డిప్పు డధర్మద్యూతంబున' నని యొక్క ప్రతి. 2. గ. బాపుచు నుండుటఁజేసి. 3. గ. చ. జ. శత్రులోకవితతిం బరిమారుతు మల్ల మేల సంతాపముఁ బొందఁ జేయఁగఁ. 4. ఖ. విధాతృనియోగము; జ. వృథావిజయోన్నతి.

వ. అనిన ధృష్టద్యుమ్నుండు (సక్రోధుం డయి) యి ట్లనియె. 144

క. వినయవిహీనుల దుర్యో,ధనదుశ్శాసనులఁ బవన § తనయుఁడు రాధా
తనయుని నరుఁ డేఁ గుంభజు, నని జంపుదు మేల వగవ § నంబుజనేత్రా. 145

వ. అని యందఱు ద్రుపదరాజపుత్త్రి నాశ్వాసించి రంత నచ్యుతుండు ధర్మరాజున కిట్లనియె. 146

తే. ద్వారవతినుండియే యుయు§ధానువలన, ధారుణీశ యింతయు విని § తత్క్షణంబ
యరుగుదెంచి యాపన్నుఁ§డవైన నిన్నుఁ, జూచి దుఃఖోపహతమన§స్కుఁడ నైతి.

వ. అయ్యవసరంబున నేను మీయొద్ద నుండమిం జేసి యిట్టి దుర్వ్యసనంబు సంభవిల్లెఁ గామజంబులైన స్త్రీద్యూత మృగయా పానంబులను నాలుగు దుర్వ్యసనంబులం బ్రవర్తిల్లకుండఁ బ్రతిపాదింపవలయు నందును విశేషంబుగా ననర్థమూలంబయిన ద్యూతంబుఁ బరిహరింపనినాఁడు పాపంబగు నని హేతుదృష్టాంతంబులు సూపి కృపద్రోణవిదురగాంగేయులం దోడుచేసికొని యాంబికేయు నొడంబఱిచి దుష్టద్యూతంబు సర్వప్రకారంబుల వారింతు. 148

క. వలచి హితంబునఁ బథ్యముఁ, బలికినఁ జేకొననిధర్మ§బాహ్యుల నవివే
కుల నిగ్రహింతు మీకె,గ్గులు [1]మత్సాన్నిధ్యమున న§గు నెయ్యెడలన్. 149

—◆ శ్రీకృష్ణుఁడు ధర్మరాజునకు సౌంభకాఖ్యానంబు సెప్పుట. ◆—

వ. ఏను సముద్రతీరంబున సాల్వుతోడం బదినెలలు యుద్ధంబుసేసి వాని వధియించుచుండి యక్కడ మసలితి నది కారణంబుగా మీకు దుర్వ్యసనావసరంబున నలబ్ధసన్నిధానుండ నయితి ననిన నది యెట్లని యుధిష్ఠిరుం డడిగిన నాతనికి సౌంభకాఖ్యానంబు సవిస్తరంబుగాఁ గృష్ణుం డిట్లని చెప్పె నీ యజ్ఞంబున నర్ఘ్యనిమిత్తంబున నసహిష్ణుం డయిన శిశుపాలుండు నాచేత నిహతుం డగుట విని వాని తమ్ముండు సాల్వుం డనువాఁడు తద్వ్యథప్రవర్తితక్రోధుండయి కామగమనంబయిన తన సౌంభకం బను నగరంబుతో సన్నద్ధుండయివచ్చి ద్వారవతీపురంబు నవరోధించి.

చ. ప్రతినరపాలకాలు శిశు § పాలు బలాధికుఁ జంపి దర్పసం
హితుఁ డగుచున్న వృష్ణిఖలుఁ § డెక్కడ [2]నెక్కడ నాతనిన్ జయో
న్నతి వెలయంగఁ జంపెద ర§ణంబున నంచు నలంఘ్యవిక్రమో
ర్జితుఁ డయి దానిచుట్టు విడి§సెం జతురంగ మహాబలంబుతోన్. 151

క. మేలగు తత్పురబాహ్యవి,శాలోద్యానములఁ దాల§సాలసరళహిం
తాల తమాలావళి ని,ర్మూలితముగఁ జేసెఁ దచ్చ§మూసామజముల్. 152

వ. మఱి తృణజల ధాన్యసమిత్సమృద్ధంబయి శతఘ్నీప్రముఖానేకయంత్రంబులనలంఘ్యపరిఘాప్రాకారంబులను నపారబలరక్షితఘనకవాటచతుర్గోపురంబులను లబ్ధ

1. గ. సేసినధార్తరాష్ట్రకుల నెయ్యెడలన్, 2. జ. ఁబో నగు

ప్రభూతవేతన ప్రహృష్టపుష్ట ధృష్ట వీరసుభట సంకులంబులను నపరిమితగజతు
రంగ శతాంగంబులను [1] ప్రదీప్తాలాతశాతశరచక్రతోమర పరశుపాశాంకుశకూ
టంబులను [2]వీరయోధారూఢవిశాలాట్టాలకంబులను నొప్పి పరుల కసాధ్యం
బయిన ద్వారవతి భేదింపనేరక దాని వెలిం బ్రపాచైత్య దేవాయతన వల్మీకంబులు
వర్జించి సమతల ప్రదేశంబున నిబిడంబుగా శిబిరసన్నివేశంబు సేసి నిత్యంబు నుప
ద్రవంబు సేయుచున్న సౌంభకవిజృంభణంబునకు సహింపక సమరసంరంభంబున
సర్వాయుధసన్నద్ధులయి. 153

క. ఉద్యద్బలులు కుమారులు, విద్యాధరసములు పురము వెలువడిరి రణై
కోద్యములు చారుదేష్ణుఁడు, ప్రద్యుమ్నుఁడు సాంబుఁడును విపక్షజిఘాంసన్. 154

మణిభూషణము. రామవిక్రముఁ డజేయుఁ డరాతిగజావలి
సామజాహితుఁడు సాంబుఁడు సాల్వచమూపతికిన్
క్షేమవృద్ధి యనువాని నకృత్రిమసాహసో
ద్దాముఁ దాఁకె శరధారల [3]ధారుణిఁ గప్పుచున్. 155

క. జాంబవతేయు బృహద్విశిఖంబులకుఁ బెదర కెదిరి ఘనుఁ డేసె రణా
గ్రంబున నాతనిపై నవిలంబితుఁడై క్షేమవృద్ధి లక్షశరంబుల్. 156

వ. వాని యేయు నేర్పునకు సహింపక సాంబుండు జాంబూనదపుంఖంబులయిన విశిఖం
బులం దదీయరథాశ్వమర్మంబుల నేసిన నవి మర్మభేదవేదనలం దలరి యతివేగం
బున [4]రణభూమి వెలువడ రథం బీడ్చుకొని సారథికి వశంబు గాక పఱచె నట్లు
సాల్వచమూపతి సమరవిముఖుం డయిన. 157

స్వాగతము. వేగవంతుఁ డనువీరుఁడు సాంబున్, వేగవంతుఁడయి వీఁకను దాఁకెన్
వేగబాణపదవీతతులన్ దిగ్భాగముల్ విశిఖపంజరముల్ గాన్. 158

ఆ. సాంబుఁ డాయుమనుచుఁ జారుదేష్ణుం డల్గి, వేగవంతుఁ దాఁకి వీఁకతోడ
వానిమస్తకంబు వ్రయ్యంగ వడి గదం, బొడిచె రుధిరవారిపూరమొలుక. 159

వ. ఇట్లు చారుదేష్ణు నిష్ఠురగదాఘాతంబున వేగవంతుండు విగతజీవుం డయి నిర్ఘాత
పాతభిన్నోన్నతగిరిశిఖరంబునుంబోలె నేలఁ ద్రెళ్ళినం జూచి విచింత్యుం డనువాఁ
డవిచింత్య విక్రముం డయి. 160

తే. చారుదేష్ణుపైఁ గడువాఁడిశరము లేసె, నతఁడు కార్ముకహస్తుఁడై యాక్షణంబ
వానిపై నభిమంత్రించి వహ్నిబాణ, మేసె నుగ్రస్ఫులింగంబు లెసఁగఁ జదల.

క. అనలాస్త్ర మట్లువక్షము, గొనిన విచింత్యుండు గూలెఁ గుతలం బదరన్
ఘను వానిఁ జూచి హాహా, స్వనము లెసఁగ సాల్వసేనసంక్షోభించెన్. 162

వ. సాల్వుండు నిజసేనాసంక్షోభం బుడిపి సర్వాయుధసనాథం బయినరథం బెక్కి—

1. జ. ప్రబలపాలితనిశాత. 2. గ. విహారద్యోధారూఢ. 3. గ. జ. దప్పక. 4. జ. రణంబు వెలువడ,

యాదవకుమారవాహినిపయి నెత్తి యేయుచు వ్రేయుచుం బొడుచుచుఁ బ్రతి
బలంబు నెల్ల నాయుధమయంబుగాఁ జేయుచున్న వాని కలిగి. 163

సీ. హంసవర్ణోత్తమహయములఁ బూన్చిన, రథ మెక్కి కాంచనరమ్యయష్టి
సంభృతమకరధ్వజం బొప్ప బద్ధగో, ధాంగుళిత్రాణుఁ డై యతులశాత
సాయకావలిఁ జేసి సాల్వుఁ బిల్చుచు వాని, మీఁదఁ బ్రద్యుమ్నుఁ డమేయబాణ
వర్షంబు గురిసిన వాఁడును వానిపై, గడువాఁడిబాణముల్ గడఁగి యేసె
ఆ. నధికవీరు లయిన యయ్యిద్దఱకు నస్త్ర, కోవిదులకుఁ బోరు ఘోర మయ్యెఁ
దద్ద భయము వొంది తద్ద్వారకాపురి, సౌంభకమున జనులు సంభ్రమింప.

క. అనిమొన సాల్వుఁడు ప్రద్యు, మ్నునిశాతశరాలివిద్ధమర్ముం డయి పె
ల్చన మూర్ఛవోయి పడియెం, దనరథముపయిన్ ధరిత్రి దల్లడపడఁగన్. 165

ఉ. అంతన మూర్ఛ దేఱి కలుషానలదీప్తముఖుండు సౌంభకుం
డంతకదండదారుణము లైనశరంబుల రొమ్మి నేయు ది
ద్దంతిబలాఢ్యు నేయుడు నతండును మూర్ఛితుఁ డయ్యె వాని సం
భ్రాంతిఁ దదీయ సారధి యపాస్తరణాంతరుఁ జేసెఁ జెచ్చెరన్. 166

వ. ఇట్లు మూర్ఛితుం డయిన ప్రద్యుమ్నుం దోడ్కొని చని రణంబునకు దూరంబుగా
నరదంబు నిలిపికొని దారుకసుతుం డున్నంత నొక్కింతప్రొద్దునకు మూర్ఛ దేఱి
ప్రద్యుమ్నుండు సూతున కిట్లనియె 167

క. ఘోరాహవరంగమునకు, దూరముగా నన్ను నిట్లు దోడ్కొని తేరన్
దారుకసుత నీ కుచితమె, వీరారంభంబు సూచి వెఱచితె చెపుమా. 168

వ. (మఱియు సారథిం జూచి విహ్వలమానసుం డయి యిట్లనియె,) 169

క. సమరవిముఖత్వమును రణ, విముఖులఁ జంపుటయు శరణు వేఁడిన రక్షిం
పమియును యాదవవంశో, [1]త్తములకుఁ గల దయినఁ గలవె దారుకతనయా.

క. విక్రమము విడిచి సమరా, పక్రాంతుఁడ నయిన నన్ను బలదేవుఁడునుం
జక్రధరసుతులు ననుజులు, నక్రూరాదులును నేమి యని నగరె సభన్. 171

వ. చెట్ట నేసి తింక నయినఁ జెచ్చెర సాంబ చారుదేష్ణు లున్నచోటికి సాల్వాభిముఖం
బుగా రథంబు వఱపు మనిన సారథి యిట్లనియె. 172

క. రథి కిమ్ముగానియెడ సా, రథి [2]ధృతిమెయిఁ గావ వలయు రథియును దత్సా
రథిఁ గావ వలయు రథిసా, రథులు పరస్పరశరీరరక్షకు లగుటన్. 173

ఆ. సాల్వబాణవిగత[3]సంజ్ఞుఁడ వైనని, న్నిట్లు దెచ్చితిని సహింప వలయు
నా రథాశ్వములమనస్స్యదమును నిదె, చూడు మనుచు సూతసూనుఁ డపుడు.

వ. సవ్యాపసవ్యచిత్రమండలగతుల నాక్షణంబ సాల్వునకు ప్రదక్షిణంబుగా రథంబు
వఱపిన దాని సహింపక సాల్వుండు మూఁడమ్ముల సారథి నేసి మఱియు రాక్షస

1. క. ఖ. త్తములం దవి గలదె చెపుము. 2. అ. శ్రద్ధతో. 3. సత్త్వుఁడ.

మాయ ననేకశరంబులు ప్రద్యుమ్నుపై నేసిన. 175

క. ఆ మాయామయశరములు భగ్నములు గాఁ జేసి తన్ముఖమ్మునఁ దద్వ
క్షమ్మున నొక్కట బ్రహ్మాస్త్రమ్మును బ్రద్యుమ్నుఁ డేసె దారుణభంగిన్.

వ. ఇట్లు బ్రహ్మాస్త్రపీడితుం డయి సాల్వుండు మూర్ఛపోయి రథంబుపయిం బడిన వాని వెండియు నొక్కదివ్యబాణంబున నేయ సమకట్టిన నంతరిక్షంబున హాహా రవంబు లెసఁగె నంత దేవగణప్రేరితు లయిన నారదమారుతులు ప్రద్యుమ్ను పాలికి వచ్చి యి ట్లనిరి. 177

తే. వీఁడు నీచేత వధ్యుండు గాఁడు మిన్న
కేయ కుండుము వీని నారాయణుండు
మొనసి వధియించు నని పల్కి వనజగర్భుఁ
డనినఁ బ్రద్యుమ్నుఁ డేయక యనఘుఁ డుండె. 178

—♦ సాల్వుఁడు ప్రద్యుమ్నుచే బాధితుఁడై మరలి పోవుట ♦—

వ. అంత సాల్వుండు నివృత్తుం డయి ద్వారకాపురియవరోధం బుడిగి తనసౌభకం బెక్కి క్రమ్మఱి చనియె నంత నీయజ్ఞంబు నిర్వృత్తం బయిన నే నరిగి బలభగ్నీకృతపాదపవనంబులదాని ననభిజ్ఞాతద్వారదేశంబులదాని నస్వాధ్యాయ స్వాహాకారస్వధాకారమహీసురాగారం బయినదాని నపేతభూషణయోషిజ్జనంబులదాని ద్వారవతిం జూచి యాహుకాత్మజువలన నంతవృత్తాంతంబును నెఱింగి సాల్వుం జంపి కాని యిప్పురంబు సొర నొల్ల నని నిశ్చయించి దీని నప్రమాదుల రై రక్షించుకొని యుండుం డని బలదేవాదులం బంచి యప్పుడ ప్రయాణభేరి వేయించి కృతస్వస్తివచను లయిన పురోహితప్రముఖబ్రాహ్మణవరులకు నమస్కరించి శైబ్యసుగ్రీవంబు లనువాహంబులం బూన్చినదివ్యరథం బెక్కి. 179

ఆ. పాంచజన్యరవముఁ బంచమహాశబ్ద, రవముఁ జెలఁగె దిశలు చెవుడువడఁగ
నొలసి జనులదీవనలు మించె రమ్యమై, గరుడకేతనంబు గ్రాలెఁ జదల. 180

వ. అట్లసంఖ్యాత చతురంగసైన్యంబులతో నరిగి గిరి వన సరోవర సరిద్దేశంబులు గడచి మార్తికావతదేశంబున కరుగునంతకు ముందర సాల్వుండు సౌభకారూఢుం డయి సముద్రకుక్షిదేశంబునకుం బోయిన. 181

క. ఏనును వానిపిఱుందన, మానక చని తచ్చమూసమాజముతోడన్
భూనాథ రణము సేసితి, నానానిశితాస్త్రవర్షణ[1]వ్యాప్తముగన్. 182

క. వీరు లగుసాల్వయోధుల, నారాచావళులు [2]గప్పి నారథముపయిన్
నారథిమీఁదఁ దురంగము, చారుధ్వజతతులపయి నహస్రసంఖ్యాకముగన్. 183

వ. (తోఁగిన) వాని నెల్ల నస్మదీయగోచరంబులు గాకుండ ననేకాయుతశరంబు లేసి సాల్వసైన్యంబుతో మహాయుద్ధంబు సేసిన, 184

1. గ. వ్యాళమునన్. 2. క. గ. గప్పి...షట్సంఖ్యాతముగన్...వాని నెల్ల.

మ. అవనీనాథ తదాహవాంతరమునం దస్మత్కరాకృష్ట శా
ర్ఙ్గవినిర్ముక్తనిశాతసాయకశతవ్యగ్రచ్ఛిన్నమై దైత్యదా
నవదేహప్రకరంబు వాత[1]విధుతార్ణఃపూరసంఘూర్ణితా
ర్ణవకుక్షిం బడియెం గపిప్రవరసైన్యక్షిప్తశైలాకృతిన్. 185

చ. ఘనతరదైత్యదానవనికాయకళేబరపాతఘట్టనం
దనరి యుగాంత్యకాలచలితంబునుబోలెఁ బయోధి మ్రోసె న
వ్వనధిరవంబుకంటె ననివారితమై చెలఁగెన్ మదీయవా
హిని భటసింహనాద హయహేషిత సింధురబృంహిత ధ్వనుల్. 186

వ. అట్టిమదీయసేనోత్సాహంబును నిజసేనాక్షీణతయుం జూచి సహింపక సాల్వుండు వెండియు సౌంభకారూఢుం డయి నాతో మాయాయుద్ధంబు సేయ సమకట్టి.

సీ. పరశుపాశాంకుశకరవాలశూలముద్గరములు నామీఁదఁ దెరలఁ గురిసె
[2]నేను గడఁగి యద్దానవశస్త్రముల్, వాయంగఁ జేసితి మాయఁ జేసి
వెఱవక సాల్వుండు వెండియు నామీఁదఁ, బరుషశిలావృష్టిఁ గురిసె వరుస
నమరఁ దమఃప్రకాశములతో దుర్దిన, సుదినశీతోష్ణముల్ గదియఁ జేసి

ఆ. దితిసుతాధముండు శతసూర్యశతచంద్ర, శతసహస్రవిద్యుత్తతులు వెలుఁగ
గగనతలము సేసెఁ బగ లిది రే యిది, యని యెఱుఁగనయితి మనములోన.

క. మనుజేంద్ర సర్వమాయా,పనోదనం బయినయగ్నిబాణంబున [3]న
ద్దనుజవినిర్మితమాయా,వినివర్తనఁ జేసితిని [4]సవిస్మయమతి నై. 189

వ. అట్టియవసరంబున ద్వారవతినుండి యాహుకప్రేషితుం డయి యొక్కరుం డతి త్వరితగతిం బఱతెంచి సాల్వుచేత నక్కడ వసుదేవుండు పట్టువడియె నీ వెవ్వని తోడం గయ్యంబు సేసెదు క్రమ్మఱి చని పురంబు రక్షించుకొను మనిన విని యుదరిపడి మహాబలపరాక్రము లయినబలదేవాదులు రక్షించుకొని యుండ వసుదేవుఁ డేల పట్టువడు నిది పోల దని సంశయించుచు విమనస్కుండ నయి యుండునంత. 190

సీ. పుణ్యకర్మంబులు వోలిసిన నుర్వికి, నేతెంచునట్టి యయాతివోలె
భూషణదీప్తులు పొలియంగ వివృతకే,శాంబరుం డయి సౌంభకంబువలనఁ
బడుదెంచు వసుదేవుఁ బాపనిశాచర,బలపీడ్యమాను దవ్వులన గాంచి
యత్యంతమోహశోకాంధుండ నయిననా,హస్తంబువలన విస్రస్త మయ్యె

ఆ. శార్ఙ్గ మప్రియావసన్న దేహుండ నై, యుడిగి రథముమీఁదఁ బడితి నేను
దానిఁ జూచి భయము దగిలి మత్సైన్యంబు, దల్లడిల్లి యులిసెఁ బెల్లురేఁగి.

---

1. జ. విహాతా. 2. గ. నస్త్రిముల్ నేనును నడరించి దానవుఁ బాయంగ. 3. అ. నద్దనుజాని నిర్మితమాయావినివర్తనఁ 4. క. గ. సుమతి స్తిరమతి నై.

వ. అంత నెంతయుం బ్రొద్దునకుఁ దెలిసి సాల్వుసౌంభకంబున వసుదేవుం గానక దాని
మాయఁగా నెఱింగి పదంపడి మాయావి యయినసాల్వుం జూచి వానిపయి
నలిగి యే నేసిన నయ్యసురయు సౌంభకంబు నదృశ్యం బగుటయు. 192

క. అసురులయాక్రోశధ్వను, లెసఁగెం బదిదిశల నంత నేనును తద్రా
క్షసుల గతాసులఁ జేసితిఁ, బ్రసభంబున శబ్దభేదిబాణప్రతతిన్. 193

వ. అంత సాల్వుండును దనసౌంభకంబుఁ బ్రాగ్జ్యోతిషంబుఁ జేసి తానును మానవుం
డయి పర్వతవర్షంబు నాపయిం గురిసిన. 194

ఆ. పరుషవిషమభూరిపాషాణభీషణ,గిరులు వచ్చి నన్నుఁ దెరలఁగప్ప
వజ్రబాణ మేసి వాని నన్నింటిని, బాచి యున్ననన్నుఁ జూచి యపుడు. 195

క. దారుకుఁ డిట్లనియె మహా,వీరు నుపేక్షింపఁ దగునె వీనిని మాయా
ప్రారంభు నుపేక్షింప ర,పారపరాక్రములు పోరఁ బ్రాకృతు నయినన్. 196

వ. అనిన వానిపలుకులు విని యలిగి యనలజ్వాలాకరాళం బయి ప్రతికూలరాక్షస
యక్ష గంధర్వ దైత్య దానవ భస్మసాత్కరణదారుణం బయినచక్రంబునభిమం
త్రించి సౌంభకంబుపయి వైచిన నది యుగాంతకాలపరివేషభీషణం బయిన
రవిమండలంబుంబోలె గగనంబునం బఱచి సౌంభకమధ్యంబునం బడిన. 197

చ. తడయక ఘోరదర్శనసుదర్శనపావకుచే దహింపఁగాఁ
బడి పరమేశ్వరోగ్రశరపావకదగ్ధపురత్రయాభ మై
యెడరి ధరిత్రిమీఁదఁ బడియెం జెడి సౌంభక మంత సాల్వుఁడుం
బడియె మదీయచక్రపటుపాతరయంబున రెండువ్రయ్యలై. 198

—♦ పాండవులు ద్వైతవనంబునకు వచ్చి యుండుట ♦—

వ. అని యిట్లు సాల్వుం దనచంపినవిధంబు సెప్పి చక్రధరుండు పాండవులవీడ్కొని సుభద్రాభిమన్యులం గాంచనరథం బెక్కించుకొని తోడ్కొని ద్వారవతి కరిగె ధృష్టద్యుమ్నుండును బ్రతివింధ్యాదు లయినద్రౌపదేయులం దోడ్కొని ద్రుపదుపురంబునకుం జనియె నిట పాండవులును రథంబు లెక్కి యాయుధంబులు ధరియించి యింద్రసేనాదిమూలభృత్యు లిరువదుండ్రు ముందట రా ననేకసహస్రబ్రాహ్మణవరులతో ద్వైతవనంబున కరిగి రంత ధర్మరాజు తమ్ముల కి ట్లనియె.

మధ్యాక్కర. ఇది మహోగ్రాటవి సింహశరభోరగేంద్రశార్దూల
మదగజాకీర్ణంబు దీనిలోన నేమఱ కుండవలయు
నదియునుం గాక పరప్రయోగమాయలు గల వెఱిఁగి
మది నుండునది యన్న నన్న కి ట్లను మఘవనందనుఁడు. 200

వ. బ్రహ్మవిదులయిన(తపోధన)బ్రాహ్మణులును వృద్ధులు నఖిలలోకద్వారంబులనప్రతిహతులయిన నారదద్వైపాయనాదిమునివరులు నీచేత నుపాసితు లయి నీకుశ

లంబ కోరుచుండుదురు భవత్ప్రతాపం [1]బెల్ల వారికి రక్షణీయుం బివ్వనంబు సకల కాలకుసుమఫల భరితవనస్పతిశాఖాశిఖారూఢ మయూరకీరకోకిలాలాపమధురం బును బక బలాక కోక కారండవ సారస రమ్య మధుకరసౌమ్యసరోవర సంకు లంబును విమలశీతలజలప్రవాహానదీశోభితంబును మహర్షిగణసేవితంబును నై యొప్పుచున్నయది యిం దుండుద మని లలిత లతా వితానాదిరమణీయంబు లయినవృక్షమూలంబుల నేవురు వేఱువేఱ నివాసంబులు సేసి నియతాత్ము లయి యిష్టంబున దేవపితృకార్యంబులు సేయుచుం దమ్ముఁ జూడ వచ్చినమహామును లకు బ్రాహ్మణులకు మనఃప్రియంబు లయినయాహారంబులు వెట్టుచు ద్వైతవనం బున నుండునంత. 201

క. పాండవులకడకు ధర్మవిదుండు తపోదహనదగ్ధదురితౌఘుఁడు మా
ర్కండేయుం డనుమునినాథుం డంతేవాసిగణముతోఁ జనుదెంచెన్. 202

వ. ఇట్లు వచ్చి వారలచే నర్చితుం డయి వనవాసక్లేశదుఃఖితు లయినపాండవులను ద్రౌపదిం జూచి యమ్మార్కండేయుం డి ట్లనియె. 203

సీ. పితృనిదేశమ్మునఁ బృథివీశ్వరత్వంబు, విడిచి సానుజుఁ డై పవిత్రచరిత
జానకిఁ దోడ్కొని చని వనంబున నున్న, రఘుకులనందను రాముఁ దొల్లి
జూచితి నిపుడు భూసురవంశపోషకు, సాధుజనస్తుత్యు సత్యధర్మ
నిత్యు [2]ధర్మజు రమణీయకీర్తిప్రియు, శమవంతుఁ జూచితి సగర భరత

ఆ. నల యయాతి వైన్య నాభాగు లాదిగ, నాదిరాజు లెల్ల నధికధర్మ
సత్యయుక్తిఁ జేసి సకలలోకంబులు, వడసి భాగధేయ భాగు లయిరి. 204

వ. పాపసౌబలప్రయుక్తుం డయినధార్తరాష్ట్రునట్లు ధర్మువు దప్పినవా రెవ్వరును లేరు మీరు ధర్మనిత్యులరు సత్యవ్రతులరు గావున మీ కిష్టసిద్ధి యగు నని మార్కం డేయుం డరిగిన నపరసంధ్యోపాసనాసీనుం డయిన ధర్మరాజును సాయంహో మార్థప్రజ్వలితజ్వలనంబు లయినయనేకసహస్రబ్రాహ్మణాగ్నిహోత్రంబులంజూచి బకదాల్భ్యుం డనుమహాముని యి ట్లనియె. 205

ఉ. భూమిసురోత్తముల్ ప్రకృతి [3]పుణ్యవిధాయులు వీరు ఋగ్యజు
స్సామపరాయణుల్ పరమసాధుచరిత్రులు మీకు సంతత
ప్రేమమునన్ శుభోన్నతులు పెంచుచు నుండుటఁ జేసి సద్గుణో
ద్దామ యరణ్యవాస మిది దద్దయు నొప్పెడు మాకుఁ జూడఁగన్. 206

వ. బ్రాహ్మణానుగ్రహంబునం జేసి తొల్లి వైరోచనాదు లనేకకాలంబు లక్షయలక్ష్మీ విభవు లయి సముద్రనేమిభూచక్రంబు రక్షించి యనిలసహాయుం డయినయగ్ని దేవుం డరణ్యంబు దహించునట్లు బ్రాహ్మణసహాయుం డయినమహీశుండు శత్రు

1. గ. బెల్లవారిని రక్షించు నివ్వనంబు, 2. ధర్మాత్మజు నిన్నుఁగీర్తి. 3. గ. పుణ్యాభిధేయులు,

వర్గంబు నిశ్శేషంబుసేయు నీహితుం డయి విప్రులచేత [1]ననుశాసితుం డయినరాజు
నకు [2]నలబ్ధలాభాదిత్రితయంబు సంపన్నం బగు బ్రాహ్మణహితుం డయి ధర్మ
హీనుం డయినరాజును బజ వలవదు ప్రజానురాగంబు లేనివారికి రాజ్యంబు
సుస్థిరంబు గానేరదు మీరు బ్రాహ్మణప్రియులరు ధర్మనిత్యుల రెప్పుడును మీ
కభ్యుదయం బగు నని బకదాల్భ్యుం డరిగినం బాండవులుం దమయిష్టంబున
నుండి దుఃఖోపశమనంబు లయినకథలు సెప్పుకొనుచున్నయవసరంబున ద్రౌపది
ధర్మరాజున కిట్లనియె. 207

— * ద్రౌపదీ ధర్మరాజులసంవాదము * —

ఆ. వృద్ధు కొడుకుపలుకు విని క్రూరుండై పాపబుద్ధిఁ జేసిమిమ్ము § భూతలంబు
వెలువరించి రాజ్యవిభవంబుగొనియిప్డు, డలుక సెడి సుచిత్తుఁ డయ్యెనొక్కొ.

ఆ. అద్దురాత్మహృదయ § [3]మది యయఃపాషాణనిష్ఠురంబు ధర్మవిధుల మిమ్ము
నట్లు గొడుకు లెగ్గు § లాడంగఁబోయిన, వల దనండ కలహవాంఛఁ జేసి. 209

సీ. విమలహర్మ్యంబుల § విహరించువారలఁ, బ్రియమహాస్థానశయనరతులఁ
జందనాగురులిప్తచారుసర్వాంగుల, నతనరనాథసేవితుల మిమ్ము
వనమునఁ గుమ్మరువారిఁగాఁ గుశబృసీ,శయనాభిరతులఁగా § నియతరూక్ష
భూరేణుధూసరీభూతవిగ్రహులఁ గా, దుతవన్యమృగనిషేవితులఁ గాఁగ

ఆ. నిట్లు సూచి చూచి § యే నెట్లు చిత్తోప, శాంతి సేయుదాన § సకలభోగ
విషయవిరతిఁ జేసి § విధియును ధృతరాష్ట్రు, నట్లు మీకునహితుఁడయ్యెనొక్కొ.

క. భవదాజ్ఞానిగళంబునఁ, దవిలి పరాక్రమము విడిచి § ధరణీశ్వర నీ
యవరజు లిడుమలఁ బడి కడుఁ, జివికిరి చెఱఁ బడినసింహశిశువులభంగిన్. 211

ఆ. పరనరేంద్రమకుటపద్మరాగద్యుతి, నరుణమగు భవత్పదాబ్జయుగము
పరుషదారుశిలలపై నిప్పుడరుగుట, నరుణమయ్యెఁ బర్వతాంతరములు. 212

క. అనవరతసౌఖ్యసంపద, బెను పొందుచు నుండుమీకు § భీకరకాంతా
రనివాసాయాసంబుల, ననఘా యిబ్భంగి నవయు § నలమట వొడమెన్. 213

వ. నిత్యంబునుం బదివేవురు బ్రాహ్మణులు బ్రహ్మవిదులు [4]పసిండితళిగల నిష్టాన్నం
బులు గుడిచి తృప్తు లయినం దద్భుక్తశేషం బుపయోగించుచున్న నీకు వన్య
మూలఫలాశనంబు లుపయోగించుచు నన్యులయందుఁ గ్రోధంబు విడిచి యునికి
యుచితంబు గాదు. 214

సీ. పదివేలగజములబలమున విలసిల్లు, ననిలసుతుండు గాడ్పడవిలోనఁ
గుమ్మరి కాయలుఁ § గూరలుఁ దిని పేద, వడినఁ జూచియు దీర్ఘబాహుయుగళు.

1. గ. జ. నధిష్ఠింతుం డయిన. ఖ. ననుష్ఠితుం డయిన. 2. క. నలబ్ధలాభాదిచతుష్టయంబు; గ. వర్గచతుష్టయంబు. 3. మరయంగ నాయసనిష్ఠు 4. క. పసిండిపళ్లెరంబుల.

డయ్యును బాహుస ♦ హస్రంబు గలిగిన, యర్జునుకంటె బ ♦ లాఢ్యుఁడగుచు
నేకవేగంబున ♦ సేనమ్ము లొక్కయు, మేమ్మసినవిధమున ♦ సేయ నేర్చు

ఆ. నర్జునుండు ననమ్ము ♦ గావలెఁ గలసి యి ట్లున్నఁ జూచియును సుఖోచితాత్ము
లైన కవలు దీను ♦ లై యున్నఁజూచియు, నుపశమంబుఁదాల్చి ♦ యుండఁదగునె.

వ. క్షమయును దేజంబును నయ్యయికాలంబులఁ బ్రయోగింప నేరనిరాజునకుం బ్రజానురాగ ప్రతాపంబులు లే వను నీయర్థం బితిహాసంబున వినంబడుఁ క్షమాతేజంబులలోన నెయ్యది విశేషంబు దాని నిర్ణయించి చెప్పుమని బలీంద్రుండు దొల్లి తనపితామహుం డయిన ప్రహ్లాదు నడిగిన నాతండు బలీంద్రున కిట్లనియె. 216

ఆ. క్షమయ తాల్చి యుండఁ ♦ జన దెల్లప్రొద్దుఁ దే, జంబ తాల్చి యుండఁ ♦ జనదు పతికి
సంతతక్షముండు ♦ సంతత తేజుండు, నగుట దోష మందు ♦ రనఘమతులు. 217

వ. ఎట్లనిన నిత్యక్షమాన్వితుం డయినవానికి భృత్యులు వెఱవక యవమానంబు సేయుదు రర్థంబులకుం దధికృతు లయినవారలు ధనంబు లపహరించి దర్పంబు సూపుదురు మఱి నిత్య తేజోధికుం డైనవాఁ డతిక్రూర దండంబున సర్వజనసంతాపంబు సేయుచు గృహాగతం బైనసర్పంబునుంబోలె నెప్పుడు నుద్వేగకరుండగుం గావునఁ గాలోచితంబులుగా క్షమాతేజంబులు గల్పించునది యథాకాలకల్పిత క్షమాతేజుం డైనవానికి నుభయలోక సిద్ధియగు నని బలీంద్రప్రహ్లాదసంవాదంబు సెప్పి వెండియు ద్రౌపది యి ట్లనియె. 218

తే. [1]ఆది నపరాధ మొక్కటి ♦ యైన నదియు
నల్ప మైనను క్షమియించు ♦ నదియుఁ గాక
చెనసి యపరాధములు పెక్కు ♦ సేయుచున్న
పాపకౌరవ్యులకు సహిం ♦ పంగ నేల. 219

క. ఇది తేజంబున కవసర, ముదితక్రోధుండ వగుమ ♦ యొక్కించుక దు
ర్మదు లగు సుయోధనాదుల, నదయుల వధియింతు రుగ్రులై నీ తమ్ముల్. 220

వ. అనిన ధర్మరాజి ట్లనియె. 221

సీ. క్రోధంబు పాపంబు ♦ క్రోధంబునన చేసి, యగుఁ జువ్వె ధర్మకా ♦ మార్థహాని
గడుఁగ్రోధి కర్జంబు ♦ గానండు క్రుద్ధుండు, గురు నైన నిందించుఁ ♦ గ్రుద్ధుఁ డైన
వాఁడవధ్యులనైన ♦ వధియించు మఱి యాత్మ, ఘాతంబు సేయంగఁ ♦ గడఁగుఁ గ్రుద్ధుఁ
డస్మాదృశులకు ధ ♦ ర్మానుబంధుల కిట్టి, క్రోధంబు దాల్చుట ♦ గుణమె చెపుమ

ఆ. యెఱుక గలమహాత్ముఁ ♦ డెఱుక యన్జలముల, నార్చుఁ గ్రోధమనుమ ♦ హానలంబుఁ
గ్రోధవర్జితుండు ♦ గుఱుకొని తేజంబుఁ, దాల్చు దేశకాల ♦ తత్త్వమెఱిఁగి. 222

క. క్షమ గలవానికిఁ బృథ్వీ, సమునకు నిత్యంబు విజయ ♦ సంసిద్ధి [2]యగున్

1. గ. అరయ నపకార మొకఁడైన ♦ నదియు నల్ప,మైన క్షమియించు నదిగాక ♦ యలయ కెపుడుఁ జెనసి. 2. ధృతక్షముఁ డైనవాని.

క్షమి యైనవానిభుజవి, క్రమము గడున్ వెలయు సర్వకార్యక్షము డై. 223

వ. తేజఃప్రభవంబు లైన యమర్ష దాక్షిణ్య శౌర్య శీఘ్రత్వంబు లనునాలుగుగుణం బులు క్షమావంతునంద వీర్యవంతంబు లగుఁ దొల్లి కశ్యపగీత లైన గాథలయం దీయర్థంబు వినంబడు వినుము వేదంబులు యజ్ఞంబులు శౌచంబును సత్యంబును విద్యయు ధర్మువు సచరాచరం బయినజగ మంతయు క్షమయంద నిలిచినవి తప స్స్వాధ్యాయయజ్ఞకర్తలయు బ్రహ్మవిదులయుంబడయుపుణ్యగతులుక్షమావంతులు వడయుదు రదియునుంగాక కృష్ణద్వైపాయన భీష్మ విదుర కృపద్రోణసంజయప్ర భృతులు నాయుపశమంబ కీర్తింతు రుపశమ హీనుండయినదుర్యోధను కారణం బున ధార్తరాష్ట్రుల కెల్లం బ్రళయం బగు ననిన ద్రౌపది వెండియు ని ట్లనియె.

మధ్యాక్కర. క్షమయంద చిత్తంబు నిల్పి నిర్గత । కల్మషబుద్ధిఁ
గ్రమమున ధర్మువు[1]నంద వర్తిల్లు । కరుణాత్మ నిన్ను
నమరంగ ధర్మువు రక్షించుఁ బ్రీతి । నని శత్రులందు
శమబుద్ధి సేయంగఁ జనునె నీకు న । జాత శత్రుండ. 225

ఆ. ధర్మదూరు లైన ధార్తరాష్ట్రులయందు, ధర్మ వేమి సేయు । ధరణినాథ
నికృతిపరులయందు । నికృతి సేయనివారు, వారినికృతిఁ జేసి । వధ్యులండ్రు. 226

క. ఆర్యులకు విహీనతయు న్ననార్యుల కున్నతియుఁ జేసి । యవినీతుఁడ వై
కార్యము దప్పితి నీకు న, నార్యులు చుట్టములె యార్య । లరులె విధాతా. 227

వ. అని విధాతృని ధర్మువు నాక్షేపించుద్రౌపదిం జూచి ధర్మరాజిట్లనియె. నాస్తికుల యట్లు [2]ధర్మాభిశంకిని వై దైవదూషణంబు సేసెదు శిష్టచరితంబయినధర్మంబునధి క్షేపించుచున్న దుర్మతికిం బ్రాయశ్చిత్తంబు లేదు ధర్మువుదప్పక నిత్యులై జీవించు చున్న మైత్రేయ మార్కండేయ వ్యాస వసిష్ఠ నారద ప్రభృతులం బరమయోగ ధరులం బ్రత్యక్షంబ చూచెదము వీ రెల్ల నన్ను ధర్మపరుం డని మన్నింతు రన్య లన్యాయంబు సేసి రనియు నే నేల ధర్మువు దప్పుదు. 228

క. ధీరమతియుక్తిఁ జేసి వి, చారింపఁగ నిశ్చవంబు । సర్వజనస్వ
ర్గారోహణసోపానం, బారఁగ ధర్మంబ చూవె । యతిరమ్యం బై. 229

వ. తపస్స్వాధ్యాయ బ్రహ్మచర్య(దానధర్మ) యజ్ఞంబులనుపుణ్యకర్మంబు లఫలంబు లగునేని వీని నేల[3]ఋషిగణంబులు సేవింతురు నీజన్మంబునుధృష్టద్యుమ్నుజన్మం బును బుణ్యకర్మఫల సద్భావంబునకు నిదర్శనంబులుగావె మఱిపుణ్యఫలంబులుగల యట్ల పాపఫలంబులును గలవు తొల్లి బ్రహ్మదనపుత్త్రులకుంగర్మఫలసద్భావంబు సెప్పె నందుఁ గశ్యపుండు ధర్మప్రబోధనంబునం జేసి పుణ్యఫలప్రాప్తుం డయ్యె

1. గ. రక్షించుచున్న. 2. జ. ట్లధర్మశంసిని వై...నతిక్రమించుచున్న దుర్మతికిని. 3. గ. జ. దేవర్షి గంధర్వగణంబులు.

విధాతృనియోగంబునం బుణ్యపాపఫలంబు సంప్రాప్తం బగు విధాతృననుగ్ర
హంబుననకాదె పుణ్యకర్మంబులు ప్రవర్తించి [1]మర్త్యులమర్త్యత్వంబును బొం
దుదు రనిన విని ద్రౌపది యిట్లనియె. 230

ఆ. కర్మఫలము [2]లేదు | కర్మఫలాప్తికిఁ, గారణంబు విధియుఁ | గా దనంగ
నంతయెఱుక లేనె | యార్తనై విధిచెద్ది, కలసి పలికితిం బ్రియంబు దప్పి.

ఆ. వేదశాస్త్రములును | విధివిధానములును, నప్రమాణ మనుదు | రాత్మకులకుఁ
బుణ్యగతులు లేమి | భూనాథ యెఱుఁగని, దానఁ గాను ధర్మ | తత్త్వయుక్తి.

వ. తొల్లి నీతిమంతు లయినబ్రాహ్మణులు మదీయజనకునకుం జెప్పంగ వింటి నెఱుక
గలవారికిం గర్మంబు గర్తవ్యంబు గర్మరహితు లయి స్థావరంబులయట్లు జనులు
జీవింప నేర రల్పఫలంబు నైనను గర్మంబుఁ బ్రవర్తించుచున్నవారిం జూచె
దము దైవమానుషంబులు గర్మఫలప్రాప్తికి నిమిత్తంబులు పురుషుండు మనం
బున నర్థసిద్ధి నిశ్చయించి కర్మంబునందుఁ గృతోత్సాహుండు గావలయు నట్టి
వానికి దైవంబు సహాయం బయి కర్మసిద్ధి గావించు. 233

మధ్యాక్కర. తిలలందుఁ దైలంబు కాష్ఠములయందుఁ | దిరముగా నగ్ని
గలుగు టెఱిఁగి యుపాయపూర్వమునఁ | గడఁగి తత్సిద్ధి
యలమక యుత్సాహవంతుఁడు వడయు | నట్లనుత్సాహ
మొలసి దైవపరుఁ డది వడయంగను | నోపునె యెందు. 234

మధ్యాక్కర. కడు నిమ్ముగా దున్ని బీజములు సల్లి | కర్షకుం డున్నఁ
దడయక వర్షంబు గురిసి కావించుఁ | దత్ఫలసిద్ధి
నడుమఁ బర్జన్యు డనుగ్రహింపని | నాఁ డేమి సేయుఁ
గడఁగి చేయం గలదానికిఁ జేయును | గాక కర్షకుఁడు. 235

వ. కర్మఫలంబులు దైవమానుషసిద్ధంబు లయినను బురుషోత్సాహసముపార్జితంబు
లయిన నవి సుస్థిరంబు లయి సురక్షితంబు లయి వర్తిల్లు [3]ననీహమానుం డయి
దైవపరుం డయినవాఁడు నీరిలోనియామపాత్రంబునుంబోలె నవసన్నుం డగుం
గావునఁ గర్మఫలసిద్ధి నిశ్చయించి యుత్సాహవంతుండ వయి నీయనుజులపరా
క్రమంబునం బరుల జయించి మనయందలియర్థకృశత్వం బపనయింపు మనిన
యాజ్ఞసేనివచనంబుల కనుగుణంబుగా భీమసేనుండు ధర్మరాజున కిట్లనియె. 236

—♦ భీమసేన ధర్మరాజుల సంవాదము ♦—

మ. పితృపైతామహ మైనరాజ్య మరివి | చ్ఛేద్యంబు గాండీవిచే
నతిగుప్తంబు బలారి కైనను నవా | ర్యం బిట్టిదానిన్ సుదు
ర్మతి నన్యార్థము సేసినీకుఁ జను నే | మత్త్యైశ యుగ్రాటవీ
వ్రతముల్ సల్పుచు ధర్మలేశచరణ | వ్యాసక్తి నిట్లుండఁగన్. 237

1. గ. మహాత్ము లమర్త్యత్వంబుఁ బొంది రనిన. 2. క. లందు. 3. గ. ఙ. నమానుష్యం.

క. ఆమిషము సింహములచే, గోమాయువు గొన్నయట్లు | కువలయరాజ్య
శ్రీ మనచేఁ గొని కౌరవుఁ, డే మని తలఁచునొకో బుద్ధి | నిష్ఠురుఁ డానున్.

క. దుర్మతులను దుర్జనులను, ధర్మస్థితి నోర్వఁ దగునె | ధరణీశ్వర దు
ష్కర్ము లగుధార్తరాష్ట్రుల, పెర్మి యడంగింపఁ గడఁగు | పృథుభుజశక్తిన్.

వ. ధర్మకామప్రభవం బయి సర్వార్థసాధనం బయిన యర్థంబు విడిచి మిత్రుల కప్రియంబు నమిత్రులకు హర్షంబునుంగా మునివృత్తిం జేకొని ధర్మువు ధర్మమనుచు ధర్మువునందు బుద్ధి నిలిపి దుర్మనుజునట్లు నిర్వేదింపం దగునె. 240

ఆ. బాహుబలము మెఱసి | పరులసంపదలు సే,కొనక లావు లేని | కుత్సితుండు
నియతదుఃఖవృత్తి | నిర్వేదపడుఁ దగుఁ,గాక నీకుఁ దగునె | కౌరవేంద్ర. 241

చ. నరనుత నీయనుజ్ఞఁ గొని | నాఁడ విరోధుల నెల్లఁబోరిలో
సరభసవృత్తి నుక్కడఁగ | జంపితిమేని మహోగ్రకాననాం
తరముల నుండకుండ నతి|దారుణదుర్మృగసంగమంబునం
బొరయక యుండఁగా [1]మనకుఁ | బోలు సమందమనఃప్రియంబుగన్. 242

క. సమయాతిక్రమభీతిని, క్షమాయుతుల మైనమనలఁ | గౌరవులు పరా
క్రమహీనులుగాఁ దలఁతురు, సమరోత్సాహంబు విడిచి | జడమతి నున్నన్.

తే. తగిలి నిత్యంబు నేకాంత|ధర్మనిరతుఁ, డగుట యుక్తమె పురుషున | కట్టివాని
వెలయధర్మకామంబులు|విడుచుఁబ్రాణ,విగతుసుఖదుఃఖములు రెండు|విడుచునట్లు

సీ. ధర్మకామంబులు | తఱుఁగంగ నర్థార్థి, యగువాఁడు పతితుఁ డౌ | నర్థసేవ
నర్థార్థముగఁ జేయు|నతఁ డుగ్రవనములో గోరక్ష [2] సేయు|నసక్కమతిఁ బోలు
నర్థధర్మములకు | హానిగా గామార్థి, యగునాతఁ డల్ప జ|లాశయమున
జలచరం బెట్టు లజ్జలములతోఁ జెడు, నట్లుకామంబుతో|హానిఁ బొందు

ఆ. నర్థధర్మములు మ|హాబ్ధిమేఘములట్టు, లుభయమును బరస్ప|రోదయమ్ము
లిట్లు గాఁ ద్రివర్గ | మెఱిఁగి [3]సామ్యమున సే,వించువాఁడు సర్వ|విత్తముండు.

వ. భవదాచరితం బైనయీధర్మం బర్థకామంబులక కాదు నీకును నీబాంధవులకును బాధాకరంబు దానయజ్ఞసత్పూజలు గావింప నర్థహీనున కశక్యంబు జగంబులు ధర్మమయంబులు ధర్మువునకు మిక్కిలి యొం డెద్దియు లే దయినను నర్థార్థంబు [4]గానిధర్మువు క్షత్త్రియుల కయుక్తంబు. 246

ఉ. శత్త్రుల నాజి నోర్చుటయు | సర్వభయంబులఁ బొందకుండఁగా
ధాత్త్రిఁ బరిగ్రహించి యుచి|తస్థితిఁ గాంచుటయుం బ్రియంబుతోఁ
బాత్త్రులకర్థ మీగియును | బ్రాహ్మణపూజయుఁ జువ్వె యుత్తమ
క్షత్త్రియధర్మముల్ సుగతి|కారణముల్ విపులార్థమూలముల్. 247

1. జ. గలుగఁ | బోలునె వైరిమనఃప్రియం బొగిన్. 2. చ. సేయని|కుమతిఁ 3. గ. సౌఖ్యమున. 4. ఖ. గా. ధర్మువు క్షత్త్రియుల కుత్తమంబు.

వ. కేవలధర్మాచరణంబు శత్రుజయంబునకు సాధనంబు గాదు నికృతివలయుఁ బార్థ భ్రాత లైనయసురుల నమరులు నికృతిన కాదె నిర్జించిరి కావున నీవు సమయ ధర్మరక్షణవ్రతం బుడిగి శత్రువుల జయింప నుద్యోగింపుము. 248

క. జయశీలి వైననిను, బ్రియ మొప్పంగం గాంచి నన్నుఁ బృథుబాహులు ముదా శ్రయు లగుదురు సృంజయులు కే, కయులును యదువీరపాంచాలాదిసుహృదుల్.

తే. మిత్రసంపన్నుఁ డైనసమిత్రుమిత్త్రి, బలముతోడ భేదించినదోర్బలముఁ గలిగి [1]దేశబలంబునుఁ గాలబలముఁ, గలుగువాని కసాధ్యంబుఁ గలదె యెందు.

తే. బలముగలవానిఁ బలువురు బలవిహీను, లొక్కటైకూడి నిర్జింతు రుత్సహించి మధుపుఁ గొన నుత్సహించినమనుజుఁ బట్టి, కుట్టి నిర్జించుమధుకరకులమునట్లు

వ. [2]శూద్రాన్నంబునందలిమృష్టంబునుంబోలె దుర్యోధనురాజ్యంబు దూష్యంబగుటం బౌరజానపదబ్రాహ్మణ వరులును నినుఁ గర్తలయి ధనద్రాజ్యంబు వలచియుండుదురు దీని నేల యెడ సేసెదు సర్వాయుధసనాథం బైనరథం బెక్కి గజపురంబున కభి ముఖుండవై విజయ ప్రయాణంబు సేయుము. 252

మ. ప్రణుతక్షాత్త్రగుణంబు విక్రమము దర్పం బేర్పడన్ విక్రమ క్షణదానం బొనరింపు మీక్షణము విఖ్యాతంబుగా సంగరాం గణమధ్యంబునఁ జేయు మర్జునభుజాగాండీవనిర్ముక్తమా ర్గణధారావళి ధార్తరాష్ట్రకులికాంతారవిచ్ఛేదమున్. 253

క. బహురథగజవాహనభట,సహితులు బలవంతు లని విచారింపకు నీ యహితులు మద్బాహుగదా, నిహతికి మార్కొనఁగఁ బోరనిలువం గలరే.

క. అరివరుల నోర్చి సాగర,పరివృతభూచక్ర మెల్లఁ బాలింపు ప్రజా పరిపాలనంబు కంటెను, ధరణీశ విశేష మొండు ధర్మువు గలదే. 255

వ. రాజ్యపదస్థుం డైనక్షత్త్రియుండు భూరిదక్షిణంబు లైనయజ్ఞంబుల దేవబ్రాహ్మ ణులం దృప్తులం జేసి బ్రాహ్మణులకు నగ్రహారంబులు గోసహస్రంబులు నిచ్చి దురితంబులవలనం బాసి తమోవిముక్తుం డైనచంద్రుండునుంబోలె వెలుంగు ననిన భీమసేనునకు ధర్మరాజు ట్లనియె. 256

ఉ. నీవచనంబు ధర్మ్యము వినీతము నీతియుతంబు నిష్ఠసి ద్ధ్యావహ మత్యుదారమతి దయ్యెనను నిప్పు దలంపఁగా విచా [3]రావసరాప్తికిన్ విషయ మైనది కార్యఫలంబు లెల్ల స ద్భావమునన్ విచారసులభంబుల యందు విచారపారగుల్. 257

క. వనమునఁ బండ్రెం డేండ్లును, జనపదమున నెఱుఁగకుండ సరి నొక వర్షం బును జలుపఁ బూని సత్యము, దనరఁగఁ జేసితిఁ బ్రతిజ్ఞ దగ వృద్ధసభన్. 258

1. గ. దేశ బలముఁ గాలబలంబును ♦ బరగుఁబుద్ధి, 2. అ. శ్వదృతియందలి. 3. రావస రోత్సుకికిన్ విషయ ♦ మైనది.

చ. అలఘుగుణంబులం దధికుఁ డైనమహాత్ముఁడు గాగకోపమా
యలఁ బడి యక్షమావివశుఁ డై యచిరాంశులతావిలాసచం
చల మగులక్ష్మి గాసపడి సత్యము ధర్మువుఁ దప్పి సత్సభా
వలిఁ దగువారియొద్దఁ దగువాఁడయి [1]సద్విధి నుండ నేర్చునే. 259

వ. ఏ నెట్లును సత్యసమయం బతిక్రమింప నోప శుభోదయకాలంబుఁ బ్రతీక్షించి యుండుము రాజ్యంబులు బుత్త్రులును ధనంబును యశంబును సత్యంబునకు సమంబులు గా వనిన భీమసేనుం డి ట్లనియె. 260

ఆ. అంతకుండు జనుల కాసన్నుఁడై యుండ, నిమిషమాత్ర మేని నిశ్చయింపఁ
దగని జీవనంబు దద్ద సుస్థిరముగాఁ, జేసి కార్య మెడయఁ జేయఁ దగునె. 261

వ. శరీరికి మరణంబు నియతంబు మరణంబునకు ముందర వైరంబు దీర్పని వాని జన్మంబు నిరర్థకంబు సకలరాజసమక్షంబునం బగులచేత నట్లు మనపడినపరిభవంబునకుం బ్రతీకారంబు సేయునంతకు రేయునుం బగలును నాహృదయంబు దపించుచుండు నాకంటె నర్జుననకులసహదేవులుం గుంతీదేవియు నంతస్తాపంబున నెంతయు సంతప్తు లగుచున్నవారు. 262

క. వీరలదుఃఖము దీర్పక, క్రూరనికారు లగురిపులకును ముదముగ న
గ్గారణ్యములో ధర్మువుఁ, గారుణ్యముఁ దాల్చి యునికి కార్యమె నీకున్. 263

వ. ఇది బ్రాహ్మణధర్మంబు గాని క్షత్త్రియధర్మంబు గాదు మనుప్రణీతంబు లైన రాజధర్మంబులు నీ వెఱుంగనియవి లేవు [2]శత్త్రుసంహారంబు సేయనినాఁ డత్యంతహాని యగు నట్లుం గాక. 264

తే. వనమునందుఁ బండ్రెండుసంవత్సరంబు, లుండ నేర్చితి మేనియు నొరు లెఱుంగ
కుండ నజ్ఞాతచర్య నొక్కదివస, మైన నుండంగ నేర మెట్లనిన వినుము.

వ. ఆబాలవృద్ధప్రసిద్ధుండ వై పార్థివసూర్యుండ వైననిన్నును సింహసదృశు లైననీ తమ్ములను నెఱుఁగనివారు లేరు మనగూఢభావంబు మేరువునిగూఢభావంబునుం బోలె నఘటమానం బిట్లని యిచ్చినవాసక్లేశం బెన్నఁడును మనకుఁ బాయ నేరదు మన మిప్పు డివ్వనమునఁ బదుమూఁడుమాసంబులు సలిపితిమి సంవత్సరప్రతినిధిగా మాసంబులు సేసికొనుట యొందునుం గలయదియ దీన ధర్మవిరోధంబు లేదు విజయారంభమున కిది యవసరం బనిన భీమసేనుపలుకులు విని నిశ్శ్వాసవ్యాకులితముఖుం డై పెద్దయుం బ్రొద్దు చింతించి ధర్మరా జిట్లనియె. 266

క. క్రమమునఁ బాండిత్యపరా, క్రమగర్వములందుఁ గడుఁ బ్రగల్భుండవు మ
ధ్యమ నీచెప్పినయది కా, ర్యమ యయినను ధీరబుద్ధి వై విను మనఘా. 267

వ. [4]అల్పోపాయం బైనకార్యంబు సాహసారబ్ధం బైనను దోషంబు లే దిది మహా

1. గ. సజ్జనుఁ డుండ. 2. గ. జ. శత్రువర్ధనంబున నత్యంతహాని. 3. జ. [illegible] మనము.
4. క. గ. అల్పోపాయం బైన.

కార్యంబు సాహసక్రియాసాధ్యంబు గాదు సువిచారితంబై సిద్ధిం బొందు విచార పూర్వారబ్ధకార్యంబునకు దైవంబును ననుకూలం బగుం గావున నిమ్మెగా విచా రింప వలయు. 268

సీ. శూరులు ధృతరాష్ట్రసుతులు దుర్యోధనాదులు దురాధర్షు లంతదోడునుమనకు
నాతతాయులు మఱి § యంగభూవిభుఁడును, భూరిశ్రవుఁడు మద్రభూమిపతియు
నాదిగాఁ గలవీరు § లవిజేయవిక్రము, లొలసి తత్సుహృదులై § యున్నవారు
మనచేత జితులైనగమునుజేసు లెల్లను, జని సుయోధనుచేత § సత్కరింపఁ
ఆ. బడి కడంగి వానిపరిస్తవంబున నాజి, వేచి ప్రాణములను § విడువ నున్న
వారు వారలెల్ల § వసుధఁ బ్రసిద్ధులు, వినఁగ నస్త్రశస్త్రవిద్యలందు. 269

క. వినవయ్య కర్ణుగర్వం, బని నాతఁ డభేద్యకవచుఁ § డగుటయు విలునే
ర్పును నతనిబాహువిక్రమ,మును దలఁచిననాఁడు గన్ను § మూయుదు నాకున్.

వ. మఱియు భీష్మద్రోణకృపాచార్యులు సము లయ్యును వారియొద్దన యున్నవారు వార లపారదివ్యాస్త్రవిశారదులు వారల నోర్చికాని దుర్యోధను నిర్జింపం బోల దని విచారించుసమయంబున. 271

—♦ కృష్ణద్వైపాయనుఁడు ధర్మరాజునొద్దకు వచ్చుట ♦—

క. వారలపుణ్యోదయమున, వారిజభవనిభుఁడు లోక § వంద్యుఁడు వచ్చెం
బారాశర్యుఁడు ధర్మశ,రీరుఁడు కృష్ణాజినోత్తరీయుఁడు ప్రీతిన్. 272

వ. ఇట్లు వచ్చి పరమభక్తిపరులైనపాండవులచేతం బూజితుండై కృష్ణద్వైపాయ నుండు ధర్మరాజున కిట్లనియె. 273

క. వీరు లగుభీష్మ కుంభజ, శారద్వత కర్ణు లమితసత్త్వులు § వారిం
బోర వధియించు టెంతయు, ఘోరం బని యున్ననీదు §[1] భర మెఱిఁగి మదిన్. 274

ఆ. దాని నపనయింపఁగా నిప్డు వచ్చితి, నధిక యోగలబ్ధ § మతిరహస్య
మీవిశేషవిద్య § సేవింపగాఁ బార్థుఁ, బనుపు మితఁడు దీనఁ § బడయుఁ సిద్ధి.

వ. అని ధర్మతనయు నేకాంతప్రదేశంబునకుం దోడ్కొని చని సత్యవతీసుతుండు విధి దృష్టవిధానంబునం బ్రతిస్మృతి యనువిద్య నుపదేశించి దీనిశక్తి నర్జునుం డధిక తపోవీర్యవిభవుం డై యింద్రయమవరుణకుబేరాదిదేవతలను నీశ్వరునిఁ బ్రత్య క్షంబు సేసికొని వారలవలన దివ్యాస్త్రంబులు వడసి శత్రువుల జయించి మఱి యవ్వనంబు భవచ్చిరనివాసంబునం జేసి విరళఫలకుసుమపాదపం బై మృగకు లోపరోధియై యొప్పకున్నయది యొక్కచోటన పెద్ద కాలం బునికి యెవ్వరికిం బ్రీతిజనకంబు గాదు కావున నొండువనంబున కరుగునది యని చెప్పి యమ్మని వరుం డరిగినఁ దద్వాక్యముదితులై ద్వైతవనంబు పాసి పాండవులు బ్రాహ్మణ వరులతోన కామ్యకవనంబున కరిగిసరస్వతీతీరంబునందు నివాసంబుసేసి కొండొక

1. భయ.

కాలం బుంక నొక్కనాఁ డజాతశత్రుం డర్జునుఁ జూచి యిట్లనియె. 276

క. సాధితశాత్రవు లగుభీష్మకృపులయం దఖిలగతాశ్రయం బయ్యెఁ జతుః
పాదం బగుచున్న ధను, ర్వేదము బ్రాహ్మణులయందు వేదముపోలెన్. 277

వ. [1]అయ్యాది మహాస్త్రచయం బయి దివ్యమంత్రకలితం బయి వారలకు సన్నిహితం
బగుఁ గావున. 278

క. వారలు సుయోధనుచే నారాధితు [2]లిప్తసత్క్రియులు సల్ప రణ
ప్రారంభ మయిన నెదిరెదు, వారు పరాక్రాంతులై యవశ్యము మనతోన్. 279

వ. దివ్యాస్త్రవిదులైనవారలనోర్చునట్టి యుపాయంబు కృష్ణద్వైపాయనుండు ప్రసా
దించి చెప్పె నీ కిద్ది నీవు ప్రతిగ్రహించి కవచకార్ముక[3]ప్రాసఖడ్గధరుండ వైయ
న్యుల కజేయుండ వై యుత్తరదిక్కున కరిగి తపోయోగబలంబున నింద్రుఁ బ్రత్య
క్షంబు సేయుము తొల్లి వృత్రునకు వెఱచి వేల్పులు తమయాయుధంబులు
నింద్రునందు సమర్పించి రవి యెల్ల నీకుఁ దత్ప్రసాదంబున నగు మఱి యింద్రు
నుపదేశంబున నీశ్వరు నారాధించి తదనుగ్రహంబున నిష్టసిద్ధి వడయు మని
వేదవ్యాసు నుపదేశం బని. 208

క. ధృతినియమవ్రతునకు దీక్షితునకుఁ బార్థునకు విగతకిల్బిషునకు ధ
ర్మతనూజుఁడు ప్రీతిఁ బ్రతిస్మృతి నుపదేశించెఁ దా నమిత్రజిగీషన్. 281

వ అర్జునుండును నయ్యోగవిద్యాగ్రహణప్రభావంబున నధిక తేజోమూర్తియై ది
వ్యాస్త్రలాభార్థం బగ్రజుచేత ననుజ్ఞాతుం డై విధివిహితహోమసంతర్పితవీతి
హోత్రుండును బ్రాహ్మణకృతస్వస్త్యయనుండునునై ధౌమ్యాదిమహీసురవరు
లను భ్రాతృవరులను వీడ్కొని తపంబున కరుగ సమకట్టిన. 282

సీ. ఆతని గాండీవహస్తు నక్షయబాణ,తూణీరయుగళు నున్నతోత్తుంగభుజునిఁ
గనక వర్మావృతఘనతరతనుఁ జూచి, పొంగి యంతర్హితభూతములును
బ్రాహ్మణప్రవరులుఁ బార్థునిమనమునఁ, దలఁచినయర్థంబు దడయ కిష్ట
సంసిద్ధి యయ్యెడు సర్వవిఘ్నములును, శాంతిఁ బొందెడు మని సంతసమునఁ

ఆ. బలికి రంతఁ దరుణి పాంచాలి బీభత్సుఁ, గడకు నరుగుదెంచి కమలనేత్ర
యరిజయార్థ మరుగునాతని యుత్సాహ, మెఱిగి యిట్టు లనియె నిందువదన.

క. అవమానాసహ మగునీ, యవమతక్షత్రియకులంబునం దింకిట పు
ట్టువు గాకుండెడు సత్తమ, మువ్వుబ్రాహ్మణకులమునం దయ్యెడు నాకున్. 284

చ అరికృతదుష్పరాభవమహార్ణవమగ్నుల మమ్ము నందఱం
గరుణ సముద్ధరింపుము జగన్నుత యన్యులు పూనఁ గాని యీ
భరము వహింపఁ బూనిన యపారగుణాన్వితు నిన్ను దిక్కులుం
దరణియు సోముఁడుం నభము ధాత్రియు గాడ్పును గాచుచుండెడున్. 285

1. ఈవచనము పెక్కుప్రతులఁ గానిపింపదు. 2. ఙ. లిప్తసత్క్రియల నల్పరణ. 3. క. కాస్త్రఖడ్గ

వ. అని దీవించి పాంచాలరాజపుత్త్రి దనస్నేహాలాలస విలోలాపాంగవిలోకనంబులం
బార్థుఁ బరిగృహీతపాథేయుం జేయుచుఁ దద్వియోగతరళంబైన హృదయం
బెట్టకేనియు నొక్కింత నేసికొని యుండె మఱి పార్థుండునుం బూర్వోత్తరదిశాభి
ముఖుం డై యొక్కరుండ యరిగి యైంద్రయోగశక్తి నిఖిలభూతదుర్నిరీక్షుం
డగుచు హిమశైలగంధమాదనంబుల నతిక్రమించి. 286

ఉ. వీరుఁడు యోగవిద్యయును విల్లును దోడుగ నింద్రకీల మ
భూరినగంబుపైఁ గడఁగి పోవఁగఁ బోయినఁ బోవకుండు ము
గ్రారివిభేది నీ వను మహామధురధ్వని విన్చె వానికిన్
బోరననంతరిక్షమునఁ బొల్చెనిరంతర పుష్పవృష్టియున్. 287

వ. దానికి విస్మయం బంది చనువాఁడు ముందట నొక్కవృక్ష మూలంబున నున్నవృ
ద్ధబ్రాహ్మణు బ్రహ్మతేజోధికు నవిరతయమనియమకృశీభూతశరీరుం గని నమస్క
రించి తత్సమీపంబున విశ్రమించి యున్న సవ్యసాచిం జూచి బ్రాహ్మణుండిట్లనియె.

క. ఎందుండి వచ్చి తయ్యా యనిందితతేజుఁడవు ధర్మనియతుండవు నీ
కిం దుండ నేల సిద్ధిం, బొందితి చేకొను మభీష్టభూరిఫలంబుల్. 289

క. ఇది శాంతతపస్విల కా, స్పద మిందుఁ గృపాణకవచబాణాసనసం
పద దాల్చి యుండ నేటికి, విదితక్షత్త్రియకులుండవే నీ వనఘా. 290

వ. వీతహర్షక్రోధు లైనబ్రాహ్మణు లుండెడుపుణ్యనివాసంబున నాయుధంబులు ధరి
యించి యుండవలదు వీని విడువు మని [1]నిషేధించిన నవ్విప్రువచనంబులకు
సంచలింపక యున్నయాతని ధైర్యంబునకు మెచ్చి సహస్రాక్షుండు నిజరూపంబుఁ
జూపి యతని కి ట్లనియె. 291

ఆ. ఇష్ట మైనవరము లిచ్చెదఁ బ్రీతితో, వేఁడు మనిన నమర విభున కపుడు
కరముభక్తి మ్రొక్కి కరములు మొగిచి యి,ట్లనియెఁ బురుషవృషభుఁ డర్జునుండు.

వ. దేవా నా కిష్టం బైనవరంబు భవత్ప్రసాదంబున దివ్యాస్త్రలాభం బనిన నది
యేమిగహనంబు దానిన యిచ్చెదఁ బుణ్యలోకంబులు దేవత్వంబును సర్వకామం
బులు వేఁడు మనిన నర్జునుం డి ట్లనియె. 293

సీ. దివిజాధినాథ నా కవి యెల్ల నేటికిఁ, బరమాస్త్రలాభంబ కర మభీష్ట
మరులు సేసినమహాపరిభవక్లేశంబు, వాపంగ నోపక యేపుటడవి
నురుదుఃఖితుల సహోదరుల నందఱఁ బెట్టి, చనుదెంచి మిన్నక చనిన నన్నుఁ
దగువారు జగములోఁ దెగడరే నావుడు, సుతునకుఁ బ్రీతుఁడై శతముఖుండు

ఆ. గరుణ నిట్టు లనియెఁ బరమాస్త్రలాభంబు, నీకు నిష్టమేని లోకవంద్యు
గరళకంఠు నీశుఁ బరముఁ బ్రసన్నుఁగా, వేగ చేయు మధికయోగశక్తి. 294

వ. అట్లేని నిఖిలలోకపాలసహితుండై యీశ్వరుండు నీయభిమతం బొనరించు నని

1. గ. బోధించిన విఘ్నవచనంబులకు,

సహస్రలోచనుండు లోచనాగోచరుం డైన నర్జునుండును దద్వచనంబున సమాహితచిత్తుం డై హిమశైలశిఖరంబున కరిగి వివిధకుసుమఫలవృక్షంబులను విమలనిర్ఝరజలంబులను గమలకుముదకల్హారకలహంససంకులపంకజాకరంబులను రమ్యం బైన తపోవనంబునందుఁ బరమేశ్వరు నుద్దేశించి తపంబు సేయందొడంగిన. 295

క. సురదుందుభినాదంబులు, సురపాదపసంభవప్రసూనసుగంధో
త్కరవాహితపవనము వి, స్తరిల్లె నాతనికి హృదయసమ్మద మెసఁగన్. 296

వ. అందు మనోవాక్కాయకర్మనియతుం డై పరమేశ్వరుం దనచిత్తంబున నిలిపి నిరంతర త్రిరాత్రోపవాసంబుల నొకమాసంబు సలిపి ద్విగుణితత్రిరాత్రోపవాసంబుల రెండవమాసంబు జలిపి పక్షోపవాసంబుల మూఁడవమాసంబు సలిపి యూర్ధ్వబాహుం డై యేకపాదాంగుష్ఠాగ్రంబున నిలిచి వాయుభోజనంబు సేయుచు నాలవమాసంబు సలిపి యిట్లతిఘోరతపంబు సేయుచున్న యర్జునుం జూచి యందలిఋషులు విస్మయం బరది యీశ్వరుపాలికిం జని యి ట్లనిరి. 297

ఉ. భూరిబలుండు పాండవుఁ డపూర్వతపం బొనరించుటం దదీ
యోరుతపః ప్రభావదహనోత్థితధూమచయంబు లంబుదా
కారము లై వనాంతరము గప్పె జగత్త్రయనాథ తత్తపో
భారము సర్వజీవుల కపారభయావహ మద్భుతం బిలన్. 298

వ. అతనియభిమతంబుఁ బ్రసాదించి తత్తపోభారంబు వారింపు మనిన వారలపలుకులు విని పరమేశ్వరుండు దరహసితవదనుం డగుచు వాని యభిప్రాయం బే నెఱుంగుదు నిష్టవరప్రసాదంబున వానికి మనఃప్రియంబుఁ జేసెద మీరు మీ యాశ్రమంబుల కరిగి సుఖం బుండుం డని యప్పుడు. 299

—♦ ఈశ్వరుండు కిరాతవేషంబున నర్జునునొద్దకు వచ్చుట ♦—

సీ. కాంచనవర్ణాపఘనుఁ డై మహోన్నత, కార్ముకహస్తుఁ డై కాలకంఠుఁ
డెఱుకురా జయ్యె నగేంద్రతనూజయు, వనచరీభావంబు వఱలఁ దాల్చెఁ
గుఱుచచేతులు మిడిగ్రుడ్లును గడుకొన్న, [1]తలటులుమటి[2]చెంచుఁదలలు నమరఁ
దడవిండ్లు సేపట్టి తడయక యెఱుకు లై, యార్చుచు భూతము లాత్మసతుల
తే. నెఱుకుసతులఁ గావించి యయ్యెఱుకురాజు
ముందటం బక్కయల నొక్కమొగిన నిలిచి
రంత వేటనెపంబున నంధకారి
గదలెఁ దద్వన మెల్ల గ్రక్కదలు చుండ. 300

చ. అలుగుల మంది యందులమృగావలియుఁ విహగంబులుఁ భయా
కులగతిఁ బొంది మూఁగలును గుంటులుఁ జీకులు నైనయట్టు లై
యులియక యున్నచో నడఁగి యుండఁ గిరాతబలంబుతోడఁ బిం

1. క. తలవట్లు; గ. తలముట్లు, జ. తడలట్లు, 2. క. చుంచుతలలు. గ. చింకితలలు; ఆ. చెంచుఁధనము లమర

గలనయనుం డుమేశ్వరుఁడు ౹ గవ్వడి ఢాయఁగ వచ్చెఁ జెచ్చెరన్. 301
వ. అంత నీశ్వరచోదితుం డయి మూకుం డను దైత్యుం డు సూకరంబై భీకరాకారం
బున బీభత్సు వధియింప సమకట్టి పయిం బఱతెంచిన. 302
క. అనఘుండు దాని దవ్వులఁ, గని ఘనుఁ డయి పాండవుండు ౹ గాండీవగుణ
ధ్వని సేయుచుఁ డాసినఁ బెల్చనయేయఁ గడంగి నిలిచె ౹ సంరంభమునన్. 303
వ. అదియును నాక్షణంబ యేసినయమ్మునుంబోలె నతివేగంబున నాసన్నంబై నదాని
నేయ కేయకు మని యొఱుకురాజు వారించినను వానివచనం బాదరింపక. 304
చ. పటువిశిఖంబునం ద్రిదశరక్షపాలతనూజుఁడు పంది నేసె ము
న్నట పరమేశ్వరుండును రయంబున దానిని యేసె నిట్టు లో
[1]క్కోటఁ బడియెఁ హారార్జునులక్షఘోరశరంబులు పందిపైఁ గుభృ
త్తటముపయిఁ బడిం బడు నుక్రదగ్రమహాశనులట్ల మ్రోయుచున్. 305
క. హరుశరమును నరుశరమును, సరి నిరుపక్కియలు దాఁకి ౹ జవ మఱి శరసం
భరమునఁ దిరిగె వరాహము, శరనిధిమథనమునఁ దిరుగుశైలముపోలెన్. 306
వ. ఇట్లిద్దఱచేత శరవిద్ధుం డై మూకదైత్యుండు సూకరరూపంబు విడిచి నిజరూ
పంబుతోడ నదృశ్యుం డయ్యె నంత నర్జునుండు విస్మితుండై ముందట నత్యున్నత
చాపధరు మేరుశిఖరాకారు నపారకిరాతపదాతిసమేతు నభినవయౌవనవనచరీ
సహస్రపరివృతు నొక్కపురుషుం గని నీ వెవ్వండవు మనుష్యగోచరంబు గాని
యివ్వనంబునఁ బ్రియవనితానుగతుండ వయి యేల కుమ్మరియెదు మఱి నాయే
సినమృగంబున యేసి మృగయాధర్మవిరోధం బేల చేసితి నిన్ను నిప్పుడ నానిశిత
బాణజాలంబులపాలు సేసెద ననిన నగుచు నాతనికి నయ్యెఱుకు రా జిట్లనియె.
ఆ. ఏను నామృగంబు ౹ నేసితి నది మదీ,యాస్త్రనిహతమయ్యె ౹ [2]నది నెపముగఁ
జను నె నీకు లేనిశౌర్యసంపదఁ జెప్పి,కొనఁగ మదము వలుకఁ ౹ గుజనునట్లు. 308
క. పలుకుల నొప్పదు బీరము, గలవేని రణంబు సేయఁ ౹ గడఁగుము నీదో
ర్బల మిప్పుడ యుడిపెద నని, తలరక యేఁయుచుఁ బినాకి ౹ దాఁకె గిరీటిన్. 309
వ. అంత. 310
చ. ప్రతిబలదర్పభంజనుఁడు ౹ పార్థుఁడు దారుణబాణవర్షము
న్నతి నతివీరుఁ డై కురిసినం బరముండు మహాంబువృష్టిఁ బ
ర్వతము గ్రహించునట్లు బలవంతుఁడు దాని గ్రహించి పోర న
క్షతతనుఁ డయ్యె వాని నతిగర్వితుఁ బార్థుఁడు సూచి యాత్మలోన్. 311
చ. ఇతఁడు సురేంద్రుఁ డొండె పరమేశ్వరుఁ డొండె ధనేశుఁ డొండె గా
కతులబలప్రభావయుతుఁ ౹ డన్యుఁడు గాఁ డొరుఁ డైన మద్భుజా
వితతధనుర్విముక్తశరవేగము పోర సహించి యిట్టు ల

1. అ. క్కటఁ... గాఢశరంబులు. 2. గ. నదిశఅముగ, ఘ. నదరి నడుము.

క్షతుఁడు నమూర్ఛితుండు నయి § కంపముఁ బొందక యుండ నేర్చునే. 312

వ. నాయేసినయపారదుర్వారనారాచంబు లవివేకియందుఁ బ్రయుక్తంబు లయిన సుభాషితంబులుంబోలె వీనియందు నిష్ఫలంబు లగు చున్నయవి. 313

ఆ. ఎఱుకు నన్ను నుఱక § యేసినశరములు, నెఱుకు లాడి నాకు § నిశితదివ్య
విశిఖతతులయట్లు § వేదన గావించు, టిది యపూర్వ మీతఁ § డెవ్వఁడొక్కొ.

వ. ఇప్పర్వతంబు దైవనివాసంబు గావున నితండుకిరాతరూపప్రచ్ఛన్నుండై నయెవ్వ నియొక్కొ దివ్యపురుషుండు గావలయు నని యశనికల్పంబు లయినదివ్యశరంబు లయ్యెఱుకుపయినేసి యర్జునుం డక్షయబాణంబులైన తూణీరమ్ములయందమ్ములు గానక ఖాండవదహనంబునాఁ డగ్నిదేవుండు నా కిచ్చినయక్షయశరధు లిప్పుడు యుగాంతకాలరిక్తంబు లైనశరధులుంబోలె నున్నయవి యిది యేమి యద్భు తంబో యనుచు నలిగి గాండీవం బెత్తికొని యెఱుకుపయిం బఱచి. 315

క. అపహృతగాండీవుఁడు నై, యపరిమితక్రోధహృదయుఁ § డర్జునుఁడు పరం
తపుఁ డెఱుకుమస్తకంబునఁ, గృపాణపాతంబుఁ జేసెఁ § గిట్టి కడంకన్. 316

క. అదియు వృథ యైనఁ బార్థుఁడు, వదలక వృక్షముల రాల § వైచెను రణదు
ర్మదు వనచరు నవి యెల్లం, దదంగముల నడఁగె నద్భుతంబుగ నంతన్. 317

వ. (దానం గోపించి.) 318

క. హరుఁ బెనఁగి పట్టుకొని భీ,కరబలుఁ డర్జునుఁడు ముష్టిఘాతంబుల సం
గర మొనరించెను వనచర,వరు లాతనిశౌర్యగౌరవముఁ బొగడి రెదన్. 319

క. తనదివ్యగాత్రమున న,ర్జునగాత్రనిపీడఁ జేసె § శూలధరుం డం
తన మూర్ఛపోయి పీడిత,తనుఁ డై పార్థుండు ధరణితలమునఁ బడియెన్. 320

వ. అంత. 321

చ. వరదుఁడు పార్థశౌర్యవిభవంబున కాతనిధైర్యవృత్తిక
ష్టరుడుగ మెచ్చి సన్నిహితుఁ § డయ్యె జటామకుటేందురేఖయుం
గరమున శూలముం గరళకాలగళంబు బృహద్గజాజినాం
బరముఁ దృతీయలోచనముఁ § బన్నగహారము నొప్పుచుండఁగన్. 322

వ. ఇట్లు విరూపాక్షుండు నిజరూపంబుతో నర్జునునకు సన్నిహితుం డై క్షత్రియు లారు లెవ్వరు నీయట్టిశౌర్యధైర్యవంతులు లేరు నీతపఃశౌత్రగుణంబులకు మెచ్చితి నీకోర్కి సఫలంబు సేసెద సదేవాసురమానుషం బైనజగంబంతయు నీవజయింతు నాస్వరూపంబు నూడు మని దివ్యదృష్టి యిచ్చినం జూచి పార్థుండుకృతార్థుండయి (పులకితుం డగుచు సర్వాంగాలింగితోర్వీతలంబగు) దండప్రణామంబు సేసి. 323

క. వరదు సురాసురవందితుఁ, గరుణాకరు హరుఁ బినాకకరుఁ గరిచర్మాం
బరు నీశ్వరు గిరిజాసుం,దరు నిట్లని ప్రస్తుతించెఁ § దద్దయు భక్తిన్. --324

—♦ అర్జునుఁడు పరమేశ్వరుని స్తోత్రము చేయుట ♦—

దండకము. శ్రీకంఠ లోకేశలోకోద్భవస్థానసంహారకారీ పురారీ మురారిప్రియా చం
ద్రధారీ మహేంద్రాదిబృందారకానందసందోహసంధాయి పుణ్యస్వరూపా విరూ
పాక్ష దక్షాధ్వరధ్వంసకా దేవ నీదైనతత్త్వంబు భేదించి బుద్ధిం బ్రధానంబు
గర్మంబు విజ్ఞాన మధ్యాత్మయోగంబు సత్క్రియాకారణం బంచు నానాప్రకా
రంబులన్ బుద్ధిమంతుల్ విచారించుచున్ నిన్ను భావింతు రీశాన సర్వేశ్వరా
శర్వ సర్వజ్ఞ సర్వాత్మకా నిర్వికల్పప్రభావా భవానీపతీ నీవు లోకత్రయావర్త
నంబున్ మహీవాయుఖాత్మాగ్నిసోమార్కతోయంబులం జేసి కావించి సంసార
చక్రక్రియాయంత్రవాహుండ వై తాదిదేవా మహాదేవ నిత్యంబు నత్యంత
యోగస్థితిన్ నిర్మలజ్ఞానదీపప్రభాజాలవిధ్వస్తనిస్సారసంసారమాయాంధకారుల్
జితక్రోధరాగాదిదోషుల్ యతాత్ముల్ యతీంద్రుల్ భవత్పాదపంకేరుహధ్యాన
డిండీరధారానుభూతిన్ సదాతృప్తులై నిత్యులై రవ్యయా భవ్య సేవ్యా భవా
భర్గ భట్టారకా భార్గవాగస్త్యకుత్సాదినానామునిస్తోత్రదత్తావధానా లలాటేక్ష
ణోగ్రాగ్నిభస్మీకృతానంగ భస్మానులిప్తాంగ గంగాధరా నీప్రసాదంబునన్ సర్వ
గీర్వాణగంధర్వులున్ సిద్ధసాధ్యోరగేంద్రాసురేంద్రాదులున్ శాశ్వతైశ్వర్యసం
ప్రాప్తులై రీశ్వరా విశ్వకర్తాసురాభ్యర్చితా నాకు నభ్యర్థితంబుల్ ప్రసాదింపు
కారుణ్యమూర్తీ త్రిలోకైకనాథా నమస్తే నమస్తే నమః. 325

వ. అని యిట్లు స్తుతియించి కృతాంజలి యై కిరీటి వెండియు నిట్లనియె. 326

క. ఎఱుకని యెఱుఁగక నిన్నున్, మఱకువ నెదిరితిని దీని ? మఱవుము నన్నుం
గఱకంఠా క్షమియింపుము, నెఱి నెవ్వరి కెఱుఁగ నగు నెఱసీచరితంబుల్. 327

వ. అనిన నప్పార్థుం గరుణారసప్రీతివిస్తారితవిలోకనామృతమ్మున సంతర్పితుం జేసి
నగుచు నీశ్వరుండు వానిచేయి పట్టుకొని ధనంజయా నిచేసిన వ్యతిక్రమంబు క్షమి
యించితి నతిమానుషంబైన నీపరాక్రమంబునకు మెచ్చితిఁ బూర్వజన్మంబున
నీవు నరుండను దేవర్షివి నారాయణసఖుండవు నరనారాయణులనంగా మీ రిద్దఱు
బదరీవనంబున ననేకాయుతవర్షములు తపమ్ముఁ జేసినమహావీర్యవంతులరు మీ
తేజమ్మున జగమ్ములు రక్షితమ్ము లగుచున్నయవి యిగ్గాండీవమ్ము దొల్లి యనీయ
దియు దీననచేసి శక్రాభిషేకమ్మునాఁడసురుల జయించి తది యిప్పుడక్షయశరధుల
తోడ మదీయమాయాగ్రస్తం బయ్యెనీగాండీవమ్మును నక్షయశరధులు నీకిచ్చితిం
గొను మింక నీ కిష్టం బైనవరమ్ము వేఁడు మిచ్చెద ననిన నర్జునుం డిట్లనియె.

క. త్ర్యంబక నాకు నభీష్టవ,రంబు ప్రసాదించెదేని ? రౌద్రము దివ్యా
స్త్రం బనఁ బరఁగినపాశుప,తంబుఁ బ్రసాదింపు మిందుశేఖర దయతోడన్. 329

వ. అదియును బ్రహ్మశిరం బనున స్త్రంబును యుగాంత్యకాలంబునందుఁ బ్రయుక్తమ్ము
లై జగత్సంహారమ్ము సేయు వానివలన నభిమంత్రితమ్ములై యనేకశతసహస్ర

సంఖ్యలశూలంబులు గదలు నాళీకవిషంబులయట్టియమ్ములు నుద్భవిల్లునని విందు
నీ కారుణ్యమ్మున దీనిం బడసితి దైత్యదానవయక్షరాక్షసపిశాచోరగమ్ముల నతివీరు
లైన భీష్మద్రోణాదులను జయింతు సహజకవచకుండలుం డైన కర్ణుని వధియింతు
ననిన నీశ్వరుండునుం గరుణించి విశుద్ధాత్ముం డైన పార్థునకు మంత్రధ్యానజప
హోమపూర్వకంబుగా సంధానమోక్షణసంహారసహితంబుగాఁ బాశుపతాస్త్రం
బిచ్చి దీనికి నసాధ్యం బెద్దియును లే దల్పులయందుఁ బ్రయుక్తం బైన జగత్సం
హారము సేయు. 330

క. దీనివిధానం బెఱుఁగం, గా నింద్రకుబేరవరుణకాలాదులకుం
దా నతిగహనం బనినను, మానవులకు నెఱుఁగు టఘటమానము గాదే. 331

వ. ఈదివ్యబాణమ్మున నీ వఖిలలోకమ్ములు జయింతు వని కౌంతేయునకు వరం బిచ్చి
పురాంతకుం డంతర్హితుం డయ్యె నంత. 332

చ. అవిరళ సూర్యమండలసహస్రసమప్రభ మై ధనంజయ
ప్రవరుకరమ్మునం బెలుఁగుపాశుపతాస్త్రముఁ జూచి దైత్యదా
నవసురయక్షరాక్షసగణమ్ము గరమ్ము భయమ్ముఁ బొందె నం
దవనియు దిర్దిరం దిరిగె నద్రిశిలోచ్చయసంచయంబుతోన్. 333

క. త్రినయనగాత్రస్పర్శం, బున నిజగాత్రమును పవిత్రమును ముక్తాఘం
బును నతితేజోవీర్యం, బును నైనఁ బృథాసుతుండు ముదితుం డగుచున్.

క. మంటి హరుదేహ మంటం, గంటి నుమాధీశు [1]నమరకంటకహరు ము
క్కంటిఁ గఱకంఠుఁ జూడం, గంటిఁ గృతార్థుండ నైతిఁ గడు బుణ్యమునన్.

క. ఇమ్మెయి ధర్మజునకు జన,సమ్మతునకు రిపుజయంబు సకలమహీరా
జ్యమ్ము సమకూరె నేఁడు ఘ,నమ్ముగ సర్వప్రయోజనమ్ములతోడన్. 336

—* ఇంద్రుఁడు దేవగణంబులతో నర్జునునకుం బ్రత్యక్షం బగుట. *—

వ. అని సంతుష్టహృదయుం డై యున్నంత. 337

సీ. హరుచేత సంప్రాప్తవరుఁ డయ్యె నరుఁ డని, యెఱిఁగి యింద్రుండు ధనేశధర్మ
[2]వరుణేశ్వరులతోడ సురగణసహితుఁడై, దివ్యవిమానముల్ దివమునందు
వెలుఁగంగఁ గౌరవకులవీరుపాలికి, వరదుఁడై కరుణతో వచ్చునట్టి
యవసరమ్మున ఘనరవగభీరం బైన, మధురవాక్యమున ధర్మప్రభుండు

ఆ. ప్రీతి నిట్టు లనియె బీభత్సునకు ధర్మ,నిత్య పాండుపుత్త్ర నీకు మెచ్చి
వరము లిచ్చు వేడ్క వచ్చిరి నెయ్యురై, యమరనాథుఁ దొట్టి యమరు లెల్ల.

వ. వీరలం జూడు మని దివ్యదృష్టి యిచ్చి నీవు నరుం డను పూర్వఋషివి బ్రహ్మ
నియోగంబున మనుష్యుండ వై యుత్తమక్షత్త్రియకులంబున నుద్భవిల్లితి మఱి
సూర్యాంశజుం డైన కర్ణుని దేవదైత్యదానవగంధర్వయక్షరాక్షసాంశజు లైన

1. అ. సమరకంటకు హరు. 2. వరుణాశ్వినులతోడ.

రాజులను వధియింతు నీ కక్షయకీర్తియగు నని దండధరుం డప్రతివారణం బైన
దండంబు విధియుక్తంబుగా నిచ్చిన. 339

క. ఘోరారివారణము లగు, వారుణపాశంబు లిచ్చె వరుణుఁడు మఱి కౌ
బేరాస్త్ర మర్థి నిచ్చెఁ గు,బేరుఁడు విజయునకు నహితభేదికిఁ బ్రీతిన్. 340

వ. ఇట్లు దివ్యపురుషుం డైనపార్థుండు లబ్ధదివ్యదృష్టి యై యమర్త్యరూపధరు లైన పితృదేవతలతోడం దనముందట నిలిచినమహానీలవర్ణుం డైన వైవస్వతుని వైడూర్యవర్ణుం డై యర్ణవనదీశైలసేవితుం డైనవరుణేశ్వరుఁ జాంబూనదవర్ణుం డై యక్షగణంబుతో నున్నకుబేరునిం జూచి వారివలన దివ్యాస్త్రంబులు వడసి వాక్పుష్పఫలజలంబుల నందఱం దృప్తులం జేసి వెండియు. 341

ఆ. అమరగణసమేతు నైరావతారూఢు, వజ్రధరుఁ ద్రిలోకవంద్యు నింద్రు
వృత్రశత్రు నమరవిభుఁ జూచి యెద నాది,మునివరుండు నరుఁడు ముదమునొందె.

ఉ. ఇందుధరప్రసాదమున నిష్టవరంబులు గాంచి బాంధవా
నందవిధాయి యైన నిజనందను మర్దితశత్రు సద్గుణా
నందితుఁ జూచి యప్డు నయనంబుల వేయును గన్నతత్ఫలం
బందెఁ బురందరుండు పరమాద్భుతసమ్మదపూరితాత్ముఁడై. 343

వ. ఇట్లు దేవేంద్రుఁడు ధనంజయుం జూచి సంతోషిల్లి నీవు పరమేశ్వరువలనఁ బరమసిద్ధితో దేవత్వంబు వడసితివి దేవకార్యంబు దీర్ప నర్హుండవుగాన నారథంబుఁ బుత్తెంచెద నమరావతికి రమ్ము నీకు దివ్యాస్త్రంబు లంద యిచ్చెద నని దేవేంద్రుండు దేవగణంబులతో నమరావతికి నరిగె నర్జునుండును దద్రథాగమనంబుఁ బ్రతీక్షించుచుండునంత. 344

సీ. వారిదమార్గంబు వలన మహానీల, వైజయంతీవిభవంబు వెలయ
నాబద్ధవివిధరత్నావళీప్రభఁ జేసి, రమ్యమై రోదోంతరంబు వెలుఁగ
నురునేమిరవమున నుర్వరాధరదరీ, ముఖములు ప్రతిశబ్దముఖరితంబు
లగు చుండ నానావిధాయుధంబులు దాల్చి, యశనివిద్యుత్సహస్రాభిశోభి

ఆ. తాభ్రసదృశమై మహాజవాశ్వయుత, వాహ్యమాన మైన వరరథంబు
మఘవులాజ్ఞఁ జేసి మాతలియుక్తమై, యింద్రతనయుఁ డున్నయెడకు వచ్చె.

వ. మాతలియు నర్జునుం జూచి సురాసురకిరీటతటఘటితరత్నప్రభాభాసురపదుం డైన మహేంద్రుండు మీయయ్య భవద్దర్శనం బపేక్షించి నిన్ను నమరావతికి రాఁ బనిచె రాజసూయాశ్వమేధశతంబులం జేసినవారి కైనను దుర్లభం బీరథంబు దీని నెక్కు మనిన నర్జునుండును గంగాస్నానపవిత్రీకృతగాత్రుం డై దేవ ఋషి పితృతర్పణంబులఁ జేసి మాతలిప్రయుక్తం బైన యా దివ్యరథం బెక్కి. 346

—* అర్జునుఁ డమరావతికిఁ బోవుట *—

చ. అలఘుతపస్సమాధినియతాత్మలకుం బహుపుణ్యలోకకాం

జీలకు విశుద్ధమానసుల । కుఁ సతతంబును సంశ్రయంబ వై
లలిత నిలింప దంపతి విలాసవిహార మహోత్సవంబులుం
గలిగి వెలుంగురత్నమయ కందరసుందర మందరాచలా. 347

వ. నీయందలి పుణ్యతీర్థంబులు సేవించుచు గంగాంబు[1]చ్యోతస్థలీరుహవనస్పతిఫలంబు లుపయోగించుచు సుఖం బుండితి నమరావతికిం బోయి వచ్చెద నని మందర నగంబు వీడ్కొని పురందరనందనుండు దేవపథంబున కరిగి. 348

సీ. పరమధర్మస్థితిఁ । బ్రజఁగాచి యేలిన, రాజర్షులకు నుగ్ర । రణమునందుఁ
బతుల ప్రస్తవమునఁ । బ్రాణముల్ విడిచిన, వీరులకును యజ్ఞ । విధులఁ జేసి
సురలను వసుమతీసురులను దనిపిన, ధర్మాత్ములకు మహా । తాపసులకు
నిలయంబు లై రమ । ణీయంబు లగురత్న, హర్మ్యవిమానసం । హతులదాని

తే. సకలభువనంబులం గల । సత్పురముల, కెల్ల నుపమాన మై దహ । నేందురవుల
దీప్తి లేకున్నఁ దన దైన । దివ్యదీప్తి, విస్తరంబున నెప్పుడు । వెలుఁగుదాని. 349

వ. మఱియు ననాహితాగ్నులకు నతీర్థసేవకులకు ననృతవాదులకు వేదవిరుద్ధాచారులకు మాంసాహారులకు రణపరాఙ్ముఖులకు [2]నవిషయం బైనదాని నమరావతిం జొచ్చి తద్గోపురసమీపంబున ననవరతవిగళదవిరళ మదజలకుల్యాభిరామం బై నిరంతర నిర్ఝర నీహారనగంబునుంబోలె నొప్పుచున్న యైరావతంబుం జూచుచు సురసిద్ధసాధ్యగణంబుతో గంధర్వకిన్నరగీయమానుం డగుచుఁ జనునప్పుడు. 350

క. సకలర్తుకుసుమసౌరభ, సుకుమారోద్యానతరుల । సుడియుచుఁ బ్రణయో
త్సుకుఁ డై పవనుఁడు పాండుపు,నకు నభిముఖుఁ డయ్యెఁ దన్మనః ప్రియ మెసఁగన్.

క. నరుఁ డైనయాదిముని యని, హరిసుతుఁ డని హరిసహాయుఁ డని హరుచేతన్
వరములు వడసినవాఁ డని, సుర లెల్లను వచ్చి పార్థుఁ జూచిరి ప్రీతిన్. 352

వ. అర్జునుండు నయ్యమరావతీవిభవంబు సూచి హర్షించుచు నప్సరోగీయమాన మంగళగీతమహితమానసుం డగుచు సిద్ధమునిగణాశీర్వాదంబులు సేకొనుచుం జని మాతలినిర్దేశంబున దివ్యరథావతీర్ణుం డై. 353

క. శతమఖునకు భువనావన, రతశీలున కఖల దేవ । రాజర్షి సమ
న్వితునకు వజ్రాభీలో, న్నతపృథుభుజునకుఁ గృతప్రణాముం డయ్యెన్. 354

చ. అనిమిషనాథుఁడుం బ్రచలి । తాంగదతుంగభుజాయుగంబునం
దనయునిఁ గౌఁగిలించుకొని । తత్క్షణజాతనితాంతసమ్మదం
బునఁ బులకాంకితాంగుఁ డయి మున్ను నిజాంకతలస్థుఁ జేసి య
త్యనఘు నిజాసనార్ధమున । నాతని నుంచెఁ గరంబు నెమ్మితోన్. 355

క. లీలై రావతకుంభ, స్ఫాలనకర్కశకరములఁ । బలుమరును మరు
త్పాలకుఁ డంటుచు నుండె గు,ణాలంకృతుఁ డైన పార్థు నంగముఁ బ్రీతిన్. 356

1. గ. ఖాతస్థలీరుహ. 2. జ. నతిగహనం. 3. గ. జ. సకలర్తు సురభికుసుమిత.

వ. ఇట్లధికవిలాసంబుతో సురవిలాసినీ కరకలిత చారుచామీకర దండచామరసమీ
రాలోలకుంతలుం డగుచు సురరాజుతో నేకాసనంబున నున్నయప్పార్థుం బాక
శాసనుశాసనంబున దేవగంధర్వసిద్ధవిద్యాధరు లతిప్రీతి [1]నర్చించి రంత. 357

తే. [2](పాకశాసనుపనుపునఁ బార్థుఁ డొక్క, మణిమయంబైన మహనీయమందిరమున
నెలమి గంధర్వసంగీతహృద్యగోష్ఠి, నుండెఁ జెవులకు నుత్సవం బొందుచుండ.

వ. అంత సూర్యాస్తమయసమయంబునఁ జంద్రుం డుదయించి సాంద్రచంద్రికా
విలాసంబున దిగ్వనితల నలంకరించుచుండ నిలింపపతిపంపున సొంపార నూర్వశి
యర్జునసంగమకాంక్షం జేసి చంద్రికాధవళదుకూలంబు గట్టి మృగమదకర్పూర
కుంకుమోన్మిశ్రితసుగంధం బలఁది వివిధసురభికుసుమవిసరంబులు ముడిచి మణి
మయభూషణాలంకృత యై నిలుకడ వడసినక్రొమ్మెఱుంగుఁదీఁగయుంబోలె మణి
మయమంజీర ఝుళంఝుళ నినాదంబును గంకణఝణఝణత్కారంబును గటి
కలాపకింకిణీక్రేంకారంబునుమదనాజ్ఞావాద్యఘోషంబునుంబోలె మ్రోయుచుండ
మందగమనంబునఁ బురందరనందను మందిరంబున కరుగుదెంచిన నప్పురుషసత్త
ముండు భయభక్తిసంభ్రమంబులతోఁ బ్రత్యుత్థానంబును దండప్రణామంబునుం
జేసి కరకమలంబులు మొగిచి యిట్లనియె. 359

క. ననుఁ బుత్త్రిస్నేహంబున, మనమున మన్నించి శుభసమగ్రునిఁ జేయం
జనుదెంచితివి ముదమ్మున, జనయిత్రీ యేఁ గృతార్థజన్ముఁడ నైతిన్. 360

తే. అనిన నూర్వశి యిట్లను నాత్మనేత్ర, మధుపము లతనిసౌందర్యమధువు గ్రోలు
చుండఁ దమకంబు మీఱియు నూనధర్మ, నిపుణుఁడగు నర్జునునితోడ నెయ్యమొనర.

చ. అనుపమశౌర్య నీదుసముదగ్రగుణంబులు నారదాది స
న్మునివరు లెల్ల జెప్పఁగఁ బ్రమోదమునన్ భవదీయసంగమం
బనిశముఁ గోరుచుం దగఁ బ్రియంబున వచ్చితి నేను గోరఁగా
నను జనయిత్రి యంచు నొక నాయముఁ బల్కెదు వక్రభాషలన్. 362

తే. నీకు నేనాఁటితల్లిని నిజము సెపుమ, యమరలోకంబు వేశ్యలమైనమాకు
నిట్టి తగవులు నడవ వ హీనబాహు, వీర్య యిచ్చట వావియు వెదకఁ జను నె.

వ. ఈ లోకంబున వనితలుఁ బురుషులు విచ్చలవిడిఁ గ్రీడింతు రిచ్చటి కిది యనిం
దితం బైన యాచారంబు నీవును ద్రిదివంబునకు వచ్చినయప్పుడ దివ్యపురుషుం
డవు గావున నామనోరథంబు సఫలంబుగా మందారమంజరీమంజుల మకరందపాన
మత్త మధుకరగాన మనోహర స్థలంబులను మేరుశైలకందరంబులను మందపవ
నంబులు గలనందనాది వనంబులయందును నితాంతకాంత వికసితకనకారవింద

1. నర్చించి 2. ఈ కుండలీకరణములోని గ్రంథ మెల్ల ననఁగా 358 వ పద్యము మొదలుకొని 369-వ గద్యము వఱకుఁ గల యధికపాఠ మెల్లఁ బ్రాఁత వ్రాఁత ప్రతులనన్నిటఁ గానిపించదు. కాన యిది ప్రక్షిప్తము గానోపు.

సమధికసౌరభసంవాసితమహానందకందంబులైన మందాకినీతీరమణిమయవేదికల యందును జంద్రికాసుందరంబులైన సికతాతలంబులను మఱియు నిర్జరవిహార స్థానంబుల ననవరతసురతకేళీసౌఖ్యాంబుధి నోలలార్పు మనిన నిర్వికారధైర్య 'ధుర్యుండై యర్జునుం' డి ట్లనియె. 364

క. ఓహో యిమ్మెయి ధర్మ,ద్రోహోక్తులు వలుకఁ దగునె ♦ దోసం బది గా
దే హరి హరి మనమునఁ దగ, నూహింపక నన్నుఁ బలుకు ♦ టుచితమె నీకున్.

—♦ ఊర్వశి యర్జును నపుంసకునిఁగా శపించుట. ♦—

వ. జగంబులు వుట్టింపను మనుపను సమయింపను గర్తలైన దేవతలకు నెట్లు నడచిన నెగ్గు లేదు నేను గర్మభూమిని జనియించి కర్మరతుండ నైతి నాకునిచ్చటి యాచారం బుచితంబు గాదు మదీయవంశకర్త యైనపురూరవునకుఁ బత్ని వైన కారణంబునను బురందరునకుఁ బరిచర్య యొనర్చుటను నాకు జనని వగుట సందియంబు లేదు తల్లీ! నన్నుం బుత్త్రవాత్సల్యంబునం జూడు మనిన మదనబాణ పీడిత యై కోపారుణిత నయనంబుల నర్జునుం జూచి యూర్వశి యేను గామించి వచ్చిన నామనోరథంబు విఫలంబుఁ జేసినవాఁడవు నీవు మర్త్యలోకంబున మాన వర్జితుండ వై మానినీమధ్యంబున నపుంసకుండ వై యుండు మని శాపం బిచ్చి నిజగృహంబునకుఁ జనియె నంతఁ బ్రభాతసమయంబునఁ దద్వృత్తాంతం బంతయు విని సురపతి కొడుకున కి ట్లనియె. 366

క. నీ యట్టి ధైర్యవంతుని, నేయుగముల నైనఁగాన ♦ మెన్నండును ధ
ర్మాయత్తమతివి మునులకు, నీ యింద్రియజయము గీర్తనీయము తండ్రీ. 367

తే. అనఘ యూర్వశి యిచ్చిన ♦ యట్టిశాప, మనుభవింపంగవలయు నీ ♦ కవనియందు
నింక మీఁద పదుమూఁడవ ♦ యేడు సత్య, సరణి నజ్ఞాతవాసంబు ♦ సలుపవలయు.

వ. అక్కాలంబున నీవు షండరూపంబునఁ బ్రచ్ఛన్నుండ వై రాజకన్యకలకునృత్యంబు గఱపుచుండి తదంత్యంబున శాపమోక్షంబు వడయు మని యనుగ్రహించె నీ యాఖ్యానంబు విన్న పుణ్యపురుషులు సకలదురిత విముక్తులగుదు రనిచెప్పి వైశంపాయనుండు జనమేజయున కి ట్లనియె.) 369

సీ. వజ్రాస్త్ర మాదిగా ♦ [1]వరదుఁడై వివిధది, వ్యాస్త్రముల్ పార్థున ♦ కమర నిచ్చి
తత్ప్రయోగంబులుఁ ♦ దద్రహస్యంబులుఁ, దన్నివర్తనములుఁ ♦ దడయ కపుడు
దయ నుపదేశించి ♦ దారుణాహవములం, దవిజేయవీర్యుండ ♦ వగుము పేర్మి
నని మహోత్సాహుఁ ♦ డై చిత్రసేనుఁ డ, న్గంధర్వపతితోడ ♦ గారవమున

ఆ. వజ్రధరుఁడు గీత ♦ వాద్యనృత్యంబులు, గఱవఁ బంచెఁ బార్థుఁ ♦ గడఁగి యిట్టు
లమరనాథునొద్ద ♦ నర్జునుం డుండ నే, నేఁడు లరిగెనిట ♦ మ్మహీతలమున. 370

వ. అంత నొక్కనాఁడు రోమశుం డనుమహాముని యింద్రునొద్దకు వచ్చి సురగణ

1. గ. వరదుండు దివ్యాస్త్రములు పార్థునకు వేడ్క ♦ మెఱయ నిచ్చి.

పూజితుం డై సురేంద్రుతో నేకాసనంబున నున్నయర్జునుం జూచి యాశ్చర్యం
బంది యింద్రున కిట్లనియె. 371

క. కోరి యనేకయుగంబు ల,పారతపోయుక్తులై నశ్వరికిఁ బడయన్
దూరము నీసభ మఱి నీ,కారుణ్యం బింతకంటెఁ గడుద వ్వెందున్. 372

వ. అట్టియందు నీతో నొక్కట నేకాసనం బెక్కి నీ రెండవమూర్తియుంబోలె నున్న
యిమ్మనుజుం డెందులవాఁ డెవ్వఁ డనిన నమ్మునీంద్రునకు దేవేంద్రుం డిట్లనియె.

క. నరుఁ డనుమహర్షి యీతఁడు, నరలోకమునందుఁ బుట్టె నాయంశమునన్
[1]గురుమతిఁ గౌంతేయుఁడు భా,సురతేజుఁ డుపేంద్రసఖుఁడు సువ్వె మునీంద్రా.

తరలము. శివుఁడు వీనికిఁ బ్రీతుఁ డై దయ సేసెఁ బాశుపతాస్త్ర మీ
దివిజముఖ్యులతోడ నేనును దివ్యబాణము లిచ్చితిం
దివిరి యీతఁడు మత్ప్రియంబున దేవకార్యము దీర్పఁగా
సవినయస్థితి నున్నవాఁడు నిజప్రతాపబలోన్నతిన్. 375

వ. మఱియు వసుమతీఖాతగర్వితులైన సగరసుతులం దనదృష్టితీవ్రదహనంబునం జేసి
దహించినకపిలుం డనుమహాముని నారాయణుం డయ్యె నట్టినరనారాయణులు
జగదుపకారులు జగతీభారావతరణ [2]కారణులై దైత్యదానవవధార్థంబు మ
ర్త్యంబునం బుట్టినవారు గావున. 376

క. దేవతలకు నపకారము, గావించిన యన్నివాతకవచులఁ బాతా
ళావాసుల దానవుల మ,హావీరుఁడు వీఁ డభేద్యుఁ డై వధియించున్. 377

వ. అని తత్ప్రభావంబు సెప్పి యింద్రుండు రోమశున కిట్లనియె మునీంద్రా నీవు మర్త్య
లోకంబునకుం బోయి ధర్మజుం గని యతనికిం దత్సహోదరులకు సంతోషంబు
గా నాయొద్దం బార్థుం డున్నకుశలవార్త యెఱింగించి భీష్మద్రోణకర్ణాదివీరుల
నోర్చునట్టిదివ్యాస్త్రంబులు వడసె నతండు మీ యొద్దకు వేగంబ వచ్చు వగవ
కుండుం డని చెప్పి నావచనంబున ధర్మజు నఖిలతీర్థసేవ సేయం బంపు మట్లయిన
నపేతదురితుం డై యఖిలమహీరాజ్యంబు వడయు నతండు తీర్థాభిగమనంబు
సేయునపుడు నీ వాతనికి సహాయుండవు గ మ్మని యింద్రుండు రోమశుం బనిచె
నిట ధృతరాష్ట్రుం డర్జునుదివ్యాస్త్రలాభంబుఁ బారాశర్యువలన నెఱింగి పరమ
వ్యాకులహృదయుం డై సంజయున కిట్లనియె. 378

సీ. సురసమూహంబుతో సురరాజు నోడించి, ఖాండవం బెక్కటి గాల్చియున్న
వీరున కఖిలాబ్ధిపరివృతవసుంధరఁ గల, రాజుల నోర్చి పరాక్రమమున
నగ్రజు రాజసూయాధ్వర మునిచిన,యధికసమర్థున కర్జునునకుఁ
[3]బ్రబలసింహమునకుఁ బక్కెర వెట్టిన,యట్లు దేవతలు నెయ్యంబుతోడఁ
ఆ. బరముఁ దొట్టి పాశుపత మాదిగా దివ్య,శరము లిచ్చి రట్టిశౌర్య మెసఁగ

1. క. గురుమతి. 2. ఙ. కారణావతారులై. 3. గ. శార్ద సింహమునకు.

నట్టివరుఁడు యోధుఁ డై [1]యున్నపాండవ, వరులఁ జెనయునంతవారుఁగలరె.
క. వారికి ధర్మువు దప్పని, వారికి ఋతవచను లైన వారికి విమలా
చారుల కెద్దియుఁ బడయఁగ, దూరమె పాండవులఁ బోలువారె వీరు లోరుల్.
వ. వారలతో విగ్రహించి దుర్యోధనుండు దనకుఁ దనబాంధవులకు సుహృజ్జనంబులకు హాని సేసికొనియె. 381
ఆ. పర్వతములు వజ్ర[2]పాతాహతిని బోక, తక్క నేని నింద్రతనయుదివ్య
నిశితబాణతతులనిశ్శేష మగు [3]ననఁ, బరులసైన్య మెట్లు బ్రదుక నేర్చు. 382
వ. లయకాలోదిత సహస్రకరుకిరణంబులం జరాచరంబులు దప్తంబు లగునట్లు పార్థబాణంబులం జేసి దుర్యోధనాదులు దుస్సహతాపంబుఁ బొందుదు రని దుఃఖితుం డైన ధృతరాష్ట్రునకు సంజయుం డి ట్లనియె. 383
క. ఈసున దుర్యోధనదు, శ్శాసను లా పాండవులకు సభలో నెగ్గుల్
సేసిన విని వారల నను, శాసింపఁగ వలవ దనఁగఁ జనదే నీకున్. 384
వ. నీయుపేక్షం జేసి దుర్యోధనదుర్ద్యూతపరాజితు లై రాజ్యంబు విడిచి పాండవు లరిగి కామ్యకవనంబున నున్నఁ గృష్ణుం డనేకరాజసమన్వితుం డై వారియొద్దకువచ్చి నీకొడుకులు సేసిన నికారంబునకుం గృష్ణాపరిభవంబునకుం దుఃఖితుం డై కడునలిగి మీకు నిట్లు సేసినదుర్యోధనాదుల దూషించి గజపురంబున ధర్మరాజు రాజ్యాభిషిక్తుం జేయుదు ననియుఁ రాజసూయంబు సేయునాఁ డింద్రప్రస్థంబున నైనవిభూతికంటె విశేషవిభూతి గావింతు ననియు ద్రుపద సృంజయ కేకయ ధృష్టద్యుమ్న బలదేవ సాంబసాత్యకిప్రభృతులసమక్షంబునం బలికిసత్యసమయు లైన పాండవుల చేత సంరంభనివారితుం డై పార్థసారథ్యంబునకుఁ బ్రార్థితుం డయ్యె నని వింటిమి.
క. పదుమూఁడేండ్లుం బోయినఁ, బదునా ల్గగు నేఁడు ఘనులు పాండవులు జగ
ద్విదితముగ నుత్సహింతురు, వదలక రణమునకుఁ గేశవపురస్కృతు లై. 386
క. వరములు వేల్పులచే దు,ష్కరతపమునఁ బడయుదురు జగంబున నొరు లీ
శ్వరుచే వరములు వడసెం, గరుణ ధనంజయుఁడు దనదుకార్ముకశక్తిన్. 387
వ. అయ్యర్జునుదివ్యశరసంఘాతంబును భీమసేను చిత్రగదాఘాతంబును నీయుపేక్షా నిర్ఘాతంబును గౌరవపరిక్షయంబునకుఁ గారణభూతంబు లనిన సంజయునకు ధృతరాష్ట్రుం డి ట్లనియె. 388
క. వృద్ధని జాత్యంధుం డని, బుద్ధివిహీనుఁడని నన్నుఁ బుత్త్రుఁడు బలద
ర్పోద్ధతుఁ డై మెచ్చఁ డసం,బద్ధంబులె కాని వినఁడు పలికినపలుకుల్. 389
వ. దుర్యోధనుండు దుర్బుద్ధి యని యేమి సెప్పవలయు భీష్మద్రోణవిదురాదుల నాదరింపక కర్ణశకునుల నాప్తులం జేసికొని వారివచనంబుల నెగడు నే నేమిసేయుదు నని ధృతరాష్ట్రుండు మిన్నకుండె నిట పాండవులు పార్థుమసలుటకు దుఃఖితు లై

1. క. యుం…బాం…జెనయునట్టి 2. ఖ. పాతహతి. బడక. 3. గ. గాక…బ్రతుకుఁబోర.

ఉ. పాండవసింహ మర్జునుఁడు ♦ పాంసులయశంబు వెలుంగు చుండఁ గా
ఖండలుఁడొట్టి నిర్జరవి♦కారయునుచేత ఁకంబు గాంచి యె
న్నం డిట వచ్చునో కొ-సుజ♦నస్తుతు నాతనిఁ బ్రీతిఁ జూచి నె
న్నండొకో కాంతు మంచును మ♦నంబునఁ గోరుచు నుండి రెంతయున్. 381

వ. అట్టి యవసరంబున యుధిష్ఠిరునకు భీముం డి ట్లనియె. 392

మధ్యాక్కర. నీనిదేశంబున నరిగి పార్థుండు ♦నిష్ఠతోఁ దపము
మానుగాఁ జేయుచు నున్నవాఁ డేల ♦ మసలెనో రాక
వాని ధర్మస్థితుఁ బాసి యున్నయి ♦ వ్వర్షముల్ యుగస
మానంబు లైనవి మనకు నతని♦సమాగమకాంక్ష. 393

వ. మఱి పాండవపాంచాలయాదవవీరులజీవనంబు లాతనియంద నిలిచినవి తదీయ భుజాశ్రయబలంబునం బరుల జయించి ధరణీరాజ్యంబుఁ బరిగ్రహింత మని యున్నవారము గావునం గాలయాపనంబు సేయక యర్జునుం దోడ్కొని తేర జనార్దను రాఁ బనిచి నియోగింపుము. 394

మ. సమయాబ్దంబులకంటె ముందర మహో♦త్సాహంబునన్ బాహువి
క్రమ మొప్పన్ విజయుండు నేను నయి సం♦గ్రామంబులో నేకకా
లమునం దా ధృతరాష్ట్రజాధముల నె♦ల్లం జంపి భూచక్రరా
జ్యము సేకొందుము కౌరవేంద్ర మురజి♦త్సఖ్య ప్రసాదంబునన్. 395

వ. సత్యభంగభీతుండవు గావున నీ వింద యుండి పదమూఁడేండ్లుం జలిపి పదంపడి కరిపురంబునకు వచ్చి రాజ్యాభిషిక్తుండ వగుము దుష్టద్యూతంబున మనరాజ్యం బపహరించినసుయోధనుండు సుచిర ప్రతిష్ఠితుండు గాకుండ నిప్పుడయద్దురాత్ము దూషింతుము నికృతిపరుల నికృతినచేసి నిర్జించినఁ బాపంబు లేదు సర్వప్రకారం బులను శత్రువుల జయించి రాజ్యంబు సేకొనుట రాజులకు విధిచోదితంబైనరాజ ధర్మంబ యనిన భీమసేనుమహారంభసంరంభంబునకు సంతోషించిధర్మనందనుం డాతనిం దనపైకిం దిగిచికొని మూర్ధాఘ్రాణంబు సేసి యిట్లనియె. 396

తే. అనలునకు గాడ్పు దోడైన♦యట్టులింద్ర,తనయునకు నీవుఁదోడైన♦ఁదగయకాజిఁ
బోర రిపులకు బ్రదుకంగఁ♦బోల దైన, నరయ నిది కోపమునకు న♦నవసరంబు.

క. పదమూఁడేండ్లుం బోయినఁ, బదపడి పార్థుండు నీవుఁ-♦ బరనృపతుల దు
ర్మదుల వధియించి విజయా,స్పదబాహుల రగుఁడు ధర్మ♦పరిరక్షకులై. 398

వ. ఏ నెట్లును సత్యభంగము సేయుట కొడంబడ నోప నని ధర్మతనయుం డనుజు ననునయించె నని జనమేజయునకు వైశంపాయనకథితం బైనపుణ్యకథ యతి రమణీయంబుగాను. 399

క. బిరుదాంక భీమ భీమే, శ్వరకృతనిత్యప్రసాద ♦ సౌజన్యగుణా

---

1. అ. త్సఖ్యాభియోగంబునన్.

భరణ పరగండభైరవ, పరనృపమణిమకుట ఘటిత ఽ పద విబుధనుతా. 400

ఉత్సాహము. రాజవంశరత్న రాజ ఽ రాజ సేవ నిత్యల
క్ష్మీజయాభిరామ ధర్మ ఽ మిత్ర మిత్రవిద్వదం
భోజవనపయోజమిత్ర ఽ భూరికీర్తికౌముదీ
రాజితత్రిలోక నిఖిల ఽ రాజలోకపూజితా. 401

గద్యము. ఇది సకలసుకవిజనవినుతనన్నయభట్టప్రణీతంబైన శ్రీమహాభారతంబునం
దారణ్యపర్వంబునందుఁ బాండవ ప్రవేశంబును, గిమ్మీరవధయును, గృష్ణపాంచా
లాభిగమనంబును, సౌంభకాఖ్యానంబును, నింద్రకీలాభిగమనంబును, గైరాతం
బును, నర్జునతపశ్చరణంబును, నీశ్వరునితోడ యుద్ధంబును, బరమేశ్వరుచేతఁ
బాశుపతాస్త్రంబు వడయుటయును, లోకపాల సందర్శనంబును, స్వర్గగమనం
బును, నూర్వశీశాపంబును, దేవతలవలన దివ్యాస్త్రలాభంబును నన్నది ప్రథ
మాశ్వాసము. 402



శ్రీ

హరిహరహిరణ్యగర్భేభ్యోనమః

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆరణ్యపర్వము, ద్వితీయాశ్వాసము.



రమ్య ధర్మనిత్య
ప్రారంభవిభాసి రాజపరమేశ్వర ఘో
రారిమదకుంభికుంభవి
దారణదారుణకృపాణసదక్షిణహస్తా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు [1]శాంతవచనంబుల భీమ
సేనునకుం గోపాటోపోపశమనంబు సేయు చున్నధర్మరాజునొద్దకు బృహదశ్వుం
డనుమహాముని వచ్చి విధిదృష్టవిధానంబునం బూజితుం డయి విశ్రమించి యు
న్న నమ్మునివరునకు ధర్మతనయుం డధర్మపరు లయిన [2]పరులచేతం దనపడిన
నికార ప్రకారం బంతయు నెఱింగించి యి ట్లనియె. 2

క. పుడమియు రాజ్యము బంధుల, విడిచి మృగావలులఁ గలసి విపినంబులలోఁ
గడుకొని మాయట్టిడుములఁ, బడిన[3]నరులు గలరె యొరులు పరమమునీంద్రా.

వ. అనిన నయ్యుధిష్ఠిరునకు బృహదశ్వుం డి ట్లనియె. 4

క. దేవసము లైనయనుజుల,తో విప్రులతో రథాళితో వచ్చి యర
ణ్యావాసము సేసెదు ధర,ణీవల్లభ నీవు ధర్మనిష్ఠితబుద్ధిన్. 5

క. నరనుతుఁడు దొల్లి నలుఁ డను, ధరణీశుఁడు జూద మాడి తనవిభవము పు
ష్కరుచేత నోటువడి యొక్కరుఁడుఁ గరం బిడుమఁ బడఁడె కాననభూమిన్.

—♦ ధర్మరాజునకు బృహదశ్వుండు నలోపాఖ్యానంబు సెప్పుట. ♦—

వ. అనిన నది యెట్లని ధర్మనందనుం డడిగిన బృహదశ్వుం డి ట్లనియె నిషధేశ్వరుం
డయినవీరసేనునికొడుకు నలుం డనువాఁ డనేకాక్షౌహిణీపతియనవరతాక్షప్రియుం
డజేయం బైనతనతేజంబున నెల్లరాజుల జయించి బ్రహ్మణ్యుండయి బ్రహ్మోత్త
రంబుగాఁ బ్రజాపాలనంబు సేయు చుండ. 7

1. క. సాంత్వనవచనంబుల. 2. జ. కౌరవులచేతం. 3. జ. నృపులు.

సీ. అట విదర్భాధిపుఁ డైనభీముం డను, వాఁ డనపత్యుఁడై వ్రతము లొలిఁ
జలుపుచు దమనుఁ డన్నమ్మునిఁ బత్నియుఁ, దాను నుపాసించి తద్వరమున
దమయంతియనుకూఁతు దమదాంతదమనుల, న్సుతులను బడసె విశ్రుతగుణాఢ్యుఁ
డందుఁ గన్యారత్న మయినయాదమయంతి, యత్యంతకాంతిరూపాభిజాత్య
ఆ. విమలగుణసమృద్ధి వెలుఁగుచు సురసిద్ధ,సాధ్యకన్యలట్టిసఖులు నూర్వు
రొలసి తన్నుఁ గొలుచుచుండంగ మహి నొప్పు,చుండె నధికవిభవయుక్తిఁ జేసి.
వ. అంత. 9
క. నలుగుణములు దమయంతికి, నలునకు దమయంతిగుణగణంబులు జను లి
మ్ములఁ బొగడుట నిరువురకును, వెలసె మనోభవవికారవిభ్రమ మొదలన్. 10
వ. ఒక్కనాఁడు నలుఁడు దమయంతీగుణబద్ధచేతస్కుఁ డై మదనానలంబు[1] సహింప నోపక ప్రమదవనంబునఁ గ్రుమ్మరువాఁ డంతరిక్ష (శ్రీ) కాంతాహారావళియుం బోలె హంసావళి యవనీతలంబున నవతరించిన. 11
ఆ. వీరసేనసుతుఁడు వీరుండు హంసల, నడబెడంగుఁ జూచి నగుచు వాని
నెగచి యెగచి యందు నెగయకుండఁగ నొక్క,హంసఁ బట్టుకొనియె నతిరయమున.
ఆ. దాని విడిచి పోవఁగా నోప కఱచుచు, [2]నంతరిక్షమునను హంస లెల్లఁ
బిండు గట్టి తిరుగుచుండె వాతోద్ధూత,శారదాభ్రశకలచయముఁ బోలె. 13
వ. అదియును దన కమ్మనుజేశ్వరుఁ డపాయంబు సేయుం గా వగచి మనుష్యవాక్యంబుల నిట్లనియె నయ్యా యేను నీకుం బ్రియంబు సేసెద నీహృదయేశ్వరి యైనదమయంతిపాలికిం బోయి నీగుణంబులు దానికి వర్ణించి యక్కన్య యన్యుల నపేక్షింపక నీయంద బద్ధానురాగ యగునట్లుగాఁ జేసెద. 14
క. అనిన విని హంసపలుకులు, దనహృదయంబునకు నమృతధారాపాతం
బునుబోలె నైన నృపనం,దనుఁ డనురక్తుఁ డయి విడిచెఁ దడయక దానిన్.
వ. అంచపిండుతో నదియును విదర్భాపురంబున కరిగి యం దుపవనంబున సఖీజనపరివృతయై యున్నదమయంతియంతికంబునకు వచ్చి విహరించుచుండె నంత వానిం జూచి పరమకౌతుకమ్మున. 16
తే. ఒండొరులఁ గడవంగ నయ్యువిద లెల్లఁ, బఱచి యొక్కొక్క[3]కలహంసఁ బట్టికొనఁగఁ
జెలువముగ నందు దమయంతి చేతఁ బట్టు, వడియె నలుచేత విడువంగఁ బడినహంస.
క. దమయంతికి నలునకు సం,గమకారణదూత యైనకలహంసమనో
జ్ఞమనుష్యవాక్యముల న,ద్దమయంతికి హర్ష మెసఁగఁ దా నిట్లనియెన్. 18
వ. నీహృదయేశ్వరుం డైననలు నొద్దనుండి వచ్చితి నపారపారావార[4]పర్యంతానంతమహీతలంబునందు నాచూడని రాజు లెవ్వరును లేరు సర్వగుణసౌందర్యంబుల

1. గ. శమింప. 2. జ. నుండునంత నంతరిక్ష. 3. గ. హంసంబుఁ. 4. క. పర్యంతానంత సకలమహీతలంబునందు.

నెవ్వరు నలుం బోలరు. 19

తే. నీవు నలునకుఁ బేర్మిఁ దోడ్తో దేవివైనఁ, గాక నీ సముజ్జ్వలరూపకాంతి విభవ
నిత్యసౌభాగ్య భాగ్యాభిజాత్య[1]భద్ర,లక్షణావలు లవి సఫలంబు లగునె. 20

వ. నీవు నారీరత్నంబ వాతండు పురుషరత్నంబు గావున మీయుద్దఱసమాగమం
[2]బనోన్యశోభాకరం బగు ననిన విని సంప్రాప్తహృదయసమ్మదయై దమయంతి
దాని కిట్లనియె. 21

మధ్యాక్కర. ఆ రాజుగుణములు నా కెఱింగించి తట్టులు నన్ను
నా రాజునకు నెఱింగించి కరుణ నాయందుఁ గావింపు
మారంగ ననుడు నిషధవిషయమున కరిగి యాహంస
వీరసేనజునకు దాని గుణరూప విభవముల్ సెప్పె. 22

వ. అంత. 23

చ. నలదమయంతు లిద్దఱు మనఃప్రభవానలబాధ్యమానలై
సలిపిరి దీర్ఘవాసరనిశల్ విలసన్నవ నందనంబులన్
నలినదళంబులన్ మృదుమృణాళములన్ ఘనసారపాంసులం
దలిరులశయ్యలన్ సలిలధారలఁ జందనచారుచర్చలన్. 24

వ. ఇట్లిద్దఱు నన్యోన్యరూపగుణ శ్రవణసంజాతప్రీతులై యుండునంత నంతఃకరణ
సంతతమనోజాత సంతాప వివర్ణవదన యైన యా దమయంతింజూచిభయసంభ్ర
మాక్రాంతలై సఖీజను లెల్ల నక్కోమలివృత్తాంతం బంతయు భీమున కెఱిం
గించి యి ట్లనిరి. 25

సీ. కలహంస పలికినపలుకులు [3]గణియించు, నడి దానిపోయినత్రోవలనఁ జూచుఁ
బలుకదు సఖులతోఁ గలలితాంగి మిన్నక, యలయుచు నుండుఁ దానను దినంబుఁ
జారువిభూషణాహార విహారశ, య్యాసనభోగంబులందు విముఖి
యయి రేయుఁబవలు నిద్రయు[4]నోర్వ నెఱుఁగక, దమయంతి నలుఁడను ధరణినాథు

ఆ. నంద బుద్ధి నిలిపి కందర్పబాధిత, యగుచు నున్నయది ధరాధినాథ
ధరణిపతుల నొరుల నురుగుణాఢ్యుల విన, నొల్ల దెంతవిభవయుక్తులయిన. 26

వ. అనిన విని భీముం డేమి సేయుదు నెవ్విధంబున నమ్మహీపతి నిటరావింపనగునో
యని చింతించుచు సంప్రాప్తయౌవన యైనకూతుం జూచి యప్పుడు. 27

క. ఆ వైదర్భుఁడు నిఖిలధ, రావలయములోనఁ బరఁగు రాజన్యుల నా
నావిషయాధీశ్వరులను, రావించెం దత్స్వయంవర వ్యాజమునన్. 28

క. మనుజేశ్వరు లెల్లను బో, రన దమయంతీస్వయంవరమునకు నొప్పం
జనుదెంచిరి సైన్యస్యం, దనఘట్టన నవనితలము దల్లడపడఁగన్. 29

1. క. పుణ్య, లక్ష. 2. జ. బనోన్యసౌభాగ్యశోభనకరంబు. 3. క. గుణియించు.
4. జ. నొప్ప.

వ. ఆ సమయంబునఁ బర్వతనారదు లనుపురాణమునులు భూలోకం బెల్లం గ్రుమ్మరి
యింద్రలోకంబునకుం బోయిన నింద్రుండు వారిం బూజించి భూలోకంబునఁ
గుశలవార్త యడిగి యిది యెట్లు ధర్మపరిపాలనపరు లై వీరు లై రణనిహతు
లైనరాజు లక్షయలోకసుఖంబు లనుభవింప నతిథు లై యిందులకు నింతకాలం
బయ్యు రానికారణం బేమి యని యడిగిన నారదుం డి ట్లనియె. 30

క. ఖరసిద్ధసాధ్యవిద్యా,ధరసురకన్యకలకంటె ǂ దమయంతియ సుం
దరి దానిసుస్వయంవర, మరు దై వర్తిల్లుచున్నǂయది యిప్డు మహిన్. 31

క. అందులకు ధరణిఁ గలనృప,నందను లెల్లను ముదంబుǂనం బోయెదు వే
డ్కందమలోఁ [1]గలహంబును, గ్రందును లే కున్నవారు ǂ గడు నెయ్యమునన్.

వ. అనిననింద్రుండును లోకపాలవరులునుదదాలోకనకౌతుకంబునం(గనకరత్న)రమ్య
దివ్యవిమానారూఢులయి భూలోకంబునకువచ్చి దమయంతీస్వయంవరంబునకుం
బోయెడువాని నాదిత్యులలోన విష్ణుండునుంబోలెఁ దేజోధికుం డైనవాని ననన్య
సాధారణరూపవిభవంబున రెండవ మన్మథుండునుంబోనివాని నలుం గనియంత
రిక్షంబున విమానంబులు నిలిపి భూతలంబునకు వచ్చి వాని కి ట్లనిరి. 33

సీ. నిత్యసత్యవ్రత ǂ నిషధేశ నీవు మా, కమరంగ దూత వై ǂ యభిమతంబు
సేయుము నావుడుఁ ǂ జెచ్చెర నట్టుల, చేయుదు మఱి నాకుఁ ǂ జెప్పుడు మీర
లెవ్వార లేను మీ ǂ కిష్టంబుగా దూత, నై యేమి సేయుదుǂననిన నతని
కమరేశ్వరుం డిట్టు ǂ లనియె నే నింద్రుండ, వీరు దిక్పాలురుǂవిదితయశులు

ఆ. ధరణి నొప్పుచున్నǂదమయంతిసుస్వయం, వరముఁ జూచువేడ్క ǂ వచ్చియున్న
వార మీవు [2]మమ్ము ǂ వారిజాక్షికి నెఱిం,గింపు నామధేయǂకీర్తనముల. 34

వ. అట్లయిన నక్కోమలి మాయందుఁ దన వలచినవాని వరియించు ననిన నింద్రు
నకుఁ గృతాంజలియై నలుం డి ట్లనియె. 35

ఆ. ఎఱిఁగి యెఱిఁగి నన్ను ǂ [3]నేకార్థసముపేతుఁ, బాడియయ్యె యిట్టిǂ[4]పనికిఁబనుప
ననిన నుత్సుకుండǂవై యేన చేసెద, నంటి చేయకుండ ǂ నగునె యింక. 36

ఆ. నిన్ను నిత్యసత్యǂనిరతుఁగా నెఱిఁగి యి,క్కార్యమునకు వలనుǂగలుగు టెఱిఁగి
పనుప వలసె దూతǂభావమపేక్షించి, దేవహితము దీనిఁ ǂ దీర్పవలయు. 37

వ. ఆయుధీయ సురక్షితం బయినరాజగృహం బెట్లు సొర నగు నని శంకింప వలవదు
దమయంతీ నివేశంబు ప్రవేశించునపుడు నిన్నెవ్వరు వారింప నోడుదు రనినశక్ర
వచనంబుల నశంకితుండయి నలుం డప్పుడు విదర్భాపురంబునకుం బోయియొక్క-
రుండ దమయంతీగృహంబు సొచ్చి. 38

---

1. అ. గలహంబులు గ్రందుగ. 2. గ. పోయి...మా మదీయ•కీర్తనముల. జ. పోయి... మదభిధాన•కీర్తనములు. 3. జ. నేకార్థచిత్తుఁ. 4. గ. పనియుఁ.

—♦ నలుఁడు దమయంతియొద్దకు దేవదూతయై పోవుట. ♦—

సీ. హంసచేఁ దనవినిక నంతకంతెను రూప,విభవాతిశయమున [1]వెలయుదాని
సురకన్యకలయట్టి సురుచిరశతకన్య, కాళిచేఁ బరివృత యైనదాని
హృదయేశుఁ డైనత న్నెప్పుడు విను చున్కి, నలయ కాశ్వాసిత యైనదాని
దమయంతిఁ జూచి కంసదర్పశరావిద్ధుఁ, డయ్యె నలుం డంత నతనిఁ జూచి
ఆ. యితఁ డపూర్వమనుజుఁ డెందుండి వచ్చెనో, యనుచు నదరిపడి లతాంగు లెల్ల
నాసనములు డిగ్గి యప్పు డభ్యుద్గత, లైరి మనములందు హర్ష మెసఁగ. 39
వ. అంత. 40
క. దమయంతి మనోభవనిభు, నమరేంద్రప్రతిము దినకరాభు [2]సుధాభూ
సము వరుణసదృశు ధనదో,పము నశ్విసమాను నిషధపతిఁ జూచి నలున్. 41
క. వారిరుహనేత్ర మదన,ప్రేరిత యై లజ్జ యురివి భీతిల్లక బ్రం
దారకమూర్తికి రాజకు,మారున కిట్లనియె మందమందమృదూక్తిన్. 42
వ. నీవు మహానుభావుండ వెవ్వండ విందుల కేమికారణంబున నేకతంబ వచ్చితి విది యత్యుగ్రశాసనుండైన మదీయజనకుచేత సురక్షితం బగుట నెవ్వరికిఁ జొర నశక్యంబు దీని నెవ్వరు నెఱుంగకుండ నెవ్విధంబునం జొచ్చితివి నాకుమనోజవేదనావివర్ధనుండ వైనని తెఱం గెఱింగింపు మనిన దానికి నలుం డిట్లనియె. 43
ఆ. ఏను దేవదూత [3]నింతి నలుం డను,వాఁడ నింద్ర దహన వరుణ యములు
నీస్వయంవరంబు నెమ్మితోఁ జూడంగ, నరుగు దెంచి నన్ను నబల మున్న.
క. నీయొద్దకుఁ బుత్తెంచిరి, మాయం దొక్కరు నభీష్టమతి వరియింపం
దోయజముఖిఁ బ్రార్థింపుము, మాయందఱకును బ్రియం బమర్పుము ప్రీతిన్. 45
వ. అని పంచినఁ దత్ప్రభావంబున నన్యులచేత నలక్షితుండనై వచ్చితి నింద్రాదులకుఁ బ్రియంబు సేయు మనిన నవనీతవదనయై దమయంతి దొల్లి హంసచేత నలు విని వానియందు బద్ధానురాగ యై నవయుచున్నయది యవు డతని నలుంగా నెఱింగి తద్వచనశ్రవణదుఃఖాయమానమానస యగుచు ని ట్లనియె. 46
తరువోజ. [4]ఏ నేడ నింద్రాదు లేడ వారలకు నెప్పుడు మ్రొక్కుదు నేను నీధనమ
భూనాథ నీగుణంబులు హంసచేతఁ బొలుపుగా విని మనంబున నిల్పియున్న
దాన భవన్నిమిత్తమున ని ట్లఖిలధారుణీనాథసార్థంబు రావింపఁ
గా నిప్డు వలసె లోకఖ్యాతకీర్తి కరుణించి పతిబుద్ధిఁ గావింపు మిందు. 47
వ. నీవు దీని కొడంబడనినాఁడు రజ్జువిషాగ్నిజలంబులం బ్రాణపరిత్యాగంబు సేసి కొందు ననిన దానిం జూచి నలుం డి ట్లనియె. 48

1. జ. వెలుఁగుదాని; 2. గ. సుధాభృత్సము. ఆ. సుధారుక్సము 3. జ. నిం తేల నలుఁ, 4. 'ఏ నేల యింద్రాదు లేల' అనియే పెక్కుప్రతులు. 'ఏడకు' మాఱుగా 'ఏల' యనియే ప్రాచీనకవులు ప్రయోగించియున్నారు. ఏ. క. జ. గావింపు.

మత్తకోకిలము. భూరిసత్త్వులు సర్వలోకవిశ్రుతుల్ విభూతిసమృద్ధు లి
ద్ధోరుతేజులు నిన్నుఁ గోరుచు నున్నవారు సురోత్తముల్
వారిపాదరజంబుఁ బోలనివాని నన్ను మనుష్యు సం
సారిఁ గోరఁగఁ జన్నె నీకుఁ బ్రసన్నులై సుర లుండఁగాన్. 49

క. దేవతల కప్రియంబులు, గావించి మనుష్యు లధమగతు లగుదు రిలం
గావున వారి కభీష్టము, గావింపుము నన్నుఁ బ్రీతిఁ గావుము తరుణీ. 50

వ. అనిన దమయంతి నయనాంతర్గళిత బాష్పకణ కరాళకపోలయుగళ యగుచుం బెద్దయుం బ్రొద్దు చింతించి నీయభిప్రాయంబునకుం నిరపాయం బయినయుపాయంబు గంటి నింద్రాదులు నాస్వయంవరంబునకువచ్చెద రేని వారిసన్నిధిన నిన్ను వరియించెద నట్లయిననీకు నిర్దోష(త్వ)ం బగు ననిన నలుండు లోకపాలురపాలికిం బోయి దమయంతికిం దనపలికినవిధంబును దనకు దమయంతి పలికినవిధంబును జెప్పె నంత బుణ్యతిథినక్షత్రముహూర్తంబున దమయంతీస్వయంవరంబు ప్రవర్తిల్లిన.

ఆ. నలున కాని నలినదళనేత్ర వరియింప, దట్టి చూత మనుచు నమరవరులు
నలువురును గడంగి నలరూపమున వచ్చి, రాస్వయంవరమున కతిరయమున.

సీ. దమయంతి సితపుష్పదామాభిశోభిత,హస్తయై చనుదెంచి యంబుజాక్షి
యమ్మహోత్సవదర్శనాగతరాజన్య,నివహంబు నీక్షించి నెమ్మితోడ
నలువురు వేల్పులు నలుదొట్టి యప్పుడే,కాకారులై యున్న నందు నలుని
నేర్పరింపఁగ నేర నింద్రాదులను నలు, నెఱుఁగునుపాయ మింకెద్ది యొక్కొ

ఆ. యనుచు సంశయాకులాత్మయై సురలార, నలు నెఱుఁగువిధము నాకుఁ జేయు
డాత్మరూపధరుల రగుఁ, డని పరిదేవ,నంబు సేసె దనమనంబులోన. 53

వ. దేవతలు దానిపరిదేవనంబు విని కరుణించి యనిమిషలోచనంబులు నస్వేదగాత్రంబులు నొప్ప నవనీతలంబు ముట్టక యాసన్నులై నిలిచి రంత లోకపాలురను భూలోకంబునం గలరాజలోకంబు నవలోకించుచుండఁ బుణ్యశ్లోకుండయిన నలు ధర్మవిధానంబున వరియించి దమయంతి తదీయస్కంధంబున సుగంధికుసుమదామకంబు వెట్టిన. 54

క. దేవతల సాధువాదము,తో విప్రాశీరవంబుతో బహుతూర్యా
రావంబులు సెలఁగెను బా,రావారరవంబుఁబోలె ననివార్యములై. 55

— నలుండు స్వయంవరలబ్ధయైనదమయంతిం బెండ్లి యగుట —

వ. ఇట్లపూర్వస్వయంవరలబ్ధయైనదమయంతి నత్యంతవిలాసంబుతో వివాహంబైన యా నలునకు నింద్రుండు వానియజ్ఞంబులయందు నిజరూపంబుఁ జూపను నగ్నియు వరుణుండును వానివలచినచోటన యగ్నిజలంబు లుత్పాదింపను ధర్ముండు ధర్మంబునంద వానిబుద్ధి వర్తిల్లను వరంబు లిచ్చి దేవలోకంబున కరుగువా రెదుర ద్వాపరంబుతో వచ్చుకలిం గని యెందులకుం బోయెద వని యడిగిన నింద్రా

దులకుఁ గలి యి ట్లనియె. 56

తే. అవనిలో దమయంతీస్వ§యంవరంబు, విస్తరిల్లుట విని కడు § వేడ్కతోడ
నేను దమయంతిచే వరి§యింపఁబడుదు, నని తదర్థినై యఱిగె § నాసఁ జేసి. 57

వ. అనిన నందఱు నగి నీ వందుల కేలపోయె దది ముందఱ నిర్వృత్తం బయ్యె నక్కోమలి యొరుల నెవ్వరి మెచ్చక నలుం డనువాని వరియించె ననినం గలి కరం బలిగి యన్నలునకు దమయంతికి రాజ్యవిభవపరిత్యాగంబును బరస్పరవియోగంబునుం జేసెద నని నిశ్చయించి వాని నక్షరతుంగా నెఱింగి యక్షంబులం జొచ్చి యుండ ద్వాపరంబుం బనిచి నలుండు సేయు చున్నయశ్వమేధాదికానేకభూరిదక్షిణామహాక్రతువులయు జపహోమదానాదివివిధపుణ్యకర్మంబులయుఁ గారణంబునం జొర నవసరంబు గానక యంతరం బన్వేషించుచుఁ బెద్దకాలం బుండె నొక్కనాఁ డతండు కృతమూత్రుం డయి జలోపస్పర్శనానంతరంబునం బాదశౌచంబు సేయ మఱచి సంధ్యోపాసనంబు సేసిన నుపలబ్ధావసరుం డయి కలి నలునందుఁ బ్రవేశించి పుష్కరుం డనువానిపాలికిం బోయి త న్నెఱిఁగించి నీవు నలునితో జూదం బాడి వాని రాజ్యంబును సర్వస్వంబు నోడిచికొమ్మని చెప్పి తానును వానికి వృషం డనుసహాయుం డయి యక్షంబులు గొని పుష్కరుతో నొక్కటం జని నలుం గాంచి నీవు [1]నాతో జూదం బాడు మనిన. 58

క. ద్యూతార్థము తత్కితవా,హూతుండ నై జూద మాడ § కుండుట ధర్మా
పేతం బని యభిముఖుఁ డై, యాతనితో నలుఁడు జూద § మాడఁ గడంగెన్.

క. కలధనము లెల్ల నోడుచు, నలయక జూదమున విజితుఁ § డగు చుండె నిజా
ప్తులు వారించిన నుడుగక, నలుఁడు కలిప్రేరణంబు§నను హతమతి యై. 60

వ. ఇట్లనేకమాసంబులు దుర్వ్యసనాసక్తుం డయినయన్నలుండు వివిధవస్తువాహననివహంబు లొడ్డి పుష్కరునకోటువడం బోయిన నెఱింగి పౌరబ్రాహ్మణప్రధానవరులు దమయంతీపురస్కృతు లయి వచ్చి వారించి కలిసమావేశపరవశుం డైనయన్నలుచేతం బ్రతిహతులయి పలుకకుండి రంత దమయంతి చింతాక్రాంతచిత్తయై.

ఆ. ఎంతయోటువడిన § నంతియ జూదంబు,నందుఁ దగులుఁ జలము§నతిశయిల్లు
నేమి సేయుదాన § నిది యెగ్గునకు మూల, మని లతాంగి దుఃఖి§తాత్మయగుచు.

సీ. అక్షముల్ పుష్కరు§నందు వశ్యంబులై, యునికియు నలునియం§దొందువిధము
లగుటయు నెఱిఁగి ని§జాధీశ్వరున కపజయము గా లక్షించి § సరసిజాక్షి
భర్తయనుజ్ఞ ముఁ § బడసి వార్ష్ణేయుఁ డన్, సారథిఁ బిలిచి యా§స్యందనమున
నింద్రసేనుం డను§నికుమారకు నింద్ర,సేన యన్కూఁతుఁ § జెచ్చెరన తోడు

ఆ. కొని విదర్భ కరిగి § గుఱుకొని మద్బంధు,జనులయొద్దఁ బెట్టి § [2]చట్ట రమ్మ
యంచు నెమ్మిఁ బుచ్చె § నాప్తపురోహిత,మంత్రిబాంధవాభి§మతము [3]గాఁగ.

1. గ. నాతో. 2. అ. సరగ; ఛ. చక్క. 3. జ. గూడ.

క. నలుఁడును ధరణీరాజ్యము, [1]దలఁగఁగ సర్వంబు నపహృతం బైనఁ గడుం
దలరి దమయంతిఁ దోడ్కొని, వెలువడియె నశేషరాజ్యవిభవచ్యుతుఁ డై. 64

తే. పురము వెలి మూఁడహోరాత్రములు వసించి
యున్ననలుపాలి కెవ్వరు నోడి రరుగ
జనవిభుం డైనపుష్కరుశాసనమునఁ
గలికృతద్యూతవిద్వేషకారణమున. 65

వ. ఇట్లు సర్వజనసత్కారార్హుం డయ్యును నలుండు విధికృతంబున నెవ్వరివలనను సత్కారంబు గానక జలంబు లాహారంబుగాఁ దత్పురసమీపంబున దమయంతీద్వితీయుం డై యుండి బుభుక్షాపీడ సహింపనోపక హిరణ్యపక్షంబులతోఁ దమముందటఁ దిగుచున్న పక్షులం గని యవి భక్ష్యంబు లగు నని యప్పక్షులం బట్టికొన సమకట్టి తనకట్టిన పుట్టంబు వానిపై వైచిన నవి పుట్టంబుతోన గగనంబున కెగసి నగుచు విగతవస్త్రుం డైన నలుని కి ట్లనియె. 66

నలుఁడు దమయంతీసహితుం డై యడవికిఁ బోవుట

తే. నీధనంబును రాజ్యంబు నికృతిఁ గొన్న, యక్షముల మేము నీవస్త్ర మపహరింపఁ
బక్షిరూపుల మై వచ్చి పార్థివేంద్ర, యపహరించితి మని చెప్పి యరిగెఁ జదల.

వ. నలుండును వానిం జూచి విస్మయం బంది యీయక్షంబుల[2]ప్రకోపంబునం గాకేమి నా కిట్టి దయ్యె నందు దమయంతి కట్టినపుట్టంబుచెఱంగు [3]గట్టికొనియె న ట్లిద్దఱు నేకవస్త్రు లయి యొండొరుల మొగంబులు సూచి దుఃఖించుచో నలుండు దమయంతి కి ట్లనియె. 68

క. ఇది దక్షిణాపథంబున, కిదియు విదర్భాపురమున కిది కోసల కి
య్యది యుజ్జయినికిఁ దెరువులు, మది నిన్నిఁటిలోన నరుగ మన కెద్ది యగున్.

క. అడవులలో నాతోఁ గడు, నిడుమలు వడ నోప వరుగు మిందుముఖి యి
ప్పుడు నీబంధుజనంబుల, కడ కనవుడుఁ దరుణి శోకగద్గద యగుచున్.

ఆ. అతని కిట్టు లనియె నవనీశ నీవును, నేనుఁ జని విదర్భ నిష్టలీల
నుండుదము మృగాకులోగ్రవనంబుల, కరుగ నేల యిడుమ లంద నేల. 71

వ. అనిన విని నలుం డవనతాననుం డై నీచెప్పినట్ల విదర్భేశ్వరురాజ్యంబును మనరాజ్యంబ యేను దొల్లి యధికైశ్వర్యయుతుండ నై యందులకుం బోయి బంధుజనులకు హృదయానందంబు సేసి యిప్పు డివ్విధంబున సర్వస్వహీనుండ నై యెట్లు వోవ నేర్తు ననిన దమయంతి యి ట్లనియె. 72

తే. అధికదుఃఖరోగార్తున కౌషధంబు, సురుచిరంబుగ భార్యయ చూవె యెందు
నొనర భార్యాసమేతుఁ డై యున్నవాని, కెంత లయ్యును నాపద లెఱుకపడవు.

క. అలసినెడ డస్సినెడ నాఁకలి తృష్ణయు నైనయెడలఁ గడుకొని ధరణీ -

1. ఖ. తలఁకుఁగ. క. తలంకుగ. 2. అ. దోషంబునం. 3. గ. గప్పికొనియె.

తలనాథ పురుషునకు ని,మ్ముల భార్యయ పాచు జి త్తకమునదుఃఖంబుల్. 74

వ. కావున నిది [1]మ దనుజీవిత యనియు ననువ్రత యనియు ననుకంపనీయ యనియు నన్ను విడువక నా యనుగమనంబునకు ననుమతుండవు గ మ్మనినసట్లచేయుదుఁ బ్రాణసమానవై ననిన్నేల విడుతు నోడ కుండు మని నలుండు దనదేవి నా శ్వాసించుచు నొక్కటఁ జని విజనం బైనపిపినంబున నొక్కసభం గని యందు విశ్రమించి పరుషధూళిధూసరస్థలంబున శయనించి మార్గశ్రమనిమీలితనయ నుం డై దుఃఖంబునఁ గన్ను మొగుడ కున్న లేచి తనపాదంబులయంతికంబునఁ గ్లేశపరవశ యై నిద్రవోయెడుదమయంతిం జూచి. 75

సీ. ధరణి రాజ్యంబుతో ధన మెల్లఁ బరులచే, నపహృతంబగుటయు నా ప్తమిత్త్ర
బంధుజనంబులుఁ బ్రకృతిజనంబులు, విడుచుటయును మహావిపినభూమిఁ
బత్నితోఁదనపరిభ్రమియించుటయు నప్డు, దలఁచి శోకించి యి త్తరుణి దొల్లి
మృదుశయనంబున మెలఁతలుమెలపుతో,నడుగులొ త్తఁగ నిద్రయనుభవించు

ఆ. కోమలాంగియిపుడు గుఱుకొని పాంసుల, స్థలమునందు నిద్ర దగిలినదియుఁ
బంకజాక్షి నాకు భార్యయై యిట్టి దుః,ఖంబు నొందె దైవఘటనఁజేసి. 76

వ. ఏను దీనిదుఃఖంబుఁజూడ నోప నెటయేనియుం బోయెద నిది నన్నుఁ గానక తనబంధులయొద్దకుంబోయి దుఃఖంబులం బొరయ కుండునని విచారించి పోవ సనుకట్టి యకోఁమలి మేలుకొనకుండ మెల్లన దానివస్త్త్రంబునం దర్ధంబు చించి తనకుం బరిధానంబు సేసికొని వెలువడి కొండొక నేల పోయి దమయంతియందు ఘనం బైనతననెయ్యం బనుతీఁగం ద్రెంప నేరక క్రమ్మఱి వచ్చి. 77

చ. కలి దమయంతిఁ బాప సమకట్టు సతిం బతి వాయ నోపఁడా
ఉలన సుదీర్ణసౌహృదబలంబున నిట్టులు రెంటఁజేసి య
న్నలుఁడు విమోహరజ్జులఁ బెనంగి గతాగతకారి యైనయు
య్యెలయునుబోలె నూఁడక యెంతయుఁ బ్రొద్దు వినిశ్చితాత్ముఁడై. 78

తే. బాలనొక్కర్తునిక్కానపాలు సేసి, నిష్ఠురుండ నై యే నెట్లు నేర్తుఁ బోవ
ననక కలిచేతనాకృష్టుఁడై నలుఁడు, విగతకరుణుఁడై దమయంతివిడిచిచనియె.

వ. అంత దమయంతి మేలుకని తనపతిం గానక తనవస్త్రార్ధనికృంతనంబును జూచి లేచి నలుగడం బరికించి భయశోకవ్యాకులితచి త్తయయి. 80

సీ. హా మహారాజ మహామహీరక్షణ,దక్ష దక్షిణబాహుదండ దండి
తారాతి నిషధరాజాగ్రణి న న్నిట్లు, పీతదయుండ వై విడిచి చనఁగఁ
దగునె నీ వెన్నఁడు ధర్మువు దప్పని, వాఁడవు సూనృతవ్రతరతుండ
వాడకు మని నన్ను నూఱడఁ బలికిన,పలు కిట్లు మఱవంగఁ బాడి యగునె

1. క. మదధీనజీవిత, గ. మదనుజీవిక. 2. అ. యయ్యె.

ఆ. పొదలలోన డాఁగి[1]పొడసూప కిట్లేల, యున్నవాఁడ విట్టి యుగ్రభావ
మేలనీకు [2]వలసె [3]నెటవోదు నింకెట్లు, గాంతు నిన్ను నుగ్రకాననమున. 81

క. వగవఁగ సాంగోపాంగము, లగునాలుగువేదములయు నధ్యయనము పొ
ల్పుగ నొకసత్యముతో నెన, యగునే యెవ్వియును బోలవట సత్యంబున్. 82

వ. ప్రాణసమానురాల వయిన నిన్ను వర్జ్యంబును విడువ నని పలికితి సత్యప్రతిపాల
నంబు సేయు మని ప్రలాపించుచుం దనయేకాకిత్వంబునకు నబలాభావంబునకుఁ
బ్రతిపదన్యాసజాయమానకంటకమృగపన్నగభయంబునకు వగవక నిజనాథు
నసహాయత్వంబునకు దుస్సహక్షుత్పిపాసాశ్రమాకులత్వంబునకు వగచుచు. 83

క. అలయుచుఁ బులుఁగులయెలుఁగుల, కులుకుచు నుగ్రాతపమున గోపక వృక్షం
బులనీడల నిలుచుచు నెలుఁగులు బులులంజూచి భయముగొని వగ వగచున్.

క. ఏచినపొదలఁ [4]బొరలపడఁ, దోఁచుచు ముండ్లకును నల్లఁ దొలఁగుచు దిక్కుల్
నూచుచుఁ దొడరుచుఁ దెళ్ళుచు, లేచుచు లలితాంగి సంచరించుచు నరిగెన్.

వ. ఇట్లరుగుచున్నదమయంతి నంతికన్యస్తచరణయైనదాని నాహారార్థియయి
యొక్కయజగరంబు పట్టికొనిన నక్కోమలి మెదల నేరక. 86

ఆ. ఇంక నైన నన్ను నేల యాలింపవు, నాకు శరణ మగుము నాథయనుచు
నఱచు చున్నదానియాక్రందనధ్వని, వినుచు నొక్కయెఱుకు వేగవచ్చి 87

వ. తన [5]పట్టినసురియ నప్పెనుఁబాముపదనంబు వ్రయ్యం దఱిగిన రాహుముఖవి
ముక్తయైనచంద్రరేఖయుంబోలె నజగరముఖంబువలన వెలువడిన యా దమ
యంతి నాశ్వాసించితత్సమీపసరోవరస్నాతను వన్యస్వాదుఫలాహారనుంగాఁ జేసి
విగతశ్రమంగావించి నీ వెవ్వరిదాన విట్లేల యేకతంబ యివ్వనంబునకు వచ్చి
తని యడిగి మధురభాషిణియైనయమ్మగువవలన నంతవృత్తాంతంబు నెఱింగి. 88

కవిరాజవిరాజితము. రజనికరాననఁ బీనపయోధరరాజిత రాజసుతన్ విలస
ద్గజపతిగామినిఁ జందనగంధిఁ బ్రకాశితకాంతిసమన్వితఁ బం
కజదళలోచనఁ జూచి కిరాతుఁడు కామనిశాతశరాహతుఁడై
నిజహృదయం బెఱిఁగించె లతాంగి కనింద్యచరిత్రకు వేడుకతోన్. 89

ఆ. అగ్నిశిఖయుఁబోలె నంటను డాయను, జూడ [6]రానియట్టి శుభచరిత్ర
నెఱుక లేని కఱకుటెఱుక వేక్షించెఁ గా, దనక తనకు నాయువల్పమైన.

—♦ దమయంతి శాపంబునం గిరాతుండు చచ్చుట ♦—

వ. దమయంతియు వాని నలిగి చూచి యేను బతివ్రత నైతినేని నిద్దురాత్ముం
డైనకిరాతుం డిప్పుడ మృతుం డయ్యెడుమని శాపం బిచ్చిన వాఁ డప్పుడయగ్ని
దగ్ధం బైనవృక్షంబునుంబోలె విగతజీవుం డై పడియె నట్లుపరమపతివ్రతాగుణ

1. క. పొడయేల నూప. 2. అ. నయ్యె. 3. జ. నెట వోయి తిం కెట్లు. 4. జ. పొదలం బొడవడ. 5. గ. కట్టినసురియ. 6. గ. గాని.

ప్రభావంబున. 91

క. [1]బాల హృదయమున నృపశా, ర్దూలు నిజాధీశు నిలిపి ౯ దుష్టోరగశా
ర్దూలాభీలమ్మగు నావలి, కోలిన భయ మంద కరిగె ౯ నుగ్రాటవిలోన్. 92

వ. మఱియును. 93

సీ. సహకార మత్ప్రియు౯సహకారుఁ బున్నాగ, పున్నాగుఁ దిలక భూ౯భువతిలకుఁ
జందన బుధహారి౯చందనుఁ బుష్పితా,శోక సుహృజ్జన౯శోకదమను
వకుళ కులైక దీ౯పకు విభీతక భయో, పేతార్తిహరు నలుఁ ౯ బ్రీతితోడఁ
గానరే కానల౯లోన లోకోత్తరు, నని మ్రానిమ్రానికి ౯ నరిగి యరిగి

ఆ. యడుగు నడుగు లెండఁ౯[2]బొడవొడఁబొక్కి న,సిర్ఘ రాంతరముల౯నిలుచుఁబొలుచు
గిరులదరులయెడల౯[3]నురుగుహాగృహములఁ, దొంగితొంగిచూచుఁ౯దోయజాక్షి.

వ. ఇట్లు దమయంతి నిజనాథు నన్వేషించుచు భీమఘోరారణ్యంబునం దిరుగునది ముందట. 95

మత్తకోకిలము. వారిభక్షులు పర్ణభక్షులు ౯ వాయుభక్షులు శాకినీ
వారభక్షులు వృక్షమూలని౯వాసయుక్తులునై తపం
బారఁ జేయుమహామునీంద్రుల౯యాశ్రమం బెడఁ గాంచె నం
భోరుహాక్షి పురా సమార్జిత౯పుణ్యకర్మఫలంబునన్. 96

వ. ఇట్లు మృగవ్యాళ తస్కరకిరాతనిరంతరం బయిన కాంతారంబునం బుణ్యనదీతీరంబున నొక్క మునిపల్లియం గని యందు వసిష్ఠవామదేవవాలఖిల్యభృగునారదసదృశు లైన మహామునులం గని నమస్కరించి యున్న నమ్మునులు దమయంతిఁ జూచి యచ్చెరువడి యవ్వా నీవెవ్వరిదాన వివ్వన దేవతవో దేవభామినివో దివ్యంబైన తేజంబుతో నేల క్రుమ్మరియెద వనిన వారలకు దమయంతి యిట్లనియె. 97

క. వినుఁ డేఁ బుణ్యశ్లోకుం, డనఁగ సదాయజ్ఞ నిరతుఁ౯ డనఁగ ధరిత్రిం
దనరిన నలుభార్యను [4]సజ్జనసుత దమయంతి యనఁగ ౯ జరిగినదానన్. 98

వ. విధివశంబున నన్నుం బాసి హృదయేశ్వరుం డెట యేనియుంబోయినఁ దదన్వేషణాసక్తచిత్తనై విపినపరిభ్రమణంబు సేసెద మీతపోవనంబునకు వచ్చి నలుండు భవత్పాదాభివందనకృతార్థుం డయి యెక్కడికింబోయె నతనిపోయినవల నెఱుంగుదు రేని నానతిండు కొన్నిదినంబులలోనఁ దద్దర్శనంబు సంభవిల్లనినాఁడు దేహంబు విడుతునని యేడ్చుచున్నదానిం జూచి కరుణించి మును లిట్లనిరి. 99

క. వనజాయతాక్షి కతిపయ, దినములలోఁ జూడఁ గాంతుఁ ౯ దివిరి నలుని భూ
జనసుతు నెప్పటియట్టుల, తనపురమున రాజ్యలీలఁ ౯ దనరెడివానిన్. 100

వ. మేము మాతపోదృష్టిం జూచితిమి దుఃఖంప కుండు మని తాపసులు దమయన్తి

1. క. గ. జ. బాలకి మనమున. 2. బొడవడ. 3. అ. నురుగుహాంతరములఁ 4. అ. నేఁ బనుపడి...ఁ బరగినదానన్.

హోత్రంబులయు నపారఫలపుష్పతరునదీరమ్యతపోవనంబులయుఁ దోడ నదృ
శ్యులైనం జూచి దమయంతి యిది కలయో నిక్కువంబో యని విస్మయం
బందుచుం జని ముందట నొక్కచనుపం గని దానిం జొచ్చునప్పు డందలి
జనంబులు. 101

సీ. పాంసుజాలములు పై | బ్రాఁకినఁ గరము రూక్షము లగుమూర్ధాలకములదాని
నతిమలినం బైన | యర్ధవస్త్రంబుచే, నావృతం బగు దేహ | యష్టిదాని
నాఁకలి తృష నిద్ర | లనుపీని నెఱుఁగక, యున్మాదిని యుఁబోలె | నున్నదాని
దమయంతిఁ జూచి కొం | దఱు పిశాచం బని, పఱచిరి కొందఱు | భయము వొంది

ఆ. రందుఁ గొంద ఱధిక | హాస్యంబు సేసిరి, యడవి నేమి రోసె | దనిరి కొంద
ఱవ్వ నీవు వేల్ప | వగు దని కొందఱు, మొగిన కేలు మొగిచి | మ్రొక్కిరంత.

వ. దమయంతి సార్థవాహుం జూచి యిమ్మహాగహనంబున నిట్టిజనసంకులం బైన
సార్థంబు గానంబడియెడు నెట్టిపుణ్యంబో యని పల్కి మఱియు ని ట్లనియె 103

క. ఏను నలుభార్యఁ బుణ్యవిహీనతఁ బతిఁ బాసి నవసి | యేకాంతమ యీ
కాననఁ బరిభ్రమించెదఁ, గానరె మీ రమరసదృశుఁ | గరుణాత్ము నలున్.

వ. అనిన దానికి సార్థవాహుండు శుచి యనువాఁ డి ట్లనియె. 105

క. నలుఁ గాన మివ్వనంబున, గల వెప్పుడుఁ గాంతు ముగ్ర | కరులను సింహం
బుల ఋక్షంబుల నిది మర్త్యుల కవిషయ మాతపంబు | దూఱదు సేనన్. 106

వ. అనిన నిచ్చనుప యెట వోయెడు నని యడిగినఁ జేదిపతి యైనసుబాహుపురంబు
నకుం బోయెడు నని చెప్పిన నట్లేని మీతోడ వచ్చెద నని యప్పరమపతివ్రత
పతిదర్శనలాలసయై మునులపలుకులు దలఁచుచు సార్థంబుతో నరిగిన. 107

క. కడు నెండ యెక్కునంతకు, నుడుగక యచ్చనుప నడచి | యుగ్రాటవిలో
విడిసె బహుశీతజలముల, బెడఁ గగునొకచెఱువునొద్దఁ | బెద్దయు డప్పిన్. 108

వ. అంత. 109

సీ. అర్ధరాత్రమునప్పు | డందుల కేతెంచు, గజయూథములు జల | కాంక్షఁ జేసి
యంబుధి విమలతో | యంబు లాస్వాదింపఁ, జను దెంచు జలధర | సమితియట్ల
యచ్చనుపలోన ని | ద్రాసక్తులై నవా, రున్నతద్విపములు | యుగ్రపాద
హతిఁ జేసి మర్దితు | లైరి కొందఱు దంతి, హతిఁ జేసి భిన్నాంగు | లైరి కొంద

ఆ. ఱఱచి ప్రాణభీతిఁ | బఱచి మహీజంబు, లెక్కి రందుఁ గొంద | ఱక్కడంగి
చనుప యిట్టిపాటఁ | బెను పఱి యవినీతు, సిరియుఁబోలె నడఁగి | విరిసిచనియె.

వ. అట్టి సంక్షోభంబున మరణంబునకుఁ దప్పి దమయంతి యాత్మగతంబున. 111

ఆ. జీవితార్థులైన | జీవుల సుఖసుప్తు, లైనవారిఁ జంపె | నఱవ నఱవ
మరణకాంక్ష నున్న | మగువఁ జంపను నను, మఱచె విధి కరంబు | మందబుద్ధి.

సీ. ఇచ్చనుపతోఁ జని[redacted]యవ్వన క్లేశంబుఁ, దలఁగుదు నని బుద్ధిఁ | దలఁచి యున్న

నురుతరసార్థపరయోరాశి హస్తియూ, థాగస్స్యచేఁ బీత యమ్యో నదియుఁ
దోలుమేనఁ జేసినదుష్కృతశక్తియో, వగవక నాస్వాయంవరమునాఁడు
సురవరు లర్థులై చూచుచు నుండఁగ, నలు వరియించిననాఁటియొగ్గ
ఆ. దలఁచి యిట్టియాపదలు సేసిరో వేల్పు, లమరకోపమునన యయ్యెనాకు
నివ్వియోగదుఃఖ మిం కేమి సేయుదు, ననుచు వగచుచుండె నంబుజాక్షి.

—♦ దమయంతి సుబాహుపురంబు ప్రవేశించుట. ♦—

వ. ఇట్లు దుఃఖించుచు దమయంతి ప్రభాతంబ హతశేషు లైనవారలతో ననవరత ప్రయాణంబులం జేదిపతిపురంబు సొచ్చి జనసంకులం బైనరాజమార్గంబు దఱియ వచ్చుచున్నదాని దినకర ప్రభాపటలధూసరిత ప్రభాతచంద్రరేఖయుంబోలె దీప్తివిహీనయై డస్సియు రమ్యాకృతి యైనదానిఁ బ్రాసాదగతయైన రాజమాత దమయంతి దవ్వులం గని తనదాది కి ట్లనియె. 114

తే. జీర్ణమై కడు మాసినచీరగట్టి, ధూళిధూసరాలకములు దూలుచుండ
నబల యున్మత్తవేషిణి యైనలచ్చి, కరణి నిట వచ్చుచున్నది కంటె దాని.

వ. అక్కోమలియందు నాకతిస్నేహంబై యున్నయది దానిం దోడ్కొని రమ్మనిన నదియు దమయంతిం దోడ్కొని రాజమాతయొద్దకుం జనిన నారాజమాతయు దానిం జూచి నీ వెవ్వరిదాన విట్లేల దుఃఖావేశవివశ వై యున్నదానవు చెప్పుమనిన దమయంతి యి ట్లనియె. 116

మధ్యాక్కర జితవైరి మత్పతి జూద మాడి నిర్జితుఁ డయి చనినఁ
బతితోడ నీడయుఁబోలె నేనును బాయక యరిగి
యతిబుభుక్షాతురుం డై నపతిచేత నవ్వ దై వాను
మతిఁజేసి వంచిత నైతి నొక్కచో మఱచి నిద్రించి. 117

వ. అంతనుండియు నమ్మహానుభావు నేకవస్త్రునని కేతను నన్వేషించుచు సైరంధ్రివృత్తంబు సేకొని వియోగానలంబునం గంది కందమూలఫలంబుల యాహారంబుగాఁ బ్రొద్దువడినచోట నివాసంబుగా [1]మృగకులంబ సహవాసంబుగా వనంబులం బరిభ్రమించితి నని బాష్పజలంబులం బయోధరస్థలపరాగంబు పంకంబు సేయుచుఁ బలుక నేరకున్నయా దమయంతికి రాజమాత యి ట్లనియె. 118

క. నీ వుండుము నాకడ నిం,దీవరదళనేత్ర నీపతిని రోయఁగ భూ
దేవోత్తములం బంచెద, నావుడు నిట్లనియె భీమనందన నెమ్మిన్. 119

వ. నీను సైరంధ్రి నయి యుండియు నుచ్ఛిష్టంబు ముట్టను బదధావనంబు సేయను బరపురుషులతోఁ బలుక నోపఁ బతి నన్వేషించుపొంటె నరిగెడుబ్రాహ్మణులతో బలుకుదు నట్టయిన నీయొద్ద నుండుదు నొంపువిధం బైన నుండ నేర ననిన నీ కిష్టం బైనవిధంబున నాయొద్దన యుండు మని దాని నతిగౌరవంబునం జేకొని

1. క. మృగంబుల సహాయంబుగా.

యుండెఁ దనకూఁతు సునంద యనుదాని సమర్పించిన. 120

క. అలయక పుణ్యవ్రతములు, సలుపుచు సైరంధ్రి యనఁగఁ జైద్యేశుపురిన్
నలుదేవి యుండె నెదఁ బతిఁ, దలఁచుచు దుస్సహవియోగతాపార్దిత యై. 121

వ. అట నలుండు దమయంతిం బాసి దారుణారణ్యంబులో నరుగువాఁడు ముందట.

చ. అవిరళవిస్ఫులింగనివహంబుల నభ్రపథంబు నంటుచున్
దవదహనం బుదగ్రతరుదాహము సేయుచు నున్నఁ జూచి భూ
నవపతి దానియంతరమునందు వినియె [1]నరనాథ నన్ను గా
రవమునఁ గావ వేగ యిట రమ్మనునార్తమహానినాదమున్. 123

క. విని శంకింపక చెచ్చెర, ననఘుం డత్యుగ్రతరదవానలమధ్యం
బున కరిగి కనియె దీనా,నను మండలితాంగు నొక్కనాగకుమారున్. 124

వ. అన్నాగకుమారుండును నలునకుం గృతాంజలి యై యేను గర్కోటకుం డను వాఁడఁ గర్మవశంబున నొక్కబ్రహ్మఋషి నుపాలంభించి తచ్ఛాపంబున [2]నెక్కడం గదల నేర కున్నవాఁడ. 125

క. నాలుగుదిశలను దావ, [3]జ్వాలావలి గవిసె మ్రందెదఁ జావ నోప మహీ
పాలక నన్నొక సరసీ,కూలముఁ జేరంగ నెత్తికొని పొమ్ము దయన్. 126

—♦ నలుఁడు కర్కోటకునిచేత దష్టుం డగుట. ♦—

వ. నన్ను రక్షించిన నీకుం బ్రియంబు సేయ నోపుదు ననిన వాని నెత్తికొని పోవం జాలుక నై యంగుష్ఠప్రమాణదేహుం డై యున్న నెత్తికొని నలుం డతిత్వరితగతి నరిగి [4]తాపవర్జితం బైనయొక్కసరోవరంబుసమీపంబున విడువం బోయిన నింకను బదియడుగు లరుగుము నీకు శ్రేయఃప్రాప్తిఁ జేసెద ననిననడుగు లెన్నికొనుచు నరిగి పది యగు నడుగునప్పు డప్పాముచేత దష్టుం డై తనరూపంబు విడచి వికృతరూపంబుతో నున్న నన్నలునకుఁ గర్కోటకుం డాత్మరూపంబుచూపి యిట్లనియె నయ్యా నీవు నాచేత విషపీడితుండ నైతి నని దుఃఖింప వలదు నిన్నొరు లెఱింగిన నెగ్గగుం గావున వికృతశరీరుం జేసితి నెంతకాలంబు నీశరీరంబున నా విషం బుండు నంతకాలంబును నీకు విషోరగరాక్షసపిశాచశత్రునివహంబువలని భయంబు లేదు సర్వసంగ్రామజయంబును భార్యాసంగమంబును నెప్పటిరాజ్యవిభవంబును నగు నీ కెప్పుడేని నిజరూపంబు సేకొన నిష్టంబయ్యె నప్పుడ నన్నుం దలంపు మీవస్త్రంబు నీయొద్దకు వచ్చు దీని ధరియించుము నిజరూపప్రాప్తి యగు నని వరం బిచ్చి వెండియు ని ట్లనియె. 127

మధ్యాక్కర. ఇలఁ బ్రసిద్ధుఁడు ఋతుపర్ణుఁ డనెడుమహీశుఁ డిక్ష్వాకు
కులజుండు నీకు సేవ్యుం డగు నతనిఁ గొలిచి యం దుండు

1. జ. నళనాథ. 2. క. నొక్కెడఁ జలం 3. ఖ. గ. జ్వాలలు గవయంగ బోదఁగా, ♦ జన నోప. 4. చ. తాపవర్జితం.

నెలకొని యతనికి నశ్వహృదయ మశ్వవిద్య యిచ్చి
వెలయ నతనిచేత నక్షహృదయ మక్షవిద్యఁ జేకొనుము. 128

వ. మఱియు బాహుకుం డనునామంబుతో [1]సూపకారవృత్తి నుండు మని హితోపదేశంబు సేసి కర్కోటకుం డదృశ్యుం డైనఁ దద్వచనంబున నలుం డయోధ్యాపురంబునకుం జని ఋతుపర్ణుం గని యేను బాహుకుం డనువాఁడ నశ్వశిక్షయందుఁ గుశలుండ నన్నసంస్కారంబుల శిల్పంబులఁ బెక్కువిధంబుల రచియింప నేర్తు భవత్సేవార్థి నై వచ్చితి ననిన ఋతుపర్ణుం డి ట్లనియె. 129

క. నాయొద్ద నుండు మేని మదీయరథాశ్వములకును ద్రుతిని శీఘ్రముగాఁ
జేయుము నావుడు నట్టుల, చేయుదు నని నలుఁడు వాని । సేవించెఁ దగన్. 130

వ. ఇట్లు ఋతుపర్ణునొద్ద నశ్వాధ్యక్షుం డయి దుష్టాశ్వంబుల వశంబుఁ జేయుచు నశ్వారోహకుల నారోహణంబుల శిక్షించుచు రసవంతంబులుగ నన్నసంస్కారంబులు సేయుచు ఋతుపర్ణుచేత నియుక్తు లయినవార్ష్ణేయజీవలులు దనకు సహాయులుగాఁ బ్రచ్ఛన్నుం డై యుండి యొక్కనాఁడు. 131

సీ. ఇభరాజగమన నీ । వెందుల కరిగితి, తత్తరుకుచాభోగ యెం । దున్నదాన
వబల యెవ్వరిచేత । నడవులలోఁ బట్టువడి తశనాపేక్షఁ । బఱచు చున్న
యుగ్రమృగంబుల । యుదరంబులో నున్న, దానవే నీతల్లి । దండ్రిలొద్ద
ధృతి నున్నదానవే । దేశాంతరంబుల, నున్నదానవె యాచు । నుదితమదన

ఆ. హాతి విమోహితాత్ముఁ । డై హృదయేశ్వరిఁ, దలఁచి రాత్రులెల్లఁ । [2]దాపమునను
నిద్ర లేక వంది । నిట్టూర్పు లూర్చుచు,నుండె నలుఁడు శోక । ముత్కటముగ.

వ. అతని ప్రలాపంబు విని యొక్కనాఁడు జీవలుం డాత్మగతంబున. 133

క. [3]అఱపొఱడు కుఱుచచేతులు, నొఱవశరీరంబుఁ గలిగి । యొరులకుఁ జూడం
గొఱగా కుండియు మన్మథు, [4]నొఱపులఁ బడియెడు నితండు । [5]యువతీ ప్రీతిన్.

వ. వీనిచేతఁ దలంపంబడియెడువనిత వీనికంటె లెస్సది గాకున్నె యనుచు బాహుకు నొద్దకు వచ్చి నీతలంచు చున్నభార్యకు నీకు నేల వియోగం బయ్యె నని యడిగిన బాహుకుం డి ట్లనియె. 135

ఆ. నన్నుఁ జూచి నగరె । నలినాక్షి [6]లే నేడ, విప్రయోగ మేడ । వినవె తొల్లి
యేలయో యెఱుంగ । నేను మంద ప్రజ్ఞుఁ, డనుభటుండు దనల । తాంగిఁ బాసి 136

వ. దానినన్వేషించి యెందునుంగానక ప్రలాపించినం దత్ప్రలాపం బేను ననుకరించితి నని చెప్పి యి ట్లయోధ్యాపురంబున బాహుకనామంబుతో నలుం డుండె నంత

---

1. గ. జ. సూతవృత్తి. 2. ఘ. దామసమున. 3. గ. అఱగొఱలు: జ. అఱదొడలు, 4. క. గ. నొఱుపుల. 5. అ. యువతిప్రియుఁడై 6. లే నేల విప్రయోగమేల అని పెక్కుప్రతుల 'ఏడ' కు మాఱు 'ఏల' యని కనబడెడిని.

నిట విదర్భేశ్వరుండు నలురాజ్యభ్రంశంబు విని కూతురు నల్లుండు నెటవోయిరో యెం దున్నవారో యని శోకించి. 137

క. వారల రోయఁగఁ బంచె న,పారబలుం డిష్టు లైనబ్రాహ్మణుల సదా
చారుల విద్వాంసుల స,త్కారంబులఁ దనిపి వారిఁ గ్రగడు నెయ్యమునన్. 138

వ. మఱియు నలదమయంతు లున్నచో టెఱింగి వచ్చినవారికి వేయిగద్యాణంబు లిత్తు ననియు వారలం దోడ్కొని వచ్చినవారికి గోసహస్రంబులు నగ్రహారం బులు నిత్తు ననియుఁ బలికి పంచిన. 139

—♦ చేదిపురంబున సుదేవుఁ డనుబ్రాహ్మణుండు దమయంతి నెఱుంగుట ♦—

క. జగతీచక్రమునం గల,నగర మహాగ్రామ పక్కణంబులు గలయన్
జగతీదేవోత్తము లి,మ్ముగ రోసిరి నిఖిల దేశములఁ గదిగి వడిన్. 140

వ. అందు సుదేవుం డనుబ్రాహ్మణుండు చేదిపతియైన సుబాహుపురంబునకుం జనిపుణ్యాహంబు సేయింపం బోవుబ్రాహ్మణులతో రాజగృహంబుసొచ్చియంతఃపురంబున సునందాసహితయై యున్నదాని ధూమజాల[1]నిబద్ధం బైనయగ్నిప్రభయునుంబోలె నీలాభ్ర[2]సంవృతం బైనచంద్రరేఖయుంబోలె బహుపంక[3]నిమగ్నం బైనమృణాళి యుంబోలె నేర్పడ కున్ననుం దదీయభ్రూయుగమధ్యగతం బైనసూక్ష్మలక్షణం బిమ్ముగా నిరీక్షించి దానిదమయంతిఁగా నెఱింగియాత్మగతంబున నిదిపతివియుక్తయై శుష్కప్రవాహ యైననదియునుంబోలె శూన్యకమలయైన నళినియుంబోలె నపేత[4]భూజం బైన వనభూమియుంబోలె నొప్పకుండియుఁ దనపతివ్రతాగుణంబున నొప్పుచున్నయది. 141

తే. అనపహార్యంబు తేజోమయంబు సర్వ,గుణములకు నలంకారంబు గురుతరంబు
భామలకుఁ బతిభక్తియపరమమైన,భూషణం బిట్టివే పెఱభూషణములు. 142

వ. రోహిణికిఁ జంద్రసమాగంబునుంబోలె దీనికి భర్తృసమాగమం బెన్నండయ్యెడునో తుల్యశీలవయోరూపాభిజాత్యు లైన నలదమయంతు లొక్కట నుండం జూచి విదర్భేశ్వరుం డెన్నండు కృతార్థుం డయ్యెడునో యంచు నల్లనల్లన దమయంతి కిట్లనియె. 143

తే. అవ్వ నీతల్లిదండ్రుల కాత్మజులకు, బంధుజనులకుఁ గుశలంబు భామ నీదు
కుశలమెఱుఁగునంతకు వంతగూరివగచు,చున్నవారు వారికి వంతయుడుగునింక.

వ. దేవీ యేను భవద్భ్రాతృసఖుండ సుదేవుం డనుబ్రాహ్మణుండ విదర్భేశ్వరుండు నీయున్నచో టెఱుంగ బెక్కండ్రు బ్రాహ్మణులం బుచ్చిన నిందులకు వచ్చి నా పుణ్యంబున నిన్నుం గంటి ననిన దమయంతి వాని నెఱింగి తనపుత్త్రులఁ దల్లి దండ్రుల బాంధవులం బ్రత్యేకంబ యడిగి అశ్రుజలంబు లురుల నేడ్చు చున్నఁ

1. గ. జ. నిబద్ధ యైన, 2. క. సంవృతయైన. 3. క. గ. నిమగ్న యైన. 4. గ. జ. నపేత చూతం బైన వనంబుమంబోలె.

జూచి యేలకో యిప్పుడు సైరంధ్రి యేడ్చుచున్నయది యని సునంద తనజన
నికిం జెప్పి పుచ్చిన. 145

క. చనుదెంచె నంతిపురమున, వనితానివహంబుతోడ వారిజదళలో
చన రాజమాత నృపనందన యగుదమయంతికడకుఁ దద్దయు వేడ్కన్. 147

వ. ఇట్లు వచ్చి తమలో మాటలాడుచున్న బ్రాహ్మణుని దమయంతిం జూచి రాజ
మాత బ్రాహ్మణుని కిట్లనియె నయ్యా యిది యెవ్వనికూఁతు రెవ్వనిభార్య
యేమి కారణంబునం దనభర్తను బాంధవులనుం బాసి పుణ్యవ్రతంబులు సలుపు
చున్న యది నీ వెట్లెఱింగితి కోమలినామం బేమి యని యడిగిన సుదేవుం
డిట్లనియె 147

మధ్యాక్కర. నలినాక్షి యిది విదర్భేశతనయ పుణ్యశ్లోకుఁ డైన
నలుదేవి దమయంతి సుమ్ము విధికారణంబున రాజ్య
చలితుఁ డై నిజనాథుఁ డరిగినఁ దోనఁ జనియె నవ్వార్త
వెలయంగ విని వారి రోయఁ బంచె భూవిభుఁడు బ్రాహ్మణుల. 148

వ. ఏ నిందులకు వచ్చి మీచేత సురక్షిత నై యున్న యిక్కోమలిం జూచి దీని
భ్రూమధ్యంబునం బద్మప్రభం బై విభూత్యర్థంబుగా విధాతృనిర్మితం బైనపుణ్య
లక్ష్మంబు పాంసుపటలచ్ఛన్నం బై యున్న నుపలక్షించి మారాజుపుత్త్రింగా
నెఱింగితి ననిన సునంద శుద్ధోదకంబుల దానిభ్రూమధ్యంబు గడిగిన నది విస్ప
ష్టం బగుడు నందఱు నాశ్చర్యం బంది రంత. 149

సీ. ఆనందభరితాత్మ యై రాజమాత యక్కమలాక్షిఁ బ్రీతితోఁ గౌఁగిలించి
కొని తల్లి నీవు నాకూఁతుర వేను నీజననియుఁ బేర్మి దశార్ణ రాజ
తనయుల మదియు విదర్భేశపతి యయ్యె, నే వీరబాహున కింతి నైతి
ననిన నయ్యవ్వకు నతివినయంబుతో, నలుదేవి మ్రొక్కి సునంద నెత్తి

ఆ. కొని కరంబు నెమ్మిఁ గొన్నిదినంబు లం, దుండి యిట్టు లనియె నొక్కనాఁడు
దేవి యిదియు నదియు ధృతి నాకుఁ బుట్టిన, యిండ్ల కడుసుఖంబ యిందునందు.

వ. అయినను దల్లిదండ్రుల ననుజుల నాత్మజులం జూడ వేడుక యైనది విదర్భకుం
బోయెద నానతి మ్మని కృతాంజలి యైన దమయంతి నతిస్నేహంబున సుబాహు
జనని సుతప్రేషితబలంబుతో సువర్ణమణిమయవిమానోపమానయానంబున నునిచి
పుచ్చిన. 151

—* దమయంతి నలు నెడఁబాసి విదర్భాపురంబు సేరుట. *—

ఉ. భామ విదర్భ కేఁగి తనబంధుజనంబులయొద్ద నుండియుం
గోమలి దేహసౌఖ్యములకుం వెలి యై మలినార్ధవస్త్రముం
భూమిరజంబు నంగమునఁ బొల్పగు చుండఁగ నుండె జీవిత
స్వామి [1]నలేశుఁ జూచుదివసంబులఁ గోరుచు సువ్రతంబుతోన్. 152

1. క. నిశేశు

వ. ఇట్లు భర్తృవియోగాతుర యై దమయంతి ప్రాణంబు ధరియింప నోపక యొక్కనాఁ డేకాంతంబునఁ దనజనని కి ట్లనియె. 154

క. శోకాపనోదిఁ బుణ్య,శ్లోకుని నలు రోయఁ బనుపు ♦ శుభచరితుఁ దదా
లోకనవిహీన నై పర,లోకకృతావాస నగుదు ♦ లోకం బెఱుఁగన్. 154

వ. అనిన నదియును గూఁతునభిప్రాయంబు భీమున కెఱింగించిన నాతండు నలుమార్గణంబున ఋజుమార్గు లయిన బ్రాహ్మణుల నియోగించినం దనపతి నన్వేషింప నరుగు బ్రాహ్మణులకు దమయంతి యి ట్లనియె. 155

ఆ. నైషధేశ్వరుండు ♦ నలుఁ డిప్డు డపమర్షుఁ, డగుటఁ జేసి తన్ను ♦ నన్యు లెఱుఁగ
కుండ నుండుఁ గాన ♦ [1]యును సభాంతరముల, [2]కరిగి యిట్టులనుడు ♦ వరుస మీరు.

సీ. [3]నిత్యసత్యుండవు ♦ నీసతి వంచించి, దానివస్త్రార్ధంబు ♦ దఱిగి నీకుఁ
బరిధానముగఁ జేసి ♦ పాడియే పోవంగ, భార్య భర్తవ్య నాఁ ♦ బరఁగుధర్మ
మది మిథ్య యయ్యె నీ♦యందు నీ కిట్టిని,ర్దయబుద్ధిఁ జేకొనఁ ♦ దగునె యట్టి
సాధ్వికిఁ గరుణఁ బ్ర♦సన్నుండ వగు మని, యెల్లచోఁ బలికిన ♦ నెవ్వఁడేనిఁ

ఆ. బలుకు వడఁగ నోడి ♦ ప్రతివచనం బిచ్చు, నతఁడు నలుఁడు గాఁ బ్రి♦యంబుతోడ
నెఱిఁగి నన్ను నతని ♦ కెఱిఁగించి తోడ్కొని, రండు రానినాఁడు ♦ రం డెఱింగి.

వ. అనిపంచినం బనిపూని బ్రాహ్మణులు దమయంతి కఱపినపలుకు లెల్ల సభలం బలికి యొండునుం గానక వచ్చి రందుఁ బర్ణాదుం డనుబ్రాహ్మణుండు దమయంతి కి ట్లనియె నే నయోధ్య కరిగి నీకఱపిన పలుకు లెల్ల ఋతుపర్ణుసభం బలికిన నొక్కపురుషుండు కుఱుచచేతులవాఁడు ఋతుపర్ణు[4]నొద్ద నూఱుగద్యాణంబుల జీవితంబువాఁడు శీఘ్రయానకుశలుండు సూదక్రియానిపుణుండు విరూపాంగుండు బాహుకుండను నశ్వశిక్షకుండు విని నన్ను నేకతంబ కనుంగొని వెలువెలనగుచు దీర్ఘ నిశ్వాసపురస్సరుం డై యి ట్లనియె. 158

ఆ. పురుషునందు దోష♦పుంజంబు గలిగిన, నెఱిఁగి యెద సహించు♦నేని భార్య
పురుషునం దభీష్ట♦భోగంబు దేహాంత,రంబునందు ధర్మ♦రతియుఁ బడయు. 159

వ. అని యొం డెద్దియుం బలుకక తననివాసంబునకుం బోయె నని చెప్పిన విని పెద్దయుం బ్రొద్దు చింతించి నలుండు గానివాఁడు ప్రతివచనం బేల యిచ్చు నింకను వలను గలవారలం బంచి యాతని నిమ్ముగా నెఱుంగ వలయు నని నిజజనని యనుమతంబున సుదేవు రావించి వాని కి ట్లనియె. 160

క. న న్నెఱిఁగి తెచ్చినట్ల జ,గన్నుతు నలు నెఱిఁగి తెమ్ము ♦ కౌశలమున వి
[5]ద్వన్నుత సర్వసుగుణసం,పన్నుండవు నీవ బుద్ధిఁ ♦ బరికింపంగన్. 161

1. అ. యురు, 2. గ. కరిగి జరిగి యిట్టు లనుఁడు మీరు. 3. జ. సత్య నిత్యుండవు ♦ సతినిట్టు.
4. ఖ. నందు. జీవితం బేలువాఁడు. 5. గ. ద్వన్నాథ సర్వగుణ.

క. అరుగు మయోధ్యకు దేశాం,తరవిప్రుఁడ వై రవిప్రతాపోన్నతు ను
త్తరకోసలేశు భాంగా,సరినిం గను మనఘు నమరసము ఋతుపర్ణున్. 162

వ. మఱి విదర్భావిభుం డగుభీముండు నలు రోయం బంచి యెందునుం గానక యిం
కను దమయంతికిఁ బునస్స్వయంవరంబు రచియింపం బోయిన నందులకు భూవల
యంబునం గలరాజు లెల్లను బోయెద రని యతిత్వరితంబుగా ఋతుపర్ణునకుం
జెప్పుమని పంచిన సుదేవుం డయోధ్యానగరంబునకుం బోయి ఋతుపర్ణుం గాంచి
విదర్భాపురంబున దమయంతీస్వయంవరం బెల్లియో యెల్లుండియో యయ్యెడు
నని చెప్పిన విని ఋతుపర్ణుండు బాహుకుం జూచి నాకు దమయంతీస్వయంవరంబుఁ
జూడ నొక్కనాఁటన విదర్భకుం బో వలయు నీయశ్వనైపుణ్యంబుఁ బ్రకాశింపు
మనిన నట్లచేయుదు నని నలుండు దనమనంబున దుఃఖించి. 163

ఆ. అడవిఁ దన్నుఁ బాసి ఽ యరిగిన నలిగి కా,కున్నె యిట్లు సేయ ఽ నువిద గడఁగె
నెట్లయేనిఁ గూర్తు ఽ రింతులు మా కని, విశ్వసించువారు ఽ వెడఁగు లెందు.

ఆ. సాధ్వి నాకుఁ గూర్చు ఽ సంతతి గలయది, చెలువ యిట్టు లేల ఽ చేయు నైన
నెఱుఁగవలయు దీని ఽ నే ఋతుపర్ణుతోఁ, బోదు నని నలుండు ఽ బుద్ధి దలఁచి.

వ. తొల్లి వార్ష్ణేయుండు దెచ్చినతనరథంబునందు నిజహయంబుల నాలక్ష్యమాణ
శుభలక్షణంబులు మనోవాయువేగంబులు నైనవానిం బూన్చికొనివచ్చిన ఋతు
పర్ణుం డారథం బెక్కినపుడు హయంబులు మ్రొగ్గినం జూచి యిప్పేదగుఱ్ఱంబు
లతిదూరం బెట్లు పోవ నోపు నొండుగుఱ్ఱంబులం బూన్పు మనిన బాహుకుం
డి ట్లనియె. 166

క. అవనీశ యీ హయంబులు, పవనగతిం బఱచుఁ బ్రొద్దు ఽ వడ కుండఁగ నేఁ
డ విదర్భకు ననపుడు విని, కువలయపతి మెచ్చి బాహుకున కి ట్లనియెన్. 167

వ. అట్లయిన హయతత్త్వకౌశలం బెఱింగి నీకు నభిమతం బొనరింతు నని రథం
బెక్కి బాహుకవార్ష్ణేయసహితుం డయి యరుగువాఁడు. 168

మధ్యాక్కర. ఎదురను దవ్వులఁ జూచినపొడవు ఽ లెల్లఁ దత్క్షణము
కదియఁగా నవ్వి యెంతయును ద వ్వయి ఽ కనఁబడఁ బిఱుఁద
నిది దినేశ్వరురథమో యనూరుఁడో ఽ యిత్ఁ డంచు నపుడు
హృదయమునను గడు విస్మయం బందె ఽ నిక్ష్వాకుకులుఁడు. 169

వ. వార్ష్ణేయుండును బాహుకురథంబు గడపునేర్పున కచ్చెరువడి యాత్మగతంబున.

క. ఈతండు శాలిహోత్రుఁడో, మాతలియో నలుఁడొ యొరులు ఽ మానవులు జవో
పేతముగ నిట్లు రథహయ,నీతి యెఱుంగుదురె ధారుణీవలయమునన్. 171

వ. వయోవిద్యావైభవంబుల నితండు నలుం బోలియు వికృతరూపధరుం డయిన
కారణం బేమియొ మహాపురుషులు దేవయుక్తులై ప్రచ్ఛన్నవృత్తినుండుదురు

వారి నెఱుంగం బోలు నె యనుచుం జనునప్పుడు ఋతుపర్ణుండు దనయుత్తరీయంబు
జాఱి భూతలంబుపయిం బడిన మలంగి చూచి బాహుకా వార్ష్ణేయుండు వోయి
యుత్తరీయంబు దెచ్చునంతకు, రథగమనం బించుక మందంబు సేయు మనిన
బాహుకుండు నగి నీయుత్తరీయంబు వడినయెడ యచ్చోటికి నొక్కయోజనంబు
గలదు దాని వార్ష్ణేయుం డెట్లు దే నేర్చు నని రథగమనవేగమాహాత్మ్యంబు
సెప్పును ననేకదేశంబులు గడచి చని యొక్కయెడ నగణ్యపర్ణఫలశాఖాలంకృ
తం బయినవిభీతకవృక్షంబుం గని రంత ఋతుపర్ణుండు బాహుకున కిట్లనియె. 172

ఆ. ఎల్లవారు నెఱుఁగ రెల్లవానిని భిన్న, విషయు లెల్లవారు విద్యలందుఁ
దొలఁగ కే నెఱుంగుదును దృష్టిమాత్రన, సకల మైనవస్తుచయముసంఖ్య.

వ. ఇవ్విభీతకంబున ఫలపర్ణసముదాయసంఖ్యఁ జెప్పెద విను మీరెండుశాఖలంగల
పర్ణఫలంబులుపది వేలు నొక్కండు దక్కినశాఖలం గలయవి రెండువేలుందొంబ
దే ననినబాహుకుండు విని వీని నెన్ని కాని నిశ్చయింప నేర నని తనరథంబునిలిపి
యా వృక్షం బాక్షణంబ యురులంద్రోచి యయ్యేశాఖలం గలయాకులుం బండులు
నెన్నిన ఋతుపర్ణుండు సెప్పినయన్ని యయిన నచ్చెరువడి యివ్విద్య నాకు నుప
దేశింప వలయు నని యడిగిన ఋతుపర్ణుం డిట్లనియె. 175

క. ఇది యక్షహృదయ మనఁగా, విదితం బగువిద్య దీని విధ్యుక్తముగా
మది నెఱుఁగు నరుఁడు సంఖ్యా,విదుఁ డగు దుష్కృతకళంకవిముక్తుఁ డగున్.

చ. సకలగుణప్రసిద్ధుఁ డగు సర్వహితుం డగుఁ జూవె యందు బా
హుకునకుఁ బ్రీతితోడ విధియుక్తముగా నుపదేశ మిచ్చె న
త్యకుటిలబుద్ధి నక్షహృదయంబుఁ గరంబుఁ రయంబుతో విద
ర్భకుఁ జనువేడ్కఁ జేసి ఋతుపర్ణుఁడు పూర్ణమనఃప్రసన్నుఁడై. 176

వ. ఇట్లు నలుండు ఋతుపర్ణువలన నక్షహృదయంబు వడసి సంతుష్టుం డై నీకు నశ్వ
హృదయం బిచ్చెదఁ బరిగ్రహింపు మనిన ఋతుపర్ణుం డట్ల చేయుదు నది
యంతకు నీయంద యుండనిమ్ము నావలసినప్పుడు గొందు ననియె నంత నయ్యక్ష
హృదయసామర్థ్యంబున నప్పుడు. 177

—♦ నలుండు గలిచేత విముక్తుఁ డయి విదర్భకుఁ బోవుట. ♦—

క. నలుఁ దొల్లి యాక్రమించిన,కలి కర్కోటకవిషంబుఁ గ్రక్కుచు నొడలన్
వెలువడి నలునకు విహితాం,జలియై తన్నెఱుఁగఁ జెప్పెఁ జంచలుఁడగుచున్.

ఆ. వానిఁ జూచి నలుఁడు దా నల్గి శాప మీ, నున్నఁ గలి యెఱింగి నిన్నుఁ బొంది
యహివిషంబుచేత ననిశంబు దగ్ధుండ, నైతి నింక నాకు [1]నలుగ వలదు.

వ. నిన్నుం గీర్తించినజనంబులు నావలనిభయంబుఁ బొందరు నాకుం గరుణింపుమనిన

1. క. నై సహింపు

నలుండు గోపం బుడిగెఁ గలియు నవ్విభీతకవృక్షంబు నాశ్రయించె నది మొదలుగా విభీతకం బప్రశస్తం బయ్యె నట్లు నలుండు వికృతరూపమాత్రంబుదక్కఁ దక్కినదుష్కృతంబులవలన విముక్తుం డై రథం బెక్కి యతివేగంబున ఋతుపర్ణవార్ష్ణేయసహితుండై విదర్భకుం జనియె నంత నపరాహ్ణంబున. 180

క. మానుగ ఋతుపర్ణుఁడు భీ,మానుజ్ఞాతుఁ డయి చొచ్చె నాప్రోలు రథ
ధ్వానంబు మ్రోయుచుండఁగ, నానాదిఙ్ముఖములను ఘనధ్వనివోలెన్. 181

సీ. దమయంతి యారథధ్వని విని యిది నలు, రథఘోష మని యనురాగ మొంది
నలు నిషధేశుఁ బుణ్యశ్లోకు లోకోప, కారకుఁ జూడంగఁ గంటి ననుచు
ఘనభుజుఁ జూడంగఁ గాననినాఁడుఁ ద,ద్భుజపరిరంభణోద్భూతసుఖముఁ
బడయనినాఁడును బ్రాణముల్ విడుతు నే, నని తలంచుచుఁ గమలాయతాక్షి

ఆ. యా రథాధిరూఢుఁ డై వచ్చుఋతుపర్ణుఁ, జూచి యప్పు డధికశోకతప్త
యగుచు నుండె నంత నా ఋతుపర్ణుండు, భీముఁ గాన వచ్చెఁ బ్రియముతోడ.

వ. భీముండును వానిం బూజించి యొక్కరమ్యహర్మ్యంబున విడియించిన ఋతుపర్ణుం డప్పురంబున స్వయంవరం బనుశబ్దంబు మొదలుగా వినం గానక యాత్మగతంబున. 183

క. ధరణిఁ గలరాజు లిట యె,వ్వరు వచ్చినవారు లేరు వైదర్భి యొరుఁ
వరియింప నంతధర్మే,తరచరితయె యనుచు నుండెఁ దద్దయులజ్జన్. 184

వ. బాహుకుండును రథశాల రథాశ్వంబుల బంధించి రథసమీపంబున విశ్రమించి యుండె నంత దమయంతి బాహుకవార్ష్ణేయులతోడ వచ్చినఋతుపర్ణుం జూచి విఫలమనోరథ యై యుండ నోపక కేశిని యనుదానిం బిలిచి ఋతుపర్ణున యోధ్యాపతిం గా వార్ష్ణేయు సూతపుత్త్రుంగా నెఱింగితి బాహుకుం డనువాఁ

క. నలురథచోదకుఁ డతఁ డ,త్యలఘుఁడు వార్ష్ణేయనాముఁ డనవుడు వాఁ డ
న్నలభూపాలకుపోయిన, వల నొం డెఱుఁగునొకొ యనిన వాఁ డి ట్లనియెన్.

వ. వార్ష్ణేయుండును నలుపుత్త్రుల విదర్భేశ్వరునొద్దఁ బెట్టి పోయి నడుమ నలురాజ్య [1]భ్రంశంబు విని ఋతుపర్ణుం గొలిచి యుండె నాతండును నలు నెఱుంగఁడు.

క. నలుతో నొక్కట నరిగిన,నలినాయతనేత్ర భీమనందన యొండెన్
నలుఁ డొండె నెఱుఁగుఁగాక,న్నలు నొరులకు నెఱుఁగఁ గారణముగలదె మహిన్.

వ. అనిన విని కేశిని యిట్లనియె. 192

సీ. అడవిలో వస్త్రార్ధహారివై దయ లేక, ప్రాణేశ్వరుఁడు దనుఁ బాసి చనిన
నాఁటివస్త్రార్ధంబు నలినాక్షి యిప్పుడుఁ, బరిధానముగఁ బాంసుపటలమలిన
మగు చున్నతనువుతో నననయంబు జడగొన్న, యలకావలులతోడ నవనితలము
శయనంబు గా ధర్మచారిణి దమయంతి, యనఘవ్రతం బిట్టు లాచరించు

ఆ. చున్న దనిన నవిరళోద్గతబాష్పపూర్ణంబు లై నలోచనంబు లెఱుక
వడక యుండ వదనపద్మంబు వాంచితా, [2]నొండువలను సూచుచుండె నలుఁడు.

వ. కేశినియును బాహుకుబలుకులు నాకారంబునుదమయంతి కెఱింగించిన నది యాతని నలుం గా శంకించి యింకను వానికడ కేఁగుము వాఁడు ఋతుపర్ణువంటలవాఁడటె పచనసమయంబున వానిచరితం బిమ్ముగా నెఱింగి ర మ్మని పంచిన నప్పుడ చని కేశినియు బాహుకునందు దైవమానుషనిమిత్తాద్భుత క్రియలసూచి వచ్చి దమయంతి కి ట్లనియె. 194

—* కేశిని యనుదూతి దమయంతితో నలుగుణంబులు సెప్పుట. *—

క. అతనిచరితంబు సెప్పఁగ, నతిమానుష మపగత ప్రయాస మదృష్ట
శ్రుతపూర్వము పరమార్థము, యతనిని వే ల్వనఁగ వలయు నంబుజనేత్రా. 195

సీ. వినవమ్మ తృణముష్టిఁగొని వాఁడు వీచుడు, నం దగ్నియుదయించి యతనివంట
లమరునంతకు నింధనము లపేక్షింపక, యుడుగక మండుచు నుండు మఱియుఁ
గడఁకతో నంజుళ్లు గడుగంగ సమకట్టి, జల మపేక్షించుడు సంభవిల్లి
కుంభముల్ నిండి దివ్యాంభఃప్రవాహ మ,క్షయ మగుచుండుఁ దత్క్షణమ చూడ

ఆ. నతనికరతలద్వయీ[3]యామర్దితంబులై, కందియును మహాసుగంధకుసుమ
తతులు దొంటియట్ల తమకంపు విడువక, యుండు నతని తేజ మున్నతంబు.

వ. అనిన విని దమయంతి వెండియుఁ గేశినిం బంచి బాహుకువండిన నంజుళ్ళు దెప్పించి యాస్వాదించి బాహుకునందు నలులక్షణంబులు గలుగు టెఱింగియు నూఱడ నోపక వానిపాలికిఁ గొడుకునుం గూఁతునుం గేశినితోడం బుచ్చిన నక్కుమారులం జూచి. 197

1. క. భ్రష్టత్వంబు. 2. క. నొండుగడయుఁ జూచు. 3. ఖ. యామమర్దితను లై.

ఆ. వశముగాక బాష్పవారియొల్కుచునుండఁ, గొడుకుఁగూఁతు నెత్తికొనసలుండు హర్షపులకితంబు లయిననిజాంకంబు,లందు వారి నునిచి యాదరమున. 198

వ. అక్కేశినిం జూచి యిక్కుమారు లిద్దఱు నాకొడుకుం గూతునుం బోలిన వీరి నెత్తికొని దుఃఖించితి ననిత న్నేర్పడ కుండం బలికి దాని కి ట్లనియె. 199

క. నీ విట పలుమఱు వచ్చుచుఁ, బోవుచు నున్కి గని చిత్తములఁ నొండుగ సం భావింతు రితరజనములు, గావున రా వలవ దింకఁ గార్యార్థిని వై. 200

వ. ఏము దేశాంతరంబుననుండి వచ్చినయతిథులము నీకు మాతోడి దేమి యనినఁ గేశిని గ్రమ్మఱి వచ్చి బాహుకుమార్గం బంతయు దమయంతికినిఁజెప్పిన నది [1]సంతసించి నిజజనని కి ట్లనియె. 201

ఉ. సందియ మేల సర్వగుణసంపదఁ జూడఁగ బాహుకుండు భూ
వందితుఁ డైననైషధుఁ డవశ్యముఁ దా నగు నామనంబు నా
నందముఁ బొందు చున్నది ఘనంబుగఁ వాఁ డిట వచ్చువాఁడొ యే
నంపుల కేగుఁదాననొ [2]రయంబున నాతని నిశ్చయింపఁగన్. 202

వ. అనిన నది యప్పుడ భీమునసుమతంబున దమయంతియొద్దకు బాహుకు రావించిన

క. చనుదెంచి యందు దీనా,నన నవిరళపంకమలిన నతగాత్రఁ దప స్విని నతికృశ దమయంతిం, గనియె నలుం డుదితబాష్పకణకలితముఖున్. 204

క. దమయంతి నలునివికృతాం,గముఁ జూచియు నతని నన్యుఁగా వగవక నె య్యమునను లజ్జను [3]నతిసం,భ్రమమున వివశాత్మ యగుచుఁ బతి కి ట్లనియెన్.

వ. విజనం బైనవిపినంబునందు నలసి నిద్రపోయినదాని నబల నతిసాధ్వి ననువ్రత నగ్నిసన్నిధిఁ బాణిగ్రహణవిధిలబ్ధ యైనదానిం బాసి నలున ట్లొరులు నిర్దయులై యరిగినవారు లేరు. 206

క. సురవరుల నురివి తన్నుఁగ, వరియించిననన్నుఁ బుత్త్రవతి నేలొకో చె చ్చెర విడిచె నాతనికి నిష్కరుణుని కే నేమి యెగ్గు గావించితినో. 207

వ. నిన్ను విడువ నోడ కుండు మని పలికిన యప్పలుకు లేల మఱచెనో యని శోకతప్తం బైన తనహృదయంబు దడుపుచున్నదియునుంబోలె బాష్పధారలం గుచమండలంబు దడుపుచు నున్నదమయంతిం జూచి శోకాకులుం డై నలుం డి ట్లనియె.

తే. కలిసమావిష్టమతి నయి కష్టవృత్తి, నట్టియిడుమలఁ బడితి నే నవి మదీయ [4]తపముబలమున నీదుఃఖదాహమునను, నష్ట మైపోయెఁ గలియిప్డు నన్నువిడిచి.

వ. ఏ నిందులకు నీతదర్థంబ వచ్చితి నది యట్లుండె నన్ను ననురక్తునను వ్రతుఁ దలంపక యన్యాపేక్షం బునస్స్వయంవరంబు రచియించుట యిది కులస్త్రీధర్మంబు గాదు రాజుల నెల్ల నీస్వయంవరంబునకు రావించుటం జేసి కాదె ఋతుపర్ణుండు

1. గ. చింతించి. 2. నయంబున నాపని నిశ్చయింపుమా. 3. క. భయసం. 4. గ. తపఃఫలమున నీదుఃఖ[illegible]హానమునను, నష్టమైపోయె నిప్పుడు నన్ను విడిచి.

వచ్చె ననిన వెఱచి కృతాంజలి యై దమయంతి యిట్లనియె. 210

తే. నిన్ను రోయంగ విప్రులు నెమ్మినరిగి, పలికి రెల్లచో నాచేతఁ[1] బలుకఁబడియ
యందుఁబర్ణాదుఁ డను విప్రుఁ డయ్యయోధ్య, కేఁగి ప్రతివచనంబులు నెఱిఁ గెనిన్ను.

వ. ఆ పర్ణాదువలన నిన్నెఱింగినదాననై నిన్నిట రావించునుపాయంబు దలంచి యెల్లి
దమయంతీద్వితీయస్వయంవరం బగు నని ఋతుపర్ణునందుఁ బ్రకాశింప సుదేవుం
డనుబ్రాహ్మణుం బుత్తెంచితి. 212

క. నరవరుఁడు నలుఁడు గాకెవ్వరు శతయోజనము లొక్కవాసరమున వ
త్తురు నరు లోరు లని దీనిం, బరికింపఁగఁ గడఁగి యిట్లు పంచితి నధిపా. 213

ఉ. ఏ[2]నొకపాపభావమును నెద్దఁ దలంపక యుండునట్లుగా
నానతవైరి నీయడుగు లంటఁగ నోపుదు నట్టి దైన న
న్నీనలినాప్తుఁ డీ యనలుఁ డీమృగలాంఛనుఁ డీ సురోత్తముల్
జాను సెడంగ నీ క్షణమ చంపరె కోపపరీతచిత్తు లై. 214

వ. అను చున్నయవసరంబున నఖిలభూతాంతర్గతుఁ డయినవాయుభట్టారకుం డెల్ల
వారలు విన నాకాశంబుననుండి నలున కి ట్లనియె. 215

చ. అమల చరిత్ర నిట్లు దమయంతిఁ బతివ్రతఁ బల్కెదే నృపో
త్తమ విను దీనియందు విదితం బగుశీలవిధిన్ సుధాంశుఁడుం
గమలహితుండు నేను నయి కాచితి మొక్కట మూఁడువర్షముల్
గొమరుగ దీనిఁ జేకొనుము కోమలి నీ కనురక్త నావుడున్. 216

క. కురిసె మరుద్వచనానం, తరమున సురపుష్పవృష్టి దడయక వించెన్
సురదుందుభినాదంబులు, గరము ప్రసన్నుఁడయి వీచె గంధవహుండున్. 217

వ. ఇట్లెల్లవారికి నాశ్చర్యంబుగా వాయుదేవుండు దన్నెఱింగించి దమయంతి పతి
వ్రతాగుణంబులను బతియందుల యకృత్రిమానురాగంబునుం జెప్పిన విని న
లుండు పరమప్రమోదరసపరిపూర్ణహృదయుండై తత్క్షణంబ కర్కోటకుం దలంచి
వానియిచ్చినపట్టంబు పైఁ బెట్టుకొని నిజరూపంబు దాల్చిన. 218

—♦ నలుండు నిజరూపంబుతో దమయంతిం గూడుట. ♦—

ఉ. ఆయతబాహుఁ దప్తకనకాంచితవర్ణు మనోజరూపు నిం
ద్రాయితు సూర్యతేజు నిషధప్రభు నన్నలుఁ జూచి పద్మప
త్రాయతనేత్ర యప్డు దమయంతి గరంబు ముదంబు నొంది ల
క్ష్మీయుతయయ్యె బంధులకు మిత్రులకున్ హృదయప్రియంబుగన్. 218

వ. ఇట్లు సంగతులైనయయ్యిరువురకు విరహపరితాపంబుతోడన శరీరమలినత్వంబు
వాసెఁ బరస్పరానురాగంబుతోడన విభూషణవిశేషయోగంబులు విలసిల్లె నంత
నంతయు విని భీముండు జాతసస్యయైనవసుధ తోయసంప్రాప్తి నాప్యాయితయైన

1. జ. బనుపఁబడిన. 2. గ. జ. నతిపాపభావమున నెగ్గు.

ట్లజ్ఞాతచర్యం డైన తనపతింబడసి పరమసంతుష్టహృదయయై చంద్రుతోఁగూడిన రాత్రియుంబోలెఁ బతిం గూడి యొప్పు చున్నదమయంతిం జూచి సంతసిల్లి తన పురంబునం దష్టశోభనంబులు దేవగృహంబులయందు విశేషపూజలు సేయించె నట్టిమహోత్సవం బెఱింగి ఋతుపర్ణుండు నలునొద్దకువచ్చి నీవునిఖిలలోకపూజ్యుం డవయ్యును నాయొద్ద బాహుకుం డనంగాఁ బ్రచ్ఛన్నవృత్తినున్ననిన్ను నెఱుంగక నీచకర్మంబులందు నియోగించితి దీని క్షమియించునది యని నలుచేత సత్కృతుం డై యశ్వహృదయోపదేశంబు గొని యయోధ్యకుం జనియె నిట నలుండును విదర్భాపురంబున నొక్కమాసంబు నివాసంబు సేసి విదర్భేశ్వరు వీడ్కొని దమ యంతి నంద పెట్టి యొక్కరథంబును బదియా ఱేనుంగులును నేఁబదిగుఱ్ఱంబులును నాఱునూర్లు కాల్బలంబులుఁ దనకు దోడుగా నిషధపురంబున కరిగి పుష్కరుం గని యి ట్లనియె. 220

క. దమయంతి రోయిగా జూ,దము నీతో నాడఁ గడఁగెదను ధరణీరా
జ్యమునీవునాకు రో యిడు, మమరఁగ జూదంబునీకు నప్రియ మేనిన్. 221

మత్తకోకిలము. వీరభోజ్యము సుమ్ము [1]రాజ్యము వింటె నీవును నేను దు
ర్వారవృత్తి రథంబు లెక్క యశోవంధ్యవిక్రమ మేర్పడన్
భూరివీరరణం బొనర్తుము పోరనోర్చినవాఁడ యి
ద్ధారుణీతలరాజ్యసంపదఁ దాల్చు వీరగుణోన్నతిన్. 222

వ. ఈ రెంటిలోనీకెయ్యది యిష్టంబు దానిన కడంగు మనినం బుష్కరుండు రణంబు నందుఁ బరాజితుండు గావున నలుం దొల్లియు జూదంబున నోడిచినవాఁ డై యింకను నోడిచి దమయంతిం జేకొని కృతార్థుండ నగుదు నని సంతసిల్లి యే నోటువడితినేని నఖిలమహీరాజ్యంబు నీయది నీవోటువడితేని దమయంతి నాయది యని పలికి యొడ్డి నలుతో జూద మాడి యోటువడిన. 223

క. ఘనముగ జంబూద్వీపం, బునఁ గలవా రెల్ల నెఱుఁగఁ బుష్కరుచేతం
గొనియెఁ బునర్ద్యూతంబున, ననఘుఁడు నలుఁ డఖిలరాజ్య మత్యున్నతితోన్.

వ. ఇట్లు జూదంబునఁ బుష్కరు నోడిచి సకలమహీరాజ్యంబును జేకొని నలుండు వాని కి ట్లనియె. 225

క. కలిసంప్రాప్తుఁడ నై కడు, బల మఱి నీచేతఁదొల్లి బలవద్ద్యూత
చ్ఛలజితుఁడ నైతి నది నీ, బల మని గర్వింపవలదు బలవంతుఁడవై. 226

వ. నీవు నా పితృవ్యపుత్త్రుండవు ని న్నెద్దియుం జేయ నోడకు పొ మ్మని పుష్కరు విడిచిపుచ్చి పుష్కలం బైన రాజ్యంబుతో నలుం డున్నంత. 227

క. భీమప్రస్థాపిత యయి,కోమలి దమయంతి పుత్త్రికులుఁ దానును ల
క్ష్మీమహిమ వెలుఁగుచుండఁగఁ, దామరస దళాక్షి వచ్చెఁ దనపతికడకున్.

1. గ. ధారుణి.

వ. అట్లు దనమనోవల్లభ యైనదమయంతిం గూడి నలుండు విధి విహితానేకాచరిత మఖుండై శతమఖ విలాసంబుతో సకలరత్నయుతం బైన రత్నగర్భాధిరాజ్యంబు సేసెం గావున నక్షజితుండ నైతి నని వగవ వలదు నీవును దైవమానుషసంపన్నుండ వయి శత్రువుల జయించి సకలమహీసామ్రాజ్యంబు వడయుదు వని బృహదశ్వుండు ధర్మజునకు నక్షహృదయం బుపదేశించి. 229

సీ. ఇన్నలోపాఖ్యాన ♦ మెప్పుడు దత్త్వావ, ధానులై వినువారుఁ ♦ దవిలి సభలఁ
జదివెడువారును ♦ జగతీశ కలిదోష, నిర్ముక్తులగుదురు ♦ నిఖిలపుణ్య
ఫలభాగు లగుదురు ♦ బహుపుత్త్రపౌత్త్రాయు, రారోగ్యధనయుక్తులగుదు రెల్ల
విషములకును దుష్టవిషయంబులకు దూరు, లగుదురు ధర్మాత్ములగుదురుర్విఁ

ఆ. గడుఁ బ్రసిద్ధ మిదియుఁ ♦ గర్కోటకుని దమ, యంతిఁ బుణ్యమూర్తులైననలుని
నుతచరిత్రుఁడైనఋతుపర్ణుఁ గీర్తింపఁ గలిభయంబులెల్లఁ గ్రాఁగు నధిప. 230

—* ధర్మరాజునొద్దకు నారదమహాముని వచ్చుట. *—

వ. అని చెప్పి బృహదశ్వుం డరిగినం బాండవులు గాండీవరాకయు [1]కోరుచుఁ దదాలోకనప్రీతి నుండునంత నంతరిక్షం బెల్ల దనతేజంబున వెలుంగుచుండ నారదుండు వచ్చి యనుజసహితుం డైన ధర్మరాజుచేతం బూజితుండై యి ట్లనియె.

ఆ. ధర్మపుత్త్ర నీయుదారచరిత్రకు, ధర్మమతికిఁ దృప్తమతుఁడ నైతి
నడుగు మిష్ట మెద్ది ♦ యనినఁ గృతాంజలి, యై మహీశుఁ డిట్టు ♦ లనియె భక్తి.

వ. మునీంద్రా నీవు తృప్తుండ వైనం ద్రిజగంబులకుం దృప్తియగు నిన్నుం జూచి కృతార్థుండ నైతి నా కెప్పుడు నొక్కధర్మసందేహంబు గలదు దాని నిర్ణయించి యానతీ వలయు. 233

చ. ధరణిఁ బ్రదక్షిణంబుగ ముదంబునఁ గ్రుమ్మరి తీర్థసేవనా
పరు లగుచున్నధన్యులు శుభస్థితి నెట్టిఫలంబు నొందఁ గాం
తురు బహుతీర్థకీర్తనముతో నెఱిఁగింపుము దీని నావుడున్
నరవరుఁ డైనపార్థునకు ♦ నారదుఁ డి ట్లని చెప్పెఁ బ్రీతితోన్. 234

క. [2]ధీరుఁడు భీష్ముఁడు గంగా, ద్వారమునం దొల్లి పితృహితమ్ముగ శుభక
ర్మారంభుఁ డగుచు నుండె నుదారుం డధ్యయనసంతత వ్రతపరుఁ డై. 235

వ. అతని పితృదేవతాభక్తికిఁ బరమధర్మ చరితంబునకు మెచ్చి తద్దర్శనాపేక్షం బులస్త్యుం డనుమహాముని వచ్చిన నతిభక్తుండయి యాభీష్ముండమ్మునికిఁ గుశపీఠంబున నునిచి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి యతని యడుగులు తలనిడుకొని దక్షిణజానుస్పృష్టమహీతలుం డయి యేను భీష్ముండ భవద్దాసుండ నని ముకుళిత

1. చ. జ. కోరుచుండఁ దదాలోకనప్రీతి నంతరిక్షం. 2. ఈకందమునకుఁ బూర్వము, 'క. వినవయ్య నీవు నను వేఁడినప్రశ్నకు నుత్తరంబు ♦ డెందంబలరన్, వినిపింతు నీకు నభిమత, మనఘా నే జేయువాఁడ♦నధిక ప్రీతిన్." అని యచ్చుప్రతి జూపట్టెడిని గాని వ్రాఁతప్రతులఁ గానిపించదు.

హృష్టుం డయి యున్న వానికిఁ బులస్త్యుం డి ట్లనియె. 236

క. పితృదేవభక్తిఁ బుణ్య, వ్రతచర్యను నీవ యెల్లవారికి నత్యు
న్నతుఁడవు గావున నీచే, ధృతిఁ గానఁగఁబడితి నేఁ బ్రదీపకుతేజా. 237

వ. నీయిష్టంబు సెప్పు మే నమోఘదర్శనుండ ననిన భీష్ముండు ముదితహృదయుండై
మునీంద్రా నాయందు నీకుఁ బ్రసాదబుద్ధి గలదేనిఁ జెప్పు మనిన. 238

క. మనుజేంద్ర నన్ను నీ యడిగినయట్ల పులస్త్యుఁ బుణ్యకీర్తను గంగా
తనయుం డడిగిన నతనికి, ననఘచరిత్రునకు నిట్టు లని ముని సెప్పెన్. 239

సీ. కడఁగి బుద్ధీంద్రియకర్మేంద్రియంబుల, యందు సంయతచిత్తు లైనవారు
ధృతి నహంకార ప్రతిగ్రహాపేక్షల, యందు [1]నివృత్తాత్ము లైనవారు
నల్పభోజనులు ననారంభకులు నయ్యు, నత్యంతసంతోషు లైనవారు
సత్యవ్రతులు శుభాచారు లక్రోధను, లగుచు ధర్మాన్వితు లైనవారు

ఆ. నఖిలతీర్థశతము లాడినఫలములు, నఖిలయజ్ఞవిధుల నైనఫలముఁ
బడయుదురు విహీనభాగ్య[2]దుష్కృతులకుఁ, బరమతీర్థసేవఁ బడయనగునె.

క. తిల గో సువర్ణదానం,బులు నుపవాసములుఁ దీర్థములసేవయు ని
మ్మలఁ జేయనివారు దరిద్రులు నిరతము నగుదు రాత్మదోషముపేర్మిన్. 241

క. క్రతుఫలములు వడయఁగ దుర్గతులకు దొరకొనదు తీర్థగమనంబునఁ ద
త్క్రతుఫలము లందుదురు దుర్గతులును నిది మునులమతము గౌరవవృషభా.

వ. [3]తీర్థగమనఫలంబు యజ్ఞఫలంబులకు విశేషంబు వినుము. 243

చ. నమితవిరోధి పుష్కర మనంగ జగద్విదితంబు పుణ్యతీ
ర్థము మునిసిద్ధసేవ్యము ముదంబున నందుఁ బయోజసంభవుం
డమరులతోడ సన్నిహితుఁ డై వసియించుఁ ద్రిపుష్కరంబులున్
సమములు వాని నెప్పుడును [4]సంస్మృతి సేసినఁ బాయుఁ బాపముల్. 244

క. పదివేలకోట్లతీర్థము, లుదితము లై పుష్కరముల నుండు మునీంద్ర
త్రిదశవరు లందుఁ జేసిరి, మదిఁ గృతకృత్యులయి తపము మఖములు బ్రీతిన్.

వ. అందుఁ గృతస్నాను లై దేవర్షిపితృతర్పణంబులు సేసినవారు దశాశ్వమేధఫలం
బులు వడయుదురు కార్తికమాసంబున నొక్కదివసంబు పుష్కరసేవ సేయుట
యు నొకయేఁ డగ్నిహోత్రంబు వేల్చుటయు సమంబు. 246

క. అమరవరులందుఁ బురుషో, త్తముఁ డెట్లు విశేషుఁ డట్ల ధరణిం గల తీ
ర్థములందుఁ బుష్కర త్రితయము గరము విశేష మభిమతార్థప్రద మై. 247

వ. పుష్కరంబునఁ బదియేండ్లు వసియించినవారికి సర్వక్రతుఫలంబును బ్రహ్మలోక
ప్రాప్తియు నగు మఱియు జంబూమార్గంబుఁ దండూలికాశ్రమం బగస్త్యసరం

1. జ. నప్రీతాత్ము 2. గ. దుఃఖితులకు. 3. క. తీర్థగమనంబు పుణ్యంబులకు విశేషంబు. 4. గ. సన్నుతి; జ. సంస్తుతి.

బనుతీర్థంబులాడియశ్వమేధఫలంబు వడయుదురు కణ్వాశ్రమంబును ధర్మారణ్యంబును యయాతిపతనంబును జూచిన సర్వపాపక్షయం బగు మహాకాళంబును గోటితీర్థంబును నశ్వమేధఫలప్రదంబులు రుద్రవటం బనురుద్రస్థానంబున రుద్రుం బూజ సేసి గణపతిత్వంబు వడయుదురు నర్మదాస్నానంబు దక్షిణసింధుస్నానంబునఁ జర్మణ్వతీతీర్థస్నానంబున నగ్నిష్టోమఫలంబు లగు. 248

క. అనవద్య వసిష్ఠాశ్రమ,మున నొకదివసంబు శాకఫలమూలాశను లై
జను లుండి పడయుదురు బహు,ధనసంపద గోసహస్రదానఫలంబుల్. 249

వ. మఱి పింగళం బనుతీర్థంబు సేవించి శతకపిలగోదానఫలంబు వడయుదు రెందేని నగ్నిదేవుండు ప్రత్యక్షుండై యుండు నట్టిప్రభాసతీర్థం బాడి యగ్నిష్టోమాతిరాత్రఫలంబు వడయుదురు దుర్వాసునకు విష్ణుదేవుండు వరం బిచ్చుటంజేసివరదానం బనం బరఁగిన తీర్థం బాడియు సరస్వతీసాగరసంగమం బాడియు గోసహస్రదానఫలంబు వడయుదురు. 250

క. ద్వారవతీపురమునఁ[1]బిం,డారక మనుతీర్థమున బ్రొడం గై ముద్రా
కారంబు లై త్రిశూలా,కారము లై పంకజములు గానంగఁబడున్. 251

వ. అందుఁ బరమేశ్వరుం బూజించి పాపవిముక్తు లగుదురు సాగరసింధుసంగమస్నాతు లైనవారు నాకలోకగతు లగుదురు శంకుకర్ణేశ్వరంబున నీశ్వరుం బూజించి దశాశ్వమేధ ఫల ప్రాప్తులగుదురువసుద్వారంబును వసుసరంబు నను తీర్థంబులాడి వసుప్రాప్తు లగుదురు సింధూత్తమస్నానంబున బహుసువర్ణదానఫలంబగు బ్రహ్మతుంగసేవనంబున బ్రహ్మలోకప్రాప్తి యగు శక్రకుమారీవిలోకనంబున శక్రలోకగతి యగు శ్రీకుంజరంబునం బితామహునకు నమస్కరించియు సౌవర్ణ రాజతంబు లైనమత్స్యంబులు గల[2]విమలం బనుతీర్థం బాడియు వాసవసాయుజ్యంబు వడయుదురు మలహారం బను తీర్థంబున నగ్నిదేవునకు నర్ఘ్యం బిచ్చిన నది యక్షయం బై పితృదేవతలకుఁ దృప్తిఁ జేయు గోసహస్రదానంబునకు నశ్వమేధసహస్రంబునకు విశేషంబు. 252

క. దేవిక యనుతీర్థంబున, దేవసమూహంబుతోడఁ ద్రిణయనుఁ డుండుఁ గా
సేవిత మై జనులకు నది, గావించు ననూనధర్మకామార్థంబుల్. 353

వ. అర్ధయోజనవిస్తృతంబై పంచయోజనాయామం బై నయద్దేవికానదియును గామాఖ్యంబును రుద్రతీర్థంబును యజనయాజనబ్రహ్మవాలుకంబులును బ్రహ్మాదిదేవతలదీర్ఘసత్త్రస్థానం బై నదీర్ఘసత్త్రస్థానంబును సేవించినవారికి నిష్టసిద్ధి యగు వినశనం బనుతీర్థంబున నదృశ్యంబై మేరువునకుం బోవునెడ నాగోద్భేదశివోద్భేదచమసోద్భేదంబుల నెందేని సరస్వతిగానంబడియె నట్టిసరస్వతియందు నభిషిక్తులైనవారు నాగలోకంబు వడయుదురు [3]శశరూపపుష్కరంబులు గలశశయానంబను

1. క. బ్రం. దారక...ముత్రధంబున. 2. క. గ. కపిలం. 3. క. రసరూప—రసపానం బను.

తీర్థంబునను స్నానంబు గోసహస్రదానంబును సమంబు. 254

మధ్యాక్కర. ఏ మేము మున్ను పూజింపుదుము రుద్రు ♦ నిం దని వేడ్క
తో మునికోటి దా రున్న నీశుఁ డంక్రదోలుకును బ్రీతి
గా మతిలోఁ గోటిరుద్రరూపముల్ ♦ గావించె నదియు
భూమిఁ బ్రసిద్ధమై రుద్రకోటి నాఁ ♦ బొలిచి వెలింగె. 255

వ. అందు రుద్రుఁ బూజ సేసి రుద్రలోకప్రాప్తు లగుదురు. 256

క. నరనుత నైమిశమునఁ బుష్కరముల మూఁటను జగత్ప్రకాశిత మై యి
ద్ధరణిఁ గురుక్షేత్రము దు, స్తరదురితౌఘముల కెల్ల ♦ ద వ్వగు చుండున్. 257

తే. అమరలోకనివాసుల ♦ యంద్రు విబుధు,లా కురుక్షేత్రవాసుల♦నదియు వినఁగ
ను త్తమంబు దృషద్వతి ♦ యు త్తరమునఁ, దపనతేజ సరస్వతీ ♦ దక్షిణమున. 258

వ. అక్కురుక్షేత్రశమంతపంచకంబులనడుమ రామహ్రదంబునడుమఁ బితామహు
ను త్తరవేది యనంబడు నట్టికురుక్షేత్రంబు మెట్టినవారికిఁ గురుక్షేత్రంబునకుం
బోయెద మనినవారికిఁ గురుక్షేత్రంబున వసియించెద మని తలంచినవారికి సర్వ
పాపక్షయం బగుఁ దదనంతరంబున విష్ణుస్థానంబున విష్ణువు నర్చించిన నశ్వమేధ
ఫలం బగుఁ బారిప్లవం బను తీర్థ మాడి యగ్నిష్టోమఫలంబు వడయుదురు పృథివీ
తీర్థం బాడిన గోసహస్రదానఫలం బగు శాలూకిని యనుతీర్థం బాడిన దశాశ్వమే
ధం బాడిన గోసహస్రదానఫలంబ యగు సర్పితీర్థం బాడి యందుఁ దరంతకుండను
ద్వారపాలకునిం జూచినవారి కిష్టసిద్ధి యగు నెందేని విష్ణుం డాదివరాహం బయ్యె
నట్టివరాహతీర్థం బాడినవారికి నగ్నిష్టోమఫలం బగు నశ్వినీతీర్థం బాడిన రూప
వంతులగుదురు జయంతియందు సోమతీర్థస్నానంబును కృతశౌచతీర్థస్నానంబును
రాజసూయపౌండరీకసమంబు లగ్నిపటంబున [1]ముంజవటంబున నీశ్వరుం బూజిం
చి గాణపత్యంబు వడయుదురు (యక్షిణీతీర్థ మాడి యిష్టఫలంబులు వడయుదు
రు) కురుక్షేత్రద్వారంబుఁ బ్రదక్షిణంబు సేసినం బాపక్షయం బగు. 259

క. వీరుండ క్షత్త్రియులఁ దన, దారుణపరశువున జామదగ్న్యుఁడు రౌద్రా
కారుఁడు వధియించి తదీ,యారుణమున నేనుమడుపు♦ లాపాదించెన్. 260

వ. అందుఁ బితృతర్పణంబు సేసినం బితృదేవత లాతనికిం బ్రత్యక్షం బయి నీ కిష్టం
బైనవరంబు వేఁడు మనినఁ బరశురాముండు వారల కి ట్లనియె. 261

తే. క్షత్రవధ నైనపాపంబుఁ ♦ గ్రాఁగవలయుఁ, గడఁగి నాకును సద్గతి ♦ గలుగవలయు
నివియుఁ బుణ్యతీర్థంబులై ♦ యిద్ధరిత్రిఁ, బరగుచుండంగవలయు మీ♦కరుణఁ జేసి.

వ. అని పితృదేవతల వరంబునం బుణ్యతీర్థంబులఁ జేసె నట్టిరామహ్రదంబు లాడిన
వారికి నశ్వమేధఫలం బగుఁ గాయశౌచం బనుతీర్థం బాడి కాయశుద్ధు లగుదురెం

1. క. (బంచవటంబున...యిష్టవరంబులు వడయుదురు.

దేని విష్ణుదేవుండు లోకంబుల నుద్ధరించె నట్టిలోకోద్ధారం బనుతీర్థం బాడి కులం
బుద్ధరింతురు శ్రీతీర్థం బాడి శ్రీమంతు లగుదురు కపిలాతీర్థం బాడి కపిలగోస
హస్రదానఫలంబుఁ బడయుదురు సూర్యతీర్థం బాడి యుం దుపవసించిన సూర్య
లోకప్రాప్తు లగుదురు గోభవనం బనుతీర్థం బాడి గోసహస్రసమృద్ధు లగుదురు
[1]శంఖినీతీర్థం బాడి యుత్తమరూపంబు వడయుదురు యక్షేంద్రతీర్థం బాడి తరండ
కుం డను ద్వారపాలకుం జూచినవారును సరస్వతీస్నాతు లైనవారును నగ్నిష్టోమ
ఫలంబు వడయుదురు మాతృతీర్థదర్శనంబునఁ బ్రజాప్రవృద్ధి యగు బ్రహ్మావర్తం
బును శరవణంబునుం జూచిన సర్వవ్యాధివిముక్తు లగుదురు (శ్వావిల్లో) మాప
హం బనుతీర్థంబునం దేకాదశతీర్థంబులు గల వందుఁ బ్రాణాయామంబు సేసిన
విప్రులకు స్వలోమాపనయనం బగు నెఱుకుచేత నేయంబడి కృష్ణమృగంబు లెం
దేని నొక్కతీర్థంబు సొచ్చి మానుషత్వంబు వడసె నట్టిమానుషతీర్థం బాడి సర్వ
దురితవిముక్తులై దేవత్వంబు వడయుదురు దానితూర్పున నొక్కయిరవున నాపగ
యనుమహానదిం బితృతర్పణంబు సేసి పితృదేవోద్దేశంబున నొక్కబ్రాహ్మణు
నకుం గుడువం బెట్టినఁ గోటిబ్రాహ్మణులు గుడిచినఫలం బగుఁ బితృదేవతలు
దృప్తియు నొందుదురు బ్రహ్మోదుంబరంబు సప్తర్షికుండంబుఁ గేదారంబునుం
జూచి బ్రహ్మలోకంబు వడయుదురు కపిలకేదారంబుఁ జూచి పాపవిముక్తులై
యదృశ్యు లగుదురు నరకం బనుతీర్థంబాడి కృష్ణచతుర్దశినాఁ డీశ్వరుం బూజించి
యెల్లకోర్కులం బడయుదురు మూఁడుకోట్లకూపహ్రదంబులు గల యిలాస్పదం
బనుతీర్థం బాడి పితృతర్పణంబులు సేసినవారికి వాజపేయఫలం బగుఁ గిందాన
కింజప్యంబు లనుతీర్థంబులందుఁ జేసినదానజపంబు లక్షయుంబు లగు నారదతీర్థం
బైనయంబాజన్మంబునందుఁ బ్రాణత్యాగంబు సేసినవారు సర్వలోకంబులం బడ
యుదురు శుక్లదశమిం బుండరీకం బనుతీర్థం బాడి పౌండరీకఫలంబు వడయుదు
రందు వైతరణీస్నాతు లై రుద్రునకు నమస్కరించి సర్వపాపవిముక్తు లగుదు
రెందేని దేవతల నేకసహస్ర వర్షంబులు దపంబు సేసి రట్టిఫలకీవనంబనుతీర్థం బాడి
యగ్నిష్టోమాతిరాత్రఫలంబులు వడయుదురు ద్వైపాయనుం డనేకతీర్థంబులు
మిశ్రీకరించుటం జేసి మిశ్రకం బనం బరఁగినతీర్థం బాడినవారికి సర్వతీర్థస్నాన
ఫలం బగు వ్యాసవనంబును మనోజవంబును మధువటియు ననుదీర్థంబుల నాడిన
గోసహస్రదానఫలంబు వడయుదురు కౌశికీదృషద్వతీసంగమంబున స్నాతు లై
సర్వపాపవిముక్తు లగుదురు కిందత్తంబునఁ దిల ప్రస్థదానంబు సేసి పితరులఋణం
బు నీఁగుదు రహస్సుదినతీర్థంబుల నాడి సూర్యలోక ప్రాప్తులగుదురు మృగధూ
మంబున గంగాస్నాతులై మహాదేవు నర్చించినమహాత్ము లశ్వమేధఫలంబు వడ
యుదురు వామనం బనుతీర్థం బాడి వామను నర్చించిన వారు విష్ణులోకప్రాప్తు-

1. క. శంఖినీతలద్వారంబున సరకాంతకుం డనుద్వార.

లగుదురు కులంపునం బనుతీర్థం బాడి కులంబు పవిత్రంబు సేయుదురు శ్రీకుంజంబున సరస్వతీస్నాతు లై యగ్నిష్టోమఫలంబు వడయుదురు ఋషు లెందే నుండి యాత్రాపరు లై కురుక్షేత్రంబునకుం బోదు రట్టినైమిశకుంజం బాడి ఋషితృప్తి సేయుదురు బ్రహ్మతీర్థం బాడి వర్ణాంతరులు బ్రాహ్మణు లగుదురు బ్రాహ్మణులు బ్రహ్మలోకప్రాప్తు లగుదురు. 263

సీ. అనఘుఁడు మంకణుం డనునొక్కబ్రహ్మర్షి, తనచేయి వ్రయ్యంగ దర్భఁ గోనిన
సాంద్ర మై శాకరసం బందు నిర్గతం, బగుడును హర్షించి యాడుచున్న
జూచి సహింపక సురలును మునులును, హరుపాలి కరిగి దేవాదిదేవ
మునినృత్త మేవిధంబున నివృత్తం బగు, నట్లుగాఁ జేయు మీ వనిన హరుఁడు

ఆ. దపసిరూప మొప్ప ధరియించి యమ్మునికడకు వచ్చి యేమికారణమున
నాడె దేమివిస్మయం బింపుఁ జూచితి, చెప్ప నుచితమేనిఁ జెప్పు మనిన. 264

వ. నాకరంబున శాకరసంబు వెలువడిన విస్మితుండ నయి హర్షించి యాడెదననిననిది యేమివిస్మయంబు దీనిం జూడు మని హరుండు తనయంగుష్ఠంబున నంగుళీతాడనంబు చేసిన నందు హిమసన్నిభం బయినభస్మంబు వెలువడినం జూచి లజ్జితుండు నీవు పరమేశ్వరుండ వని నమస్కరించి వేదమంత్రంబులస్తుతియించి దేవా నీ ప్రసాదంబున నాకు దపోవర్ధనంబు గావలయు ననిన నమ్మునివరునకు నీశ్వరుండు గరుణించి నీకుఁ దపోవర్ధన మగు నేను నీయాశ్రమంబున నుండుదు ననియె నట్టిసప్తసారస్వతతీర్థంబులాడినవారికిసారస్వతసిద్ధియగుబ్రహ్మాదిదేవతలచే నధిష్ఠితంబు లయినయౌశనసతీర్థంబును గపాలమోచనంబు విశ్వామిత్రంబుఁ గార్తికేయంబు ననియెడుతీర్థంబుల నాడి పాపవిముక్తు లయి బ్రహ్మలోకంబు వడయుదురు. 265

క. వేదములయందు వినఁగఁ బృ, థూదకతీర్థంబ యుత్తమోత్తమము సురేం
ద్రాదిసురవరులకును వ్యా, సాదిమహాయోగివరుల కాస్పద మగుటన్. 266

వ. అందు శరీరత్యాగంబు సేసినవారు పాపవిముక్తు లగుదురు సుకన్యాసరస్వతీసంగమస్నాతు లయినవారుబ్రహ్మహత్యాదిపాతకంబులవలనఁ బాయుదురు దర్భినిర్మితం బయిన యర్ధకిలతీర్థంబాడినశూద్రులు బ్రాహ్మణులగుదురుబ్రాహ్మణులుపరమసిద్ధు లగుదురు శతంబును సహస్రంబు ననుతీర్థంబులందుఁ జేసిన జపదానోపవాసంబులు శతసహస్రగుణంబు లగు వేల్పు లెల్లం గుమారు సేనాపతిం గా నెందే నభిషేకించి రట్టితైజసం బనుతీర్థంబును దానితూర్పుననుండు కురుతీర్థంబును స్వర్గద్వారం బనుతీర్థంబును జూచినవారికి స్వర్గద్వారంబు వివృతం బగు రుద్రపత్నియనుతీర్థంబున శంకరనారాయణుల నర్చించి సర్వదుఃఖవిముక్తులగుదురు స్వస్తిపురంబుఁ బ్రదక్షిణంబుసేసి గోసహస్రదానఫలంబు వడయుదురు గంగమడువున నొక్కకూపంబున మూఁడుకోట్లతీర్థంబులు సన్నిహితంబు లయి యుండు నందుఁ

కృతస్నాను లయినవారికి సర్వతీర్థస్నానఫలం బగు బదరీవనంబునందు వసిష్ఠాశ్ర
మంబునం ద్విరాత్రంబులు బదరీఫలభక్షణంబు సేసి పాపవిముక్తు లగుదు రేక
రాత్రం బనుతీర్థంబున నేకరాత్రోపవాసంబు సేసి బ్రహ్మలోకంబు వడయుదు
రాదిత్యాశ్రమం బనువనంబున నాదిత్యుం బూజించి యాదిత్యలోకగతు లగుదురు
దధీచతీర్థంబునం గన్యాశ్రమంబునందుఁ ద్విరాత్రంబు వసియించినవారికి స్వర్గ
ఫలం బగు. 267

క. జలరుహసంభవుఁ డాదిగఁ, గలవేల్పులు ఋషులు సిద్ధగరుడోరగులున్
నెల నెల సేవింతురు భూ,తలమున సన్నిహితి యనఁగఁ దగుతీర్థంబున్. 268

వ. సూర్యగ్రహణంబున దాని నాడినవారు శతాశ్వమేధఫలంబు వడయుదురు
ధర్ముండు దపంబు సేసిన ధర్మతీర్థం బాడి ధర్మశీలు రగుదురు జ్ఞానపావనంబును
సౌగంధికంబు ననుతీర్థంబుల నాడినం జూచిన సర్వపాపవిముక్తు లగుదురు దేవ
శ్రవ యనుసరస్వతీహ్రదంబునందు వల్మీకంబున వెలువడు జలధారలాడి పితృతర్ప
ణంబు సేసినవా రశ్వమేధఫలంబు వడయుదురు సుగంధయు శతకుంభయుఁ బంచ
యక్షయుఁ ద్రిశూలఖాతయు ననుతీర్థంబు లాడి దుర్గతులవలనం బాయుదురు
తొల్లి పార్వతి యెందేని శాకాహారిణి యై దివ్యసహస్రవర్షంబులు తపంబు సేసె
నట్టి శాకంభరీతీర్థం బాడి యొక్కదివసంబు శాకాహారులయినవారు పండ్రెండేండ్లు
శాకాహారతపంబు సలిపినవారిఫలంబు వడయుదురు సువర్ణాఖ్యం బనుతీర్థంబున
రుద్రుం బూజించి రుద్రలోకగతు లగుదురు ధూమావతి యనుతీర్థంబును రథా
వర్తం బనుతీర్థంబును ధారయనుతీర్థంబు నాడి శోకవిముక్తులగుదురు. 269

క. ధారుణిలోనను స్వర్గ, ద్వారం బయి ఋషినిషేవితం బగుగంగా
ద్వారం బాడినధన్యులఁ, జేరును శతకోటితీర్థసేవాఫలముల్. 270

వ. మఱియు సప్తగంగాసంగమంబును ద్విగంగాసంగమంబును శక్రావర్తంబును గనఁ
ఖలంబును గంగాసరస్వతీసంగమంబు నాదిగాఁ గలపుణ్యతీర్థంబుల నాడి పుణ్య
లోకంబులు వడయుదురు భద్రకర్ణేశ్వరంబున రుద్రపూజయు నరుంధతీవటంబు
సింధుప్రభవంబును యమునాప్రభవంబు ననుపుణ్యతీర్థంబులసేవయు సర్వసిద్ధికరం
బులు వేదిక యనుతీర్థంబు ఋషికుల్య యనుతీర్థంబును గృత్తికామఘతీర్థం
బులును విద్యాతీర్థంబును వేతసిక యనుతీర్థంబును జూచి దురితంబులవలనం
దొలంగుదురు బ్రహ్మతీర్థంబాడి పద్మవర్ణయానంబుల బ్రహ్మలోకగతులగుదురు.

చ. సురుచిరకీర్తి నైమిశముఁ జూచినమాత్రన పాయుఁ బాప మ
[1]చ్చెరువుగ నందు మాసము వసించి యనంతఫలంబు లొందఁ గాం
తురు బహుతీర్థసేవనముతోడ సమానము నైమిశంబు నం
దరుదుగ నొక్కనాఁడు శుచి యై యుపవాసము సేయఁ గాంచినన్. 272

వ. మఱియుఁ గంగోద్భేదతీర్థంబు నిందీవరతీర్థంబు గంగాద్వారంబు దిశాపతితీర్థంబు

లనియెడుతీర్థంబుల నాడి వాజపేయఫలంబుఁ బడయుదురు బాహుద యనుతీర్థం
బాడిన ననేకసత్రయాగఫలం బగు నెందేని రాముండు స్వర్గగతుం డయ్యె నట్టి
సరయూప్రదేశంబున గోప్రతారం బాడియు దేవతలకు ఋషులకు యజ్ఞభూమి
యయినతీరంబులు గలగోమతి నాడియు నశ్వమేధఫలంబు వడయుదురు కోటితీర్థ
బునం గుమారు నర్చించియు వారణాసియందు రుద్రు నర్చించియుఁ గపిలాహ్రదం
బాడియు రాజసూయఫలప్రాప్తు లగుదురు మార్కండేయతీర్థం బయినగంగా
గోమతీసంగమం బాడియు బ్రహ్మకల్పితం బయినయూపంబుఁ బ్రదక్షిణంబు
సేసియు వాజపేయఫలంబు వడయుదురు. 273

సీ. పలువురఁ గొడుకులఁ బడయంగవలయు నం, దొక్కరుం డయినను నోపి గయకు
నరుగునో యనియును నశ్వమేధం బొప్పఁ, జేయునో యనియు నశ్వేత మైన
యాఁబోతు విడుచునో యనియును గోరుదు, రనపత్యు లైనగృహస్థు లట్టి
గయ కేఁగి యుభయపక్షములు వసించినఁ, గడుఁబుణ్యు లుభయపక్షములవారి

ఆ. నుద్ధరింతు రట్టి యెుగిఁ బిండ మిడినవా, రనఘ పితృదయను గృతార్థులగుదు
రంచు ఫల్గుతీర్థ మాడినవారికిఁ, బరమసిద్ధితో శుభంబు పెరుగు. 274

వ. మఱి యక్షిణీతీర్థంబునందు జలపానంబు సేసి బ్రహ్మహత్యాదిదోషవిముక్తు లగు
దురు మణినాగం బనుతీర్థం బాడినవారికి నాశీవిషవిషంబు లొందవు గౌతమ
వనంబునం దహల్యాహ్రదం బాడి యుదపానం బనుతీర్థం బాడియు నశ్వమేధ
ఫలంబుఁ బడయుదురు రాజర్షి జనకకూపంబాడి విష్ణులోకప్రాప్తు లగుదురు కంప
నయు మహానదియు ననుతీర్థంబుల నాడినవారు పౌండరీకఫలంబు నొందుదురు
దేవపుష్కరిణిని మహేశ్వరధారను మహేశ్వరపదంబున నాడిన నశ్వమేధ
ఫలంబు వడయుదురు తొల్లి కూర్మరూపుం డయినయసురచేతం గోటితీర్థంబు
లపహృతంబు లయిన వానిఁ దెచ్చి విష్ణుం డెందేని నిలిపె నట్టి మహేశ్వరపథం
బనుతీర్థం బాడియు విష్ణుస్థానం బయినసాలగ్రామం బనుతీర్థంబాడివిష్ణునర్చించియు
నందుసన్నిహితచతుస్సముద్రం బయినకూపంబు నాడియు విష్ణులోకగతు లగు
దురు భరతాశ్రమంబునఁ జంపకారణ్యమున దేవీసహితు నీశ్వరుం బూజించి
మిత్రావరుణలోకంబు వడయుదురు కన్యాసంబోధ్యం బనుతీర్థంబునఁ గన్యాదా
నంబు సేసి యక్షయఫలప్రాప్తులగుదురు దేవకూటం బనుతీర్థం బాడి బ్రహ్మలో
కంబుఁ బడయుదు రెందేని విశ్వామిత్రుండు సిద్ధిం బొందె నట్టికౌశికహ్రదం
బాడియుఁగుమారవీరాశ్రమంబున నొక్కమాసంబు వసియించియు నశ్వమేధ
ఫలంబు వడయుదు రగ్నిధారయుఁ బితామహసరంబునంబుట్టినకుమారధారయు
నాడి త్రిరాత్రోపవాసంబు సేసినవారు బ్రహ్మహత్యాదిదోషవిముక్తు లగుదురు
గౌరీశిఖరకుండం బాడిన నందిసీకూపం బాడిన నశ్వమేధఫలం బగుఁ గాళికా
కౌశికాసంగమంబునందుఁ ద్రిరాత్రోపవాసంబు సేసినవారు సర్వపాపవిముక్తు

బుద్ధి నింద్రాచార్యుఁ బురడించు శూరత, వాసవుఁ దాలిమి వసుధఁ బోలుఁ
గాంతిఁ జంద్రున కెనగాఁ దగు రూపున, నాశ్వినేయుః సరి యనఁ దలిర్చుఁ
ఆ. దపము శమము దమము దానంబు బ్రాహ్మణ, భక్తియును మహాప్రభావతయును
నతనియందకాని యన్యులయందు లే, వింత నిక్కువము మహీతలేశ. 180

వ. వానియందుఁ గీడు నొక్కటియుఁ గలదు [1]నేఁడు మొదలుగా నొక్కసంవత్సరంబునకు మృతిం బొందు నిది నీకుఁ జెప్పవలయుటం జేసి చెప్పితి ననిన నతండు గూఁతు మొగంబు సూచి తల్లీ యిమ్మహాత్ముండు దేవరహస్యంబు లెఱుంగు నీతని వచనం బమోఘంబు నీకు నట్టివరుం డేల యొండొక్కవరుని వెదకికొ మ్మనిన నక్కన్నియ దండ్రి కి ట్లనియె. 181

క. వినుము మనోవాక్కాయము, లను మూఁడు దెఱంగు లందు నంతఃకరణం
బనఘ ప్రధానము గావున, మనమునఁ గైకొన్న భర్త మానం దగునే. 182

వ. సత్యవంతుం డెట్టివాఁడైన నగుం గాని యే నింక నొరుల వరియింప నొల్ల ననిన నశ్వపతి నారదు దెసఁ జూచుటయు నతం డి ట్లనియె. 183

చ. గొనములపోక్రిక నీయనుఁగుఁగూఁతురు దీనితలంపు మాన్పఁగా
మనకు నశక్య మింక ననుమానము లేల నరేంద్ర యింతిఁ జ
య్యన నృపసూతి కిమ్ము కమలానన చేసినపుణ్యగౌరవం
బున నయినం బ్రియుండు పరిపూర్ణ చిరాయురుపేతుఁ డయ్యెడున్. 184

వ. అనిన నమ్మహీపతి యమ్మునిపతికి మ్రొక్కి నీవు మాకుం బరమగురుండవు నీయానతిచ్చినట్ల చేసెద ననిన నారదుండు వారిని దీవించి దివంబునకుం జనియె నంత.

సీ. అమరఁ బుణ్యదినంబునందు బాంధవమంత్రి,వృద్ధపురోహితవితతితోడ
సావిత్రిఁ దోడ్కొని జననాయకుండు వై,వాహికమహనీయవస్తుకోటి
గొనుచుఁ బుణ్యారణ్యగోచరుండై తప,స్వినతుఁ డైనయాద్యుమత్సేనుకడకుఁ
జనిన నారాజును సంభ్రమంబున నశ్వ,పతికి నర్ఘ్యాదిసంభావనంబు
ఆ. లాచరించి సముచితాభిమతాలాప
పూర్వకముగ సుజనపూజ్యుఁ డతని
యాగమననిమిత్త మడిగిన మద్రేశుఁ
డెలమి సాళ్వపతికి నిట్టు లనియె. 186

క. ఈకన్నియ నాకూఁతురు, మాకులమున కెల్లఁ దేప మనుజోత్తమ నీ
పీకన్నియఁ గోడలుగాఁ, గైకొనుము మదీయవచనగౌరవబుద్ధిన్. 187

వ. అని పలికి సావిత్రి నతనికి నభివందనంబు సేయించి మఱియు నతండు. 188

క. నీకొడుకు సత్యవంతున, కీకన్నియ దగు నరేంద్ర యీకన్నియకున్
నీకొడుకు దగు ననన్యగు,ణాకరు లియ్యిరువురు నుపమంచితమూర్తుల్. 189

1. అ. పరిణయంబు మొదలుగా.

వ. అనిన నతనికి ద్యుమత్సేనుం డి ట్లనియె. 190

తే. విగతరాజ్యుల మైయుఘోరవిపినములకు, వచ్చి యిమ్మెయిఁ దపమున్నవార మేము
బాల సుకుమారి యిది జనపాల యడవి, నుండి మాతోడి యిడుమకు నోర్చునయ్య.

వ. అనిన నశ్వపతి యతని కి ట్లనియె. 192

చ. కలిమియు లేమియున్ సతము గా నవి సెందినచోఁ జెలంగుచుం
గలఁగుచు నుక్కి ధీరుల ప్రకారమె లెస్సగ నింతవట్టు నేఁ
దెలియుదుఁ జెప్పెదన్ వసుమతీవర పిన్న యనంగ నేర నే
కొలఁదియు గాదు ధీరమతి కూఁతురు పేర్కొనఁ జాలుఁ జెంపునన్. 193

క. నీతోడ వియ్య మందం, జేతోగతి నాసఁజేసి చెచ్చెర ని ట్లే
నేతెంచితి మత్ప్రార్థనఁ, బ్రీతిగఁ జేకొనక యునికి పాడియె నీకున్. 194

— సావిత్రి సత్యవంతుని వివాహం బగుట. —

వ. అనుటయు నయ్యంధనృపతి తత్సంబంధంబునకు సంతసిల్లి నిజాశ్రమవాసు లైన మునులం గూర్చుకొని శుభలగ్నంబున సత్యవంతునకు సావిత్రిం బరిణయంబు సేసె నయ్యశ్వపతియునుం గూఁతునకు నల్లునకు వివిధాంబరాభరణాదివస్తువిశేషంబు లొసంగి నిజపురంబున కరిగెఁ బదంపడి. 195

తే. పడఁతి రమణీయభూషణాంబరవిలాస, ముజ్జగించి వనాంతర యోగ్యలీల
వల్కలాజినవసన యై వదల కధిక, భక్తిభర్తృశుశ్రూషణపరత నుండె. 196

క. ఆమెలఁత సేయు[1]సవినయ, సామకథల మృదుగభీరసంభావనలన్
మామయు నత్తయు సంతో, షామృతమునఁ దేలి రంతరంగములఁ దగన్. 197

వ. సావిత్రియుఁ దనమగనియాయుఃప్రమాణంబు నారదముని చెప్పినదినంబు మొదలుగా ననుదినంబును లెక్కయిడుకొను చుండె నిట్లు వర్తిల్లుచుండ నాలుగుదివసంబులు గొఱంతగా నొక్క సంవత్సరంబు గడచిన. 198

క. నాలవదినంబు పతిమృతి, కాలం బని మది నెఱింగి కడు నిష్ఠ మెయిం
జాల భరంబుగఁ బూనెను, బాల త్రిరాత్రోపవాసపరమవ్రతమున్. 199

వ. దానికి విస్మయం బంది ద్యుమత్సేనుండు గోడలిం బిలిచి తల్లి యిట్లేల[2]దుస్తరం బగు వ్రతంబు దొడంగితి వనిన నమ్మద్రరాజతనయ వినయంబుతో ని ట్లనియె.

క. మీరు మదీయం బగు వ్రత, భారమునకు వగవ వలదు పరమశుభంబుల్
గోరి వ్రత మేను బూనితిఁ, గారణములు మీకు నెఱుంగఁగా నగుఁబిదపన్. 201

వ. అనిన నతం డట్లేని మేలు గాక యనియె నంతఁ జతుర్థదివసంబున. 202

సీ. కడురేఁకకడయ మేల్కని నిజభర్తకు, మరణదినం బని మానసమునఁ
దద్దయు శోకసంతాపంబు గదురంగ, దినముఖోచితవిధుల్ దీర్చి భక్తిఁ
బతికి సమంచితపావనపరిచర్య, యప్పుడు [3]శుశ్రూష యాచరించి

1. అ. 'సువినయ' సామగ్రిని, 2. జ. దురవస్థం బగు 3. చ. గడుసేద్య సాచ

యత్తకు మామకు నచటివృద్ధులకును, వేర్వేఱ బ్రణమిల్లి వేడ్క వారు
తే. దనకు సౌభాగ్యభాగ్యవర్ధనము గాఁగ, నిచ్చుదీవన మదిలో గ్రహించి యున్నఁ
బ్రొద్దుజామెక్కుటయుఁ బూవుఁబోఁడిఁ బిలిచి, మామయిట్లని పలికె సమ్మానమెసఁగ.
క. కడు నుగ్రం బగు వ్రత మిది, దొడఁగితి దివసత్రయంబుతో నిది సెల్లం
బడఁతీ యెంతయు డస్సితి, దడయక పారణ యొనర్పు దగదే యింకన్. 204
వ. అనిన సావిత్రి యతని కిట్లనియె. 205
ఆ. అధిప ప్రొద్దు గ్రుంకునంతకు నేఁడును, గుడువఁ దగదు నాకు గోరి యిట్లు
గాఁగ వ్రతముఁ బూను కాలంబునన యేను, నిశ్చయించికొనిన నియమ మిదియ.
వ. అనియె నప్పుడు సత్యవంతుఁడు సమిత్కుశఫలాహరణార్థంబు వనంబునకుం గద
లినం జూచి సావిత్రి యతనిఁ జేరం జని వనంబున కేనును నీతోడఁ జనుదెంతుఁ
దోడ్కొని పోవలయు ననిన నతండు నీవు త్రిరాత్రోపవాసంబునం జేసి యెం
తయు డస్సిన దానవు రానోప వనిన నది వాని కిట్లనియె. 207
మ. ఉపవాసశ్రమ మిప్పుడించుకయు నాయుల్లంబునం దోఁప దీ
విపినర బుజ్జ్వలపుష్పపల్లవఫలావిర్భూతినానాలతా
గపరీతం బన విందుఁ జూడఁగ మదిం గౌతూహలం బయ్యెన
న్నుపరోధింపకు మింతవట్టుచన వీ యుక్తుండ వెబ్బంగులన్. 208
వ. అనిన నతం డట్లు కాక చనుదెమ్మనుటయు సావిత్రి చయ్యనం జని భార్యాసహి
తుండయి యున్న తనమామకుం బ్రణమిల్లి మీకొడుకు వనంబునకు నగ్ని
హోత్రార్థంబై సమిధలు దేర నరిగెడు నాకును నతనితోడన చని వనంబు
నూడ వేడ్కయైనది మీరు నాకివ్వరంబు గృప సేయవలయు ననిన నాతం
డిమ్మగువ యెన్నండును నెయ్యదియును నడుగ దిత్తెఱంగు దీనికిం బ్రియంబై
యున్నది నాకు నివారింప నేల యని తలంచి యనుమతించిన నయ్యిరువుర
యడుగులం బడి వీడ్కొని. 209

—♦ సత్యవంతుఁడు సావిత్రీసహితుండై వనంబునకుం బోవుట. ♦—

క. చిత్తంబునఁ బైకొనియెడు, నుత్తల మడఁచుచును ముఖపయోరుహమునఁ దె
ళ్కొత్తెడు వెడనవ్వునఁ బ్రియు, చిత్తం బిగురొత్తఁ జనియెఁ జెలువ యడవికిన్.
వ. ఇట్లు దంపతులు మందగమనంబున నరిగి పరిసరారణ్యంబు దఱియం జొచ్చి
రప్పుడు. 211
సీ. కమనీయకమలినీకల్లోలవీథులఁ, గదలు రాయంచల గతులయొప్పు
బహుపుష్పపల్లవప్రకరచిత్రితములై, తనరారు తరులతాతతుల సొంపు
మకరందరసపానమదవిలోలంబులై, క్రాలెడి యెలదేఁటి గములయులివుఁ
బరిపక్వమంజులఫలరసోద్ధతములై, పలుకు రాచిలుకల పటురవంబుఁ
ఆ. బ్రియుఁడు వేఱువేఱ ప్రీతిమైఁ జూపుచుఁ, జెప్పుచును జనంగ జిగురుఁబోఁడి

గనుచు వినుచు నిర్వికారసల్లాపంబు, లార నతని తెఱఁగు నరయుచుండె.

వ. తదనంతరంబ యారాజర్షి నందనుండు మధురంబు లగుఫలంబులు గోయుచు గఱి డియ నిండించి యొక్క-యెడఁ బరశుపాతంబునం జేసి కాష్ఠదళనంబు సేయం దొడంగి శ్రమంపడి యొల్లంబోయి గొడ్డలి పుడమిపయి వైచి నిరంతరనిశ్వాస [1]వివర్ణవదనుం డగుచు సావిత్రిం గనుంగొని. 213

చ. ఒడలు వశంబు గాదు భ్రమ నొందినయట్లు మనంబు దూలెడిం
గడఁగి శిరంబు శూలవిశిఖ ప్రకరంబున నొంచినట్టి ద
య్యెడు నిలువంగ నోర్వ నొకయించుకసేపు శ్రమంబు దీఱ నీ
యెడ శయనింతు నావుడు సితేక్షణ యెత్తనిసంభ్రమంబుతోన్. 214

క. తనయంకతలమ ప్రియుశిరమున కుపధానముగఁ జేయ భూపతనయుఁడా
య్యనవ్రాలి సోలి నిశ్చేతనుఁ డైన ట్లుండెఁ గొంతతడవున కెదురన్ 215

మ. కనియెం గోమలనీలమేఘ [2]విలసత్కాలాంజనాకారు ఘో
రనిశాతోత్కటదంష్ట్రు నుజ్జ్వలచలద్రక్తాక్షుఁ బ్రత్యగ్రకాం
చనవర్ణాంబరు నంత్యకాలదహనజ్వాలా ప్రచండుం జగ
జ్జనసంత్రాసకు నొక్కదివ్యుఁ బటుపాశప్రౌఢహస్తోద్ధతున్. 216

వ. అప్పురుషుండును నధికసంరంభంబున సత్యవంతుం గదిసిన నయ్యింతి యెంతయు భయంబునం బ్రియుసిశిరం బాయ్యన దిగువం జేర్చి నిల్చి కృతాంజలి యై యయ్యా మీ రెవ్వరి యెయ్యెడకు నెయ్యది సేయం దలంచి విజయంచేసితి రనిన నతం డిట్లనియె. 217

సీ. కాలుండఁ జువ్వె యోకమలాక్షి నను నీవు, మహితపాతివ్రత్యమహిమఁ జేసి
కానంగఁ జాలితి కాన రాదన్యుల, కిదె నీదుభర్తకు నిపుడు కాల
మగుటయు వీఁడు మహాపుణ్యనిధి గాన, యితరులఁ బనుపక యేన వీనిఁ
గ్రచ్చఱఁ గొనిపోవఁ గాఁజను దెంచితి, నని యుగ్ర భంగి నయ్యంతకుండు

ఆ. ధరణినాథతనయుతనువునఁ బ్రాదేశ, పరిమితాత్ముఁ డగుచుఁ బ్రజ్వరిల్లు
జీవు వెడలఁ దిగిచి చెచ్చెర నతిదీర్ఘ, భయదపాశనికరబద్ధుఁ జేసి. 218

మ. కొని వేగంబున దక్షిణాభిముఖుఁ డై ఘోరంపుమార్గంబునం
జనఁగాఁ జొచ్చె ననంతరంబ మదిలో సావిత్రి శోకంబుపై
కొనఁ బ్రాణేశ్వరుదేహ మొక్కయెడ సంగుప్తంబు గావించి యా
తనిపజ్జం దగఁ దానునేఁగెఁ బదపద్మంబుల్ పొరిం దొట్రిలన్. 219

ఆ. దానిఁ జూచి దండధరుఁడు నీ విచ్చోల, వచ్చెదవు లతాంగి వలదు నిలువు
మింతి నీకగమ్య మిటమీఁది తెరువెల్ల, ననిన నతని కిట్టు లనియెఁ బొలఁతి

క. పతు లెందుఁ జనిన నచటికి, సతులకుఁ జన వలదె నీప్రసాదమునను మ

1. క. విపణ్ణవదనుం డగుచు. 2. గ. విదళత్కా

త్పతిభక్తికతమునను సంస్తుతగుణ నాకరుగ రానిచోటులుఁ గలవే. 221

వ. సకలమార్గంబులందును ధర్మమార్గంబు ప్రధానంబట్టి ధర్మంబునకు నాధారంబు సజ్జనుల యని వినంబడు నట్టిసజ్జనసందర్శనం బెప్పుడు వృథగాదు గావున సజ్జన శేఖరుండ వనంజను నీదైనసందర్శనంబునం బరమశుభంబులం బొందక యేను రిత్తజనంబుల తెఱంగున నూరక యెట్లు మగుడుదు ననిన దాని ప్రగల్భ వచనంబులకు నద్భుతం బంది ధర్ముం డి ట్లనియె. 222

ఆ. తనులతాంగి భవదుదారవాగ్భంగికి, మెచ్చు వచ్చెనాత్మ నిచ్చువాఁడ వేఁడు మొక్కవరము విభునిజీవిత మొక్క,టియునుదక్క నేదియయిననొండు.

—* సావిత్రి యమునివలన నభీష్టవరంబులు వడయుట. *—

చ. అనవుడు మద్రరాజసుత ప్రాంజలి యై సమవర్తితోడ ని
ట్లను రిపుకోటిచే నపజయంబును బొంది వనాంతరంబునం
[1]దనవరతవ్రతాభిరతుఁ డైనమహాత్ముఁడు సాళ్వభూవిభుం
దనఘుఁడు లబ్ధచక్షుఁ డగునట్టులుగాఁ గరుణింపవే మదిన్. 224

క. నావుడు నట్టుల యయ్యెడు, నీ విట రావలవ దుడుగు నెమ్మి ననివెసం
బోవఁ దొడంగెను బితృపతి, యావెలఁదియు నంత నిలువ కరిగెఁ బిఱుందన్.

వ. ఇట్లు చనిచని మఱియు ని ట్లనియె. 226

చ. ఎడపక వాఙ్మనఃక్రియల నేరికి హింస యొనర్పఁ బూన రె
య్యెడలను దీనులం గరుణ యేర్పడఁ బ్రోవన చూతు రిచ్చచోఁ
గడమ వడంగ నీ కెదిరి కాంక్షితముల్ దుదిముట్టఁ దీర్తు రె
క్కుడు మదిఁ గూర్తు రాశ్రితులకున్ విను మిన్నియు నార్యధర్మముల్. 227

క. నీ వెఱుఁగనియది యెయ్యది, దేవోత్తమ ధర్మగతులతెఱఁ గెల్ల భవ
ద్భావాధీన మగుటఁ గా,దే వెలసితి వీవు ధర్మదేవత యనఁగాన్. 228

క. సమబుద్ధితోడఁ దత్తత్సముచితకర్మఫల మఖిలజంతుతతులకున్
సమకూర్చుట నీ కయ్యెను,సమవర్తి యనంగఁ బేరు జగదభినుత మై. 229

క. యముఁ డండ్రు నిన్ను నార్యులు, యమింతు భూతములనెల్లన ట్లగుటఁ దగన్
శమనుండ వైతి కల్మష, శమనంబునఁ జేసి నీవు జలజాప్తసుతా. 230

వ. అనినం బ్రేతపతి యాపుణ్యసతి కి ట్లనియె. 231

క. తృషితుఁ డగువానిఁ బరిలఘు, తుషారతోయములు మోదితునిఁ జేయుగతిన్.
వ్యూషితాంగుఁ జేసె ననుఁ గ,ల్మషరహితములై నసీసమంజసభణితుల్. 232

వ. కావున సత్యవంతు ప్రాణంబులు దక్కం దక్కినకోర్కి యెయ్యదియైనం జెప్పుము సఫలంబు సేసెద ననిన సావిత్రి దేవా వైరులచేత నపహృతం బైన రాజ్యం

1. క. దనవరతప్రథితియుతుఁడై.

చెప్పుటియట్ల ద్యుమత్సేనుండు ప్రాపించునట్లుగా ననుగ్రహింపవే యని వేఁడు
టయు వైవస్వతుం డట్ల యగు నని పలికి యి ట్లనియె. 233

ఆ. వలదు నిలువు మింక వదలక నీభక్తి, మగని కెక్కె దుర్గమంపుఁద్రోవ
యిది కృతంబు లయ్యె[1] నెల్లయు నీ విట, వచ్చు నెలవు లేదు వనజనయన.

వ. అనిన నమ్మహాభాగ యతని కి ట్లనియె, 235

క. ధర్మాత్ములు దమసలిపెడు,ధర్మక్రియ దప్ప రెట్టిదశలందును మో
హార్మియుఁ దాపముఁ బుట్టవు, ధార్మికహృదయమునఁ బ్రథమధర్మాధ్యక్షా.

క. కావునఁ బతియనుగమనం, బేవిధమున విడువఁ దగునె యె ట్లయినను మో
హావేశముఁ బొందక ధ,ర్మావస్థితి సలుపవలదె యవహితబుద్ధిన్. 237

తే. అనిన నంతకుఁ డి ట్లను నతివ నీవు, ప్రకటధర్మవిశేషతత్పరవు గాన
యింక నొకవరమిత్తుఁ బ్రాణేశుబ్రదుకు, వలదుగానియొండడుగుము వలయుదాని.

వ. అనుటయు నక్కాంత కృతాంజలి యై మాతండ్రి మద్రేశ్వరుం డపుత్త్రికుం
డతనికిఁ బుత్త్రశతలాభంబు గావలయు నని యభ్యర్థించిన నట్ల కా నిచ్చితి నని
పల్కి ధర్మరాజు నేఁడు నీవు గడుదూరంబు వచ్చి డస్సి తింక మగుడుట లెస్స
యని పలికిన నప్పతివ్రత యి ట్లనియె. 239

తే. నాకు డప్పి యెక్కడిది మనంబు భర్తృ, చరణపంకజాసక్త మైనకరము భక్తి
నలరుచున్నది సతులకునన్య మెట్టి,దియును ధర్మమె భర్తృసంశ్రయముకాక.

వ. మఱియు నొక్క విన్నపంబు సేసెద. 241

ఆ. ఆత్మధర్మనిరతు లైనపుణ్యాత్ములు, దుర్లభులు సమస్తదురితములును
శాంతిఁ బొందు వారిసంసర్గమునఁ దీర్ఘ,భూతమతులు వారుభూతలమున. 242

ఉ. వారలపేర్మిఁ గాదె శశి వారిజమిత్త్రులు నిర్వికారసం
చారత నుల్లసిల్లెదరు సర్వపయోనిధులుం నిరాకులా
కారతఁ గ్రాలెడుం గులనగంబులు నిశ్చలరూఢిఁ జాల నొ
ప్పారెడు భూతధాత్రి నిఖిలైకధురీణతఁ బేర్మిఁ బొందెడున్. 243

వ. అని పలికి మఱియు ని ట్లనియె. 244

తే. ఏఁడుమాట లాడినయంత నెట్టివారు,నార్యజనులకుఁ జుట్టంబు లగుదురనినఁ
జిరసమాలాపసంసిద్ధిఁ[2] జేసి నీకు, నేను జుట్టమ నని వేఱ యేల చెప్ప. 245

వ. కావున మిత్త్రమనోరథం బవశ్యకర్తవ్యంబుగాఁ జిత్తగింపు మనిన నమ్మహాను
భావుం డబ్బాలికిని దేసం గనుంగొని నీకుం బ్రసన్నుండ నైతి నభీష్టం బైనవరం
బొక్కటి యిచ్చెద వేఁడు మనిన నమ్మానిని యిట్లనియె. 246

క. మది సత్యవంతుజీవిత, మది యిమ్ముగఁ దొలఁగఁ బెట్టి యన్యంబుల ని
చ్చెద నని పలుకుదు మును నీ, వది యిప్పుడు లేద యింక నడిగెదఁ బ్రీతిన్.

1. అ. నెల్లవియయును నిటు, వచ్చు నెలవు. 2. జ. జేసి యునికి.

చ. [1]పతిరహితంబు దుస్సహము । భర్తృవినాకృత యైనకాంత దూ
షిత యగు సర్వమంగళవిశేషములందును గాన మత్ప్రియుం
డతులితకీర్తిశాలి సుగుణాఢ్యుఁడు సాళ్వసుతుండు లబ్ధజీ
వితుఁడుగ నిమ్ము ధర్మపదవీపరిరక్షణ పుణ్యవీక్షణా. 248

వ. అనిన నట్లు చేయుదు నని యాక్షణంబ కృతాంతుండు సత్యవంతు నపగత
పాశుం జేసి యాసుందరి కి ట్లనియె. 249

చ. కొను మిదె నీమనఃప్రియునిఁ । గోమలి వీఁడు చతుశ్శతాబ్దముల్
మను నిటమీఁదఁ బుత్త్రులఁ గ్రమంబున నూర్వురఁ గాంచుఁ గీర్తివ
ర్ధనుఁ డగు సంతతాధ్వరవిధానములం బరితుష్టి సేయు న
య్యనిమిషకోటి కెల్లను [2]నిజాన్వయమాళివిభూషణుం డగున్. 250

వ. అని యాదేశించి యాతం డంతర్హితుం డయ్యె నక్కాంతయుఁ గ్రమ్మఱిచని యె
ప్పటియట్ల జీవితేశ్వరుం దనతొడలపై నిడికొనికూర్చున్నయెడం గొండొకవడికి
లబ్ధచేతనుం డై సత్యవంతుండు దెలిసి నిజవల్లభం జూచి యి ట్లనియె. 251

క. కడుఁ దడవు నిద్రపోయితిఁ, [3]బడఁతీ ననుఁ దెలుపవలదె । బలియుఁ డొకరుఁడె
క్కుడుజవమునఁ బట్టి బలం, బెడఁగలుగ ననుఁ దిగిచె నాతఁ డెవ్వఁడు సెప్పుమా.

చ. అది గల గాదు నిక్కువమ యైనటు లున్నది నాకు నెంతయున్
మది మఱి పుట్టె నావుడును । మానిని యి ట్లను నీకు నంతయున్
ముదమున రేపు సెప్పెద దమోమయమై యిదె శర్వరీముఖం
బొదవె విలంబనం బిచట । నొప్పదు లెమ్ము నరేంద్రనందనా.

మ. అదె నక్తంచరు లిందు నందును మహోగ్రాకారులై [4]క్రమ్మరా
మొదలం జొచ్చిరి ఘోరఫేరవరుతుల్ । మిన్నందెఁ దీవ్రంబు లై
పదశబ్దంబులు మీఱెఁ జూడు కలయం । బాఱం దొడంగెం బెనుం
గదుపుల్ గట్టి మృగంబు లెంతయు భయోత్కంఠంబు నాకయ్యెడిన్. 254

క. విను నీవు దడయుటకు మీ, జననియు జనకుండుఁ గరము । సంతాపభరం
బునఁ బొందుదు రింతకుఁ గ్ర,న్ననవారికి సంతసం బొనర్పవె యధిపా. 255

వ. అని పలికి తదీయవిషాదచేష్టితంబు లుపలక్షించి వెండియు. 256

చ. తమమును బెల్లుగాఁ బరఁగె । దవ్వు నిజాశ్రమభూమియున్ మదిన్
శ్రమమును బాయ దిప్డు నను చందమ యైనఁ జనంగ నేల యిం
పమరఁగ నింతప్రొద్దు సుగుణాకర యిచ్చట నిల్చి రేపు వో
దమ తెఱఁ గెద్ది నావుడును । దన్వికి సాళ్వతనూజుఁ డి ట్లనున్. 257

క. మానె శిరోవేదన నా, మేనికి దగులావు వచ్చె । మెల్లన యరుగం

1. అ. పతివిరహంబు. 2. గ. నిజాన్వయకోటివిభూషణంబుగన్. 3. క. గ. అ. జ. బడఁతి ననుం దెలుప వలదె ♦ మఱియొక్కరుఁడె. 4. జ. క్రమ్మఁగా.

గా నేర్తుఁ దల్లిదండ్రులఁ, గానక యే నెట్లు నిలుతుఁ గాననభూమిన్. 258

క. ఇంతకు మున్నెన్నఁడు నే, నింతతడవు వారిఁ బాసి యెందుఁ దడయ నేఁ
డింతవడి మసలుటకు వా, రెంత వడిరొ యేమియైరొ యెట్లున్నారో. 259

ఆ. సంధ్యప్రొద్దు నన్ను జనని యెన్నఁడు నిలు, వెడల నీదు నేఁడు విపినభూమి
మధ్యరాత్రివేళ మసలుంగ కాయము, యెట్టిపాటు వడునొ యేనెఱుంగ. 260

సీ. కౌఁగిటనునుఁజిక్కఁ గదియించిశిరముమూ,ర్కొంచును బాష్పముల్ గురియుచుండ
బట్టి మాయొడలునుఁ బ్రాణంబులును నెల్ల,యర్థముల్ నీవ మా యన్ననీవు
దేపగా సంసారతీరంబు సేరెద, మని తలంచెదము సుమ్మన్నయన్న
కన్నులు లేనిమా కన్నులుఁ గాళులు, నీవ కదన్న మా నిఖిలవంశ

ఆ. మును సముద్ధరించు మోపునీయదియ క,దన్న యనుచు నిట్టులగ్గలంపు
బ్రేమ ననుదినంబుఁ బ్రేముడింతురు వృద్ధు, లక్కటకట యేమియైరొ నేఁడు.

ఆ. అడవి కేఁగుదెంచి యడరంగ ఫలమూల,తతులు గొనుచు నేను దడయకపుడ
పోవ నోపనైతి దైవోపహతి నింత, చిక్కువడితి నేమి సేయువాఁడ. 262

క. నాయున్నచో టెఱుంగక, యా యాశ్రమవాసులైన యందఱు నతిదుః
ఖాయత్తుఁ డగుచు నడుగును, మాయయ్య దలంకి మాటిమాటికి నింకన్. 263

క. నావార్త వినక యింతకు, నావృద్ధులు భిన్నహృదయులై ప్రాణంబుల్
వో విడుతురు గా కచటికిఁ, బోవం బని గలదె యేనుఁ బుచ్చెద నసువుల్. 264

—* సత్యవంతుఁడు సావిత్రితోడ మరలి తన యాశ్రమంబునకు వచ్చుట. *—

వ. అని బహుప్రకారంబులం బలవరించి కన్నీరు నించిన నక్కాంత దుఃఖాక్రాంత యగుచు నతని నాశ్వాసించి నవమృణాళమృదులంబు లగుభుజంబులఁ గౌఁగిలించి యెగయ నెత్తిన మెత్తన నిలిచి యతండు ధూళిధూసరంబైన శరీరంబు నొడసి కొని గమనంబున కుత్సహించిన. 265

క. ఫలభారము దుర్భర మని, వెలఁది యచట నొక్కవృక్షవిటపంబున ని
మ్ముల గరిడియ దగిలిచియు, జ్వలపరశువుఁ గొనుచు మృదులసంభ్రమలీలన్. 266

వ. జీవితేశ్వరువామబాహువు నిజవామభుజంబుపయి నిడికొని దక్షిణహస్తంబున నతని గ్రుచ్చి కౌఁగిలించి మందగమనంబున నాశ్రమోద్దేశంబునకు మగిడె నంతకు మున్న యక్కడ. 267

ఉ. కన్నులు వచ్చి యెల్లెడలుఁ గన్గొని వృద్ధనరేంద్రుఁ డాత్మజుం
గన్నులఁబోలె నైనతనగాదిలిపుత్త్రుఁడు కాననంబులో
నెన్నఁడు లేదియంతతడ వేటికిఁ జిక్కెనొ యంచు నార్తితోఁ
గన్నులు లేనియ ట్లొకఁడు గానక యేడ్చె సతీసమేతుఁడై. 268

తరలము. కొడుక యెందు నందురో యుచుఁ గోరి ప్రేమభరంబునం
గొడుకుసద్గుణకోటు లెల్లను గోటిభంగుల నొలి ను

గ్గడన సేయుచు సత్యవంతుని§గాన రే మునులార యీ
యడవిలోపల నంచు హాసుత § యంచు ధైర్యము డించుచున్. 269

వ. ఉన్నంతఁ దదాశ్రమవాసులైన మును లందఱు నతనిం బొదివికొని తదీయనయన లాభంబునకు విస్మయం బందుచు నుచితవాక్యంబుల నతని నాశ్వాసించుచుండిరి తదనంతరంబ యొక్కముహూర్తంబునకు సావిత్రీసహితుం డై చిత్రాశ్వుండు సనుదెంచిన నావృద్ధదంపతు లత్యంతహర్షంబున నతనిం గౌఁగిలించుకొని మూర్ధఘ్రాణంబు సేసిరి మునివరులును గరంబు సంతసిల్లి రప్పు డారాజర్షిముఖ్యుండు పుత్త్రునిం జూచి యయ్యా యిట్లేల వనంబులో మసలి తని యడిగిన నతండును దానుఁ జని పండ్లు గోయుటయును గాష్ఠదళనంబు సేయునెడం దలయేరు గిదిరి నిలువ నోపక విశ్రమించుటయుఁ ద న్నొక్కపురుషుండు గలలోన నిగ్రహించుటయుం జెప్పునెడ సావిత్రి మామ కి ట్లనియె 270

సీ. ఈరాజసుతునకు § నిద్దినంబున మర,ణం బని మును చెప్పె § నారదుండు
మునినాథువచనం బ§మోఘంబు గావున, నేముఱ కేను నేఁ § డితనితోడ
నడవికి నేఁగితి § నచట నీతఁడు సుప్తుఁ, డై యున్నయెడ వచ్చె § నంతకుండు
వచ్చి యివ్విభునిజీ§వముఁ గొని పోవంగ, వెనుకన చని యేను § వివిధభంగి
ఆ. సత్యధర్మఫణితి § సంస్తుతించుటయుః గృ,పార్ద్రచిత్తుఁ డగుచు § నజ్జముండు
నాకు నెమ్మి నొసఁగె§నాలుగువరము లం,దొకట నితఁడు జీవ§యుక్తుఁ డయ్యె.

వ. మఱియు నొకవరంబు భవదీయనయనోన్మేషణకారణం బయ్యెఁ దక్కనవరద్వయంబునకు మీకు వైరిహృతరాజ్యసంప్రాప్తియు మదీయజనకునకుఁ బుత్త్రశతలబ్ధియు నగు నని చెప్పిన నయ్యిద్దఱుఁ బరమానంద[1]కందళితహృదయులై కోడలి కి ట్లనిరి. 272

క. ఆపత్సముద్రమగ్నం, బై పోయెడు నస్మదన్వ§యము పెం పెసఁగం
దేప యయి కడవఁ బెట్టిన, నీపుణ్యచరిత్రకీర్త§నీయము తల్లీ. 273

వ. అని యభినందించి రప్పు డయ్యిందువదనను మునివరు లందఱుఁ బ్రశంసావచనంబుల నుపలాలించి వారల దీవించి నిజగృహంబులకుఁ జని రంతం గతిపయదినంబులకు. 274

సీ. ఆసాళ్వభూపతి§యాప్తమంత్రులు మూల, భృత్యులుఁ బౌరులు§బృథివిఁ గలుగు
పెద్దలుఁ గూడి సం§ప్రీతి నాతనిపాలి, కే తెంచి వినయస§మేతు లగుచు
నవనీశ నీశత్రుఁ § డాత్మీయభృత్యభే, దనమునఁ జేసి బాం§ధవసహాయ
సహితుఁ డై మృతిఁ బొందె § సకలజనంబులు, నేకచిత్తంబున § నిపుడు నిన్నుఁ
ఆ. బ్రకటరాజ్యపదవిఁ § బట్టంబు గట్టంగ, వచ్చినారు నిఖిల§వసుధయందు
విస్తరిల్లె నీదు§విజయఘోషము భద్ర, గజము నెక్కి వేగ § కదలు మింక. 275

1. క. శీతలశరీరు లై.

క. ప్రాకటతపోబలంబున, నాకలితవిలోచనుండ । వై యున్ననినుఁ
లోకేశ చూడఁ గంటిమి, మాకన్నులు చల్ల నయ్యె । మాభాగ్యమునన్. 276

వ. అనినం బ్రహృష్టహృదయుం డై ద్యుమత్సేనుండుఁ దత్క్షణంబ తదాశ్రమవాసు
లయినమునుల నామంత్రణంబుసేసి కొడుకునుం దానును గజారూఢుఁ డై (సతీ
సమేతుఁ డగుచు) బహుళచతురంగసేనాసంకులగమనంబునం బురంబునకుఁ జని
సకలమహీరాజ్యంబును గైకొని చిత్రాశ్వునకుం బురజనసమ్మతిం బ్రథితయావ
రాజ్యపట్టం బొసంగి పరమైశ్వర్యధుర్యుం డయ్యె నిత్తెఱంగున. 277

క. తనమగని నత్తమామల, జననీజనకులను దన్ను । సకలకులంబుల్
ఘనముగ సముద్ధరించెను, జనవర సావిత్రి దత్సు।చరితన కంటే. 278

తే. ఆపతివ్రతయట్ల యీ।యజ్ఞసేని, పరమకళ్యాణి ధర్మసం।భావనీయ
యధిప మిమ్మును మీయఖి।లాన్వయంబు, నుద్ధరించు మహాభాగ్య।యుక్తిఁ జేసి,

క. అని చెప్పి పాండుతనయుల, ననఘుల వీడ్కొని మునీంద్రుఁ । డనుపమతేజో
ఘనుఁ డగుమార్కండేయుఁడు, దనయాశ్రమమునకు నరిగె । దద్దయు నెమ్మిన్.

—* సూర్యుఁడు బ్రాహ్మణవేషంబునఁ గర్ణునకు హితంబు సెప్పుట. *—

వ. అని చెప్పిన విని జనమేజయుండు వైశంపాయనునితో మునీంద్రా యింద్రుండు
గర్ణుకవచకుండలంబు లెవ్విధంబున హరియించెం జెప్పవే యని యడిగిన నతం
డి ట్లనియె. 281

సీ. వనమున నప్పాండు।తనయ లుండఁగ నందు, వరుసఁ బండ్రెం డగు।వత్సరంబు
కడపట నింద్రుఁడు । గడఁగి పాండవహిత, కారి యై కర్ణుని।కవచకుండ
లములు మాయాప్రయో।గమున హరింపఁగఁ, దలఁచిన నాతని।తలఁ పెఱింగి
జలజాప్తుఁ డొకనాఁడు । వెలయ రాధేయున, కదియెల్ల నెఱిఁగింతు।నని తలంచి

ఆ. లోకనుతుఁడు బ్రాహ్మ।ణాకార మొప్పంగ, నతనియున్నకడకు । నరుగుదెంచి
యేకతంబ యున్న।యాకర్ణుతోడ న,భీష్టభంగి దోఁప । నిట్టు లనియె. 282

క. ఓ కర్ణ సుజనవినుత గు,ణాకల్ప భవద్ధితార్థ । మై యొకకార్యం
బేకతమ చెప్ప వచ్చితిఁ, బ్రాకటముగ వినుము నాదు।పలుకులు వరుసన్. 283

వ. పాండవపక్షపాతి యై పాకశాసనుండు భవదీయంబు లయినకవచకుండలంబులు
హరింపం గోరి నీవు బ్రాహ్మణప్రియుండ వనియును బ్రాహ్మణు లడిగిన నెయ్యది
యైనను వంచన సేయ వనియును నెఱుంగుం గావునఁ గపటబ్రాహ్మణుఁ డై వచ్చి
యడుగం గలవాఁడు నీవును గవచకుండలంబు లీ వలవదు రత్నకాంచనవనితా
ప్రముఖంబు లయినపదార్థంబులు సూపియుం బ్రార్థించియు నెవ్విధంబుననయినం
గడపి పుచ్చ వలయు నట్లుగాక వీని నతని కిచ్చి తేని మృత్యువశంబునం బొందఁ
గలవాఁడవు. 284

చ. అమృతమయంబు సువ్వె సుగుణాకర యిమ్మహనీయవస్తుయు

గ్మ మిదియ యుండునేనిఁ ద్రిజ। గంబులయందు నశేషశత్రులో
కమునకు నీవు వధ్యుఁడవు । గావు నిరంతరసౌఖ్యసంప్రమో
దమున వెలుంగు దీ విది హి।తంబుగఁ జెప్పితి మోసపోకుమీ. 285

క. అనిన విని సూతతనయుఁడు, వినయంబున నిట్టు లనియె । విప్రాకారం
బున వచ్చిన వేల్పవు నీ, వనఘా యెవ్వఁడవు నాకు । నానతి యీవే. 286

క. అనిన నతఁ డేను సూర్యుఁడ, మనమున నీయందుఁ గలుగు।మక్కువఁ గర్జం
బొనరఁగ నుపదేశింపం, జనుదెంచితి ననిన నతఁడు । సంబ్రమ మొప్పన్. 287

వ. అభివాదనంబు సేసి దేవా దేవర నాకత్యంతహితుండ వగుటం జేసి కృతార్థుండ
నైతి నిం కొక్క విన్నపంబు సేసెద నవధరింపుము. 288

ఉ. భూసురకోటి వేఁడుటయుఁ । బోఁడిగఁ బ్రాణము లైన నీగి నా
బాస దినేశ [1]లోకమునఁ। బ్రస్ఫుట మింతయు నట్లు గావునన్
వాసవుఁ డట్టె నన్నడుగ । వచ్చుఁ బ్రియంపడి నాకు నొక్కబ్రాఁ
తే సురలోకవందిత మ।దిం గవచంబును గుండలంబులున్. 289

క. జగముల నెల్లను నిండిన, పొగడిత గడువెలితి సేసి । పొల్లయొడలికై
తగవే జన్మవ్రత మిటు, దిగ విడువఁగ నేఁడు నాకుఁ । ద్రిభువనదీపా. 290

మ. మతిఁ గుంతీసుతపక్షపాతి యగుచున్ । మాయాస్వరూపంబుతో
[2]జితదైత్యుండు శతక్రతుండు నను భి।క్షింపంగ నేతెంచున
ట్టితెరంగైనఁ దదీయకీర్తియు చుమీ । డిందుం ద్రిలోకీసము
న్నత మై యొప్పు మదీయకీర్తి యిది సూ । నాపుణ్య మెబ్భంగులన్. 291

ఆ. కీర్తి విడువఁ జాలఁ । గీర్తితో మొలఁగంగఁ, జావు వచ్చెనేనిఁ । జత్తుఁ గాని
జగములోన నెల్ల।నడికంటెఁ జావు మే,లనఁగఁ బరఁగుమాట । యనఘ వినవె.

ఉ. కీర్తియ యిచ్చుఁ బుణ్యగతిఁ । గీర్తియ తల్లియుఁబోలెఁ బ్రోచు స
త్కీర్తియ యాయువున్ సిరియుఁ । గీర్తివిహీనుఁడ చూ శవంబు దు
ష్కీర్తికి నెల్లచేటులును । గిట్టి హరించు ననండె తొల్లి భ
క్తార్తిహరుండు నాఁ బరఁగు।నంబుజసూతి జగద్ధితంబుగన్. 293

సీ. విప్రులు గడు నర్థి। వేఁడినఁ గలిమిలోఁ, బొచ్చెంబు సేయక । యిచ్చు టొకటి
బలితంపుఁబగతురఁ। బరిమార్చుటొక్కటి, దండియై యనిఁజచ్చు।టొండెనొకటి
శరణాగతుని నెట్టి। శత్రుని నైనను, గరుణఁ గయ్యంబునఁ। గాచు టొకటి
భామినీద్విజవృద్ధ। బాలాతురుల కైన,యాపదఁ జెచ్చెరఁ । బాపుటొకటి

ఆ. [3]యనఘ యివి వ్రతంబు।లై చెల్లు నాకునిం, దొకటి దప్పెనేని । వికల కీర్తి
నగుదుఁ గాన యిత్తు। [4]నఖిలభావములనా, ఖండలునకుఁ గవచ। కుండలములు.

---

1. క. గ. దీని నుడుపంగఁ జతుర్ముఖుఁడైన నోపఁడే, వ్యాసవు. 2. ఙ. జిత ధైర్యుండు. 3. జ. రైనయివి. 4. గ. నఖిలమ్ము నెఱుఁగునా.

వ. అనినఁ గర్ణునకు సూర్యుం డి ట్లనియె. 295

క. కడునెయ్యుర హితముగఁ జెప్పెడుపలుకులు వినవు గరము వేలవు నీ వె
క్కడ బుద్ధి తెరువులెక్కడ, చెడక వినుము నీకుఁ దెలియఁ జెప్పెదఁ గర్ణా.

క. తనకుఁ దనయులకు సతులకు, జననీజనకులకు బంధుజనులకుఁ గీర్తిం
దని తెరువునఁ గీర్తి గొనం, జనుఁగా కందఱును జెడుయశం బేమిటికిన్. 297

ఉ. కావున నీవుప్రాణములు గావుము కీర్తియటుండ నిమ్ము నీ
జీవిత మున్నఁగీర్తి మఱి చేరదె కీర్తి యొకం డనంగ నే
లా వనితల్ దనూభవులు లక్ష్ములు బంధులు సార్వభౌమ తే
జోవిభవంబు [1]ని మ్మడరఁజొప్పడుఁబ్రాణ మొకండు కల్గినన్. 298

క. మృతుఁ డైననరుఁడు వెస భస్మితుఁ డై చనుఁ గాక కీర్తి మేలిమి గనునే
మృతుదేహంబునకు నలం,కృతిఁ జేసినయట్లు మృతునికీర్తియుఁబిదపన్. 299

వ. నీవు నాకు నత్యంత భక్తుఁడ వగుటంజేసి భక్తజనరక్షణంబు గర్తవ్యంబుగావున నీకిట్లన్నియుం జెప్పవలసె మఱియు దేవనిర్మితం బైనరహస్యం బొక్కటి గలదు దానంజేసి నీయందు నాకు వాత్సల్యంబు మిగిలియుండు నది యిప్పు డేను జెప్పఁ బిదప దనయంతన యెఱుంగంబడియెడు నీకు నర్జునునకుం దెగనిపగ యై యుండు మీకు గయ్యంబు నయ్యెడు నందునీవు సహజకుండలమండితుండ వగుటం జేసి యర్జునున కజయ్యుండ వయ్యెద వట్లుం గాక వీనిం గోలుపోయి తేని నెంతయు దెప్పరం బగు ననినం గర్ణుం డి ట్లనియె. 300

మ. కరుణామూర్తివి నీవు సంతతము భక్తశ్రీసమాధానత
త్పరచిత్తుండవు గావునం గడఁగి నాపై మక్కువం బద్మినీ
వర మే లానతి యిచ్చి తిం కొకటి దేవానిన్నుఁ బ్రార్థించెదం
గరుణన్ నా ప్రతికూలదుర్లలితవాక్యంబుల్ సహింపం దగున్. 301

క. అనృతమున కెంత వెరతును, విను మంతకునకును నంత వెరవఁ బ్రతిగ్రహిం
చిన వ్రతము విడిచిదుర్గతిఁ, జనఁజాలుదునయ్య నన్నుఁ జనునే మాన్పన్. 302

వ. అర్జునుండు దుర్జయుం డని చూడవలదు నీవును మదీయంబు లగుదివ్యాస్త్రవిశేషంబు లెఱుంగుదు జామదగ్న్యుండును ద్రోణుండునునాకు నొసంగినదివ్యాస్త్రంబు లల్పంబులుగావు గావున నవశ్యంబును సమరంబున నమరరాజనందనుం దెగటార్ప నోపుదు నీవింక నొండు దలంపక నాకు ననుజ్ఞ యిమ్మనిన నొక్కింత విచారించి [2]యాదేవుండు రాధేయున కి ట్లనియె. 303

—* సూర్యుఁడు గర్ణునితో నింద్రునిచే శక్తి గైకొను మని చెప్పుట. *—

తే. ఎల్లభంగుల నిశ్చయంబిదియయేని, వత్స విను మింక నొక్కటివాసవునకు
గలదుదారుణంబుననమోఘంబునైన, శక్తియదినీకునడుగుముసవినయముగ.

1. క. నిమ్ముపడ. 2. క. యాదితేయుండు.

క. తొలితొలి బలసూదనుచే, జెలువుగ నాదివ్యశక్తి సేకుఱఁ గొని కుం
డలములుఁ గవచంబును మఱి, యలఘుమతీ యిమ్మహాభద్రమగు నట్లయినన్.

ఉ. [1]వైరులఁ జంపిచంపి వెస వచ్చు గరంబున కాజిలోన న
ద్దారుణశక్తి వాసవుఁడు దానన తొల్లి సహస్రసంఖ్యలం
గ్రూరసురారిసంఘములఁ గూల్చె మహాభుజ నీకు నెమ్మి నా
ఘోరపుసాధనంబు దొరకొన్న నవశ్యము [2]గెల్తు పోరులన్. 306

వ. అని చెప్పి కమలహితుం డంతర్హితుం డయ్యెఁ గర్ణుండును వాసవురాక కెదురు
చూచుచుండె ననిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె. 307

మధురాక్కర. కలదు దేవగుహ్యం బని కమలబాంధవుఁడు గర్ణుఁ
బలికె నని చెప్పి తది యెద్ది బలియుఁ డాసూతజుండు
లలితకవచంబు మణికుండలములు నెమ్మియిఁ బడసె
వెలయ నివ్విధ మంతయు వివరింప వలయునాకు. 308

వ. అనిన వైశంపాయనుం డది యంతయుం జెప్పెద విను మని యిట్లనియెఁ దొల్లి
కుంతిభోజుకడకు దుర్వాసుం డతిథి యైవచ్చి వానిచేతం బూజితుం డై నాకు
నీయింటఁ గొంతకాలంబు వసియింప నిష్టం బైనది నాయున్నయంతకాలంబును
నీవును నీయనుచరులును నిర్వ్యాజం బగుభక్తి సేయవలయు నిట్లొప్పదే
యనుటయు నొడంబడి యతండు దనకూఁతుం బృథ యనుకన్యకం బిలిచి య
మ్మహామునిం జూపి. 309

ఉ. దేవసమానుఁ డీధరణిదేవుఁడు వేడుక మద్గృహంబునం
దా వసియింపఁ గోరుటయు దానికి నేనును నియ్యకొంటి నిం
దీవరనేత్ర నీవుఁ గడుధీరవు ధీవినయోపచారసం
భావితవృత్త వట్లగుట భక్తి భజింపుము బ్రాహ్మణోత్తమున్. 310

క. ఇతఁ డెయ్యది యెత్తఱి స,మ్మతిఁ గోరిన నది ఘటించి మచ్చిక నిడి తో
షితుఁ జేయు మిమ్మహాత్ముని, మతి యలుగక యుండవలయు మానిని యెపుడున్.

ఆ. వినుము విప్రవరులు వెడవెడఁ గినిసిరే, నియును ధరణి యెల్ల నీఱుసేయఁ
జాలుదురు తపఃప్రశస్తులు దుర్వార, తేజు లెందు నధికధీరమతులు. 312

క. భూదేవపరాభవమునఁ, గాదే వాతాపిదండక ప్రభృతులు పెం
పేది చెడిరి భూదేవస,మాదరమునఁ, గాదె బ్రదికినవి యిజ్జగముల్. 313

సీ. పసిబిడ్డ వయ్యును బడఁతి నీవెంతయు, గుణవంతురాలవు గురులయందుఁ
బెద్దలయందును బృథివీసురులయందుఁ, గడుభక్తి సేయుదు కమలనయన.
బంధులుఁ జెలులు సంబంధిజనంబులుఁ, బురమువారును నంతిపురమువారుఁ

1. 305 వ 306 వ పద్యములకు నడుమ 'అమ్మహాసాధనంబు తెఱంగుఁజెప్పవచ్చెరువుదాని విశేషంబుఁ జెప్పెద విను మని మఱియు నిట్లనియె' ననువచనము నొకటఁగాన్పించెడి. 2. గ. మేలు,

బూఁబోఁడి నిను నెమ్మిఁ ॥ బొగడనివారు లే, రే మని వర్ణింతు ॥ నేను నిన్ను
తే. యదుకులంబునఁ బుట్టి యత్యంతసౌఖ్య, మమరఁ బెరిఁగితి నాపుత్త్రి ॥ వైత్రిలోక
సుందరము రూపుప్రాయంబు ॥ సొంపు నిట్టి, దిచ్చరిత్రంబు సతులకు ॥ నెందుఁ గలదు.
వ. నీగౌరవం బంతయు నెఱింగి కాదె వహ్నిసమానుండైన యీమహాముని నారాధిం
చుటకు నీయందు భారం బెక్కించెద నీవును దర్పంబును నహంకారంబును దూ
రంబున నిడి యిప్పుణ్యపురుషుం బరితుష్టుం జేసి కృతార్థతం బొందు మనిన న
క్కన్నియ దండ్రి కి ట్లనియె. 315
ఉ. కోరుదు నేను విప్రతతిఁ ॥ గొల్వఁగ నెప్పుడు నాత్మలోన నా
కోరిన కోర్కి నేఁడు దల ॥ కూడె నరేశ్వర యట్లుఁ గాక నీ
కోరినయట్టి[1]యవ్విధము ॥ గోరి యొనర్చుట నాదుభాగ్యసం
భారము గాదె యూఱడుము ॥ భారము నాపయిఁ బెట్టి నెమ్మదిన్. 317
వ. అని పలికిన సంతసిల్లి కుంతిభోజుండు దుర్వాసున కక్కన్నియఁ జూపి యిట్లనియె.
క. ఈపిన్నది నాకూఁతురు, తాపసజనముఖ్యమిమ్మఁ ॥ దాఁ గొలువంగా
నోపుదు నని పూనెం బసి, పాప సుఁడీ కినుక లేక ॥ పనిగొనవలయున్ 318
చ. ఎఱుఁగక తప్పుగా మెలఁగె ॥ నేనియు దానికిఁ జేసి నేరముల్
గఱపి ప్రియంబుతోఁ గొలువు ॥ గైకొనఁగాఁ దగు మీకు బాలురుం
దెఱవలు వృద్ధులుం దమకుఁ ॥ దెల్లగఁ దప్పులు సేసి రేనియు న్
మఱతురు గాని యల్గరు స ॥ మగ్రశమాన్వితు లైన తాపసుల్. 319

—* కుంతి దుర్వాసునకుఁ బరిచర్య సేయుట. *—

వ. అని యప్పగించి యప్పార్థివేంద్రుం డప్పు డమ్మునీంద్రునకుఁ జంద్రికాధవళం
బైనసౌధంబునందు శయనాసన ప్రముఖోపకరణంబులు నభిమతాహార సాధన
ద్రవ్యంబులు నాయితంబులు సేయించి తాను సంతసంబున నూఱడి యుండె
నంత. 320
క. భావించి నాఁడునాఁటికి, వేవిధముల మిగుల భక్తి ॥ వినయంబులతో
దైవోపచారముల భూ, దేవోత్తముఁ గొల్చెఁ గుంతి ॥ దేవి నియతయై. 321
సీ. అతఁడును దద్భావ ॥ మరయంగ మదిఁ గోరి, రూపించి యొకమారి ॥ రేప వత్తు
నని పోయి నడికిరే ॥ యర్థితోఁ జనుదెంచు, [2]రేయి వచ్చెద నని ॥ రేపు వచ్చు
నేప్రొద్దు వచ్చిన ॥ నింతి యప్పుడు భక్ష్య, భోజ్యముల్ గ్రొత్తపొ ॥ ల్పుగ నొనర్చు
నెయ్యది గోరిన ॥ నిచ్చకు రాఁ బెట్టు, నలయదు మది నైన ॥ నలుగ దెపుడు
ఆ. ననుదినంబు భోజుఁ ॥ డాత్మజఁ బిల్పి త, ద్వర్తనంబు నడుగ ॥ వనజముఖియుఁ
దాను గొల్చు తెఱఁగుఁ ॥ దాపసవరునిచం, దమును జెప్పుచుండుఁ ॥ దండ్రి యలర.
వ. అంత నొక్కసంవత్సరంబు పరిపూర్ణం బయినఁ బ్రీతుండై దుర్వాసుండు గుంతి

1. గ. దివ్విధము 2. చ. మాపు.

జూచి నీచేసినయారాధనంబునకు మెచ్చితి నభిమతంబు లిచ్చెద నడుగు మనిన నమ్మౌనిని గృతాంజలి యై మీరు నావలనం బ్రసన్నులరయితిరి దీనికి మాత్రం బ్రియుం గరంబు నలరు నింతియుచాలు నొం డేల యనిన నతం డక్లేని నిది యొక్కమంత్రంబు గైకొను దీనంజేసి యెవ్వేనివేల్పు నాహ్వానంబు సేసెద వవ్వేల్పు సనుదెంచి నివశంబున నుండు ననిన నొం డన వెఱచి కుంతియుం బ్రసాదం బనియె నమ్మునీంద్రుండు దాని కమ్మంత్రంబు విధియుక్తంబుగా నుప దేశించి కుంతిభోజుని దీవించి నిజేచ్ఛం జనియె నంతఁ గొంతకాలంబునకు. 323

మ. మదిఁ గారుణ్యము సేసి విప్రవరుఁ డీమంత్రంబు నా కిచ్చె నే
నిది యేచందము చూతు నంచు నొకనాఁ డిచ్ఛం బుతుస్నాత యై
సుదతీరత్నము పూర్వశైలతటిపై శోభిల్లుతిగ్మాంశుఁ జూ
చి దళత్పంకజభంగి నుల్లసిత యై చిత్తంబు రాగిల్లఁగన్. 324

వ. సహజకుండలకవచాభిరామం బయినతదీయమూర్తివిభవంబున కోటువడి దేవా భవత్సమానరూపసుందరుం డగునందనుం గరుణింపవే యని మనంబునంగోరుచు మంత్రోచ్చారణంబు సేయు చున్నఁ బ్రభాకరుండును నిజయోగబలంబున మూర్త్యంతరంబు ధరించి కుంతిపాలికిం జనుదెంచి మధురస్వనంబున. 325

తే. అబల నీమంత్రబలమున నరుగుదెంచి
నాఁడ నీవాఁడ నైతి మనః ప్రియంబు
నీకు నెయ్యది యొనరింతు నిజము చెపుమ
యనినఁ బడఁతి యి ట్లనుఁ గమలాప్తుతోడ. 326

తే. కార్య మొక్కటియును లేదు కౌతుకమున, నేనుమంత్రంబునోడివితినింతమాత్రఁ
జేసి నీకు నిచ్చటికి విచ్చేయ నేల, దివికి నరుగుము క్రమ్మఱ దేవ నీవు. 327

వ. అనిన దానికి సూర్యుం డి ట్లనియె. 328

ఉ. క్రమ్మఱ పోక తప్పెడినె కాముని యే మని మున్ను నీవు చి
త్తమ్మునఁ గోరి తవ్విధము దప్పక యిప్పుడుఁ బల్క రాదె తే
జమ్మున మత్సమానుఁ గవచస్ఫుటకుండలమండితాంగు స
త్సమ్మతుఁ బుత్త్రుఁ గోరవె నిజమ్ముగ నావలనం దలోదరీ. 329

వ. కావున నిప్పుడు మదీయసమాగమంబున కొడంబడుము నీకోరినయట్టితనయుండు జనియించు నిట్లు సేయునినాఁడు నిన్నును భవజ్జననీజనకులను భస్మంబు సేయుదు మఱియు నీదైనశీలవృత్తంబు లెఱుంగక మంత్రంబు గర్వంబునంజేసి నీ కుపదే శించినతాపసు నీక్షణంబ నిర్దహింతు నిదె యంబరంబుననుండి యింద్రాదిసురవ రులు నీకతమ్మునఁ జిక్కువడి యున్ననన్ను నవ్వుచున్నవారువీరింజూడుమని దివ్య దృష్టి యిచ్చినం జూచి కుంతిభోజరాజనందన డెందంబున నమందలజ్జావివశ యగుచు దినేశ్వరున కి ట్లనియె. 330

క. తను నిచ్చుటకుం గర్తలు, జననియు జనకుండుఁ గాక చను నే నాకున్
వనితాధర్మువు విడువఁగ, ననఘా యిట్లయిన వంశహానియుఁ గాదే. 331

ఆ. మంత్రబల మెఱుంగ మదిఁ గోరి తప్పు సేసితి మహాత్మ దీనిఁ జెట్టఁ గాఁగ
నవధరింప కెట్టు లైన నాబాల్యంబు, గరుణ సైఁపవలయుఁ గమలమిత్ర.

వ. అని మఱియు ననేకప్రకారంబుల దివాకరు ననునయించి యెట్లనుం బ్రమ్మఱింప నేరక తనకారణంబునఁ గులంబునకును గురుజనంబులకును నపాయం బగు నని యుం దలపోసి భయంబు మిగులఁ దెగువ సేసి యతని కిట్లనియె. 333

చ. ముదము దలిర్ప బంధుజనముల్ గురువర్గముఁ గూడి రూఢి నొ
ప్పిదముగ ధర్మమార్గమునఁ బెండిలి సేయఁగఁ బిమ్మటన్ సము
న్మదరసకేళిలీల[1]కుఁ గ్రమం బగుఁ గాక కులంబు శీలమున్
వదలి వధూజనంబులకు వచ్చునె యిమ్మెయి వేడ్క సల్పఁగన్. 334

క. బంధుమతి నైన నను నిర్బంధముమెయి ధర్మబాహ్యపథమున నలిపీ
బాంధవ యిటు సేయుటయు నమంథరభవదీయకీర్తి మలినము గాదే. 335

చ. జగములయందు ధర్మువును సత్యము నీయది గాదె దేవ యే
తగవులు నీ యెఱుంగని విధంబులె యిట్టిది నీదు బుద్ధికిం
దగ వగునేని మార్పులుకు దానన యే నగుఁ గాక నీకు నిం
పగు తెఱఁ గాచరింపు మిట యావల నయ్యెడు నింద్య కోర్చితిన్. 336

సీ. అనుటయు నద్దేవుఁ డయ్యిందుముఖిఁ జూచి, తల్లిదండ్రులును బాంధవజనులును
గారు ని న్నిగిఁ గర్తలు విను నీవ, యొడయురాలవు నీకు నుజ్జ్వలాంగి
కామంబు లెల్లను గామించి పొందుట, నయ్యెఁ గన్యాశబ్ద మట్లు గాన
యాత్మతంత్రత్వంబునందు నీ కెగ్గు లే, దే నేల నడతు ధర్మేతరంబు

ఆ. మత్సమాగమమున మదిరాక్షి నీదుక
న్యావ్రతంబుఁ జెడదు నందనుండు
నధిక తేజుఁ డుదయ మగు నిన్ను లోకనిం
దయును బొంద కుండుఁ దథ్య మబల. 337

—◆ కుంతి సూర్యుని వరంబున గర్భంబుఁ దాల్చి కర్ణుం గాంచుట. ◆—

వ. అని యొడంబఱిచి సూర్యుండు తత్సమాగమంబునం బ్రీతుం డయి దానిం గర్భాధానంబును సేసి గగనంబున కరిగె నంతఁ బూర్వపక్షంబున చంద్రుండునుం బోలె గర్భంబును గ్రమంబునఁ బ్రవర్ధనంబు నొందుచు నభివ్యక్తం బయ్యును బ్రభాకరుమహిమం జేసి లోకవిదితంబు గా కుండెఁ దత్ప్రకారంబు దాదికూఁతు రొక్కతియ యెఱుంగు నిట్లు వర్ధిల్లుచుం బది యగు మాసంబున నొక్కనాఁటి నిశాసమయంబునం గన్యాంతఃపురంబునందు. 338

1. గ. గరిమం, బగుఁ గాక.

ఆ. కొడుకుఁ గనియె సహజకుండలకవచాభి, రాము విమలకమలకోమలాక్షు
దీర్ఘబాహుఁ జారుదృఢదేహు దరుణార్కు, తేజుఁ గుంతిభోజరాజపుత్త్రి. 339

వ. ఇట్లు జనియించినయర్భకుం జూచి లోకాపవాదభయంబునకుం దలరి యాక్షణంబ యొక్కమంజూషలోన నబ్బాలకుం బదిలంబుగా నిడి దాని నతిదృఢంబుగాఁ దెప్ప బంధించి సఖియునుం దానును గొని చని పురసమీపగతం బయినయశ్వనదీప్రవాహంబున విడిచి కుంతి యెంతయు సంతాపంబున నిట్లని విలాపంబు సేసె. 340

ఆ. కొడుకు నిన్నుఁ గాంచు కొఱఁతనోములు కాని, పెంచి గారవించి పేర్మి నీదు
ప్రోవుఁ గుడువఁ గాంచుపుణ్యంబు దుది ముట్ట, నేల చేయ నైతి నేను కుఱ్ఱ.

మ. నెఱయం బున్నమచందురుం బెనయునీనెమ్మోమునం [2]దియ్యమై
చిఱునవ్వొప్పఁగఁ జూడనీక పులకల్ చెల్వొంద నిన్ గ్రుచ్చి య
క్కఱ[3]దీఱం బొరి నక్కునం గరము వీఁకం జేర్పనీ కిమ్మెయిన్
[4]వఱదం ద్రోవఁగఁ జేసెనే యకట దైవం బెందుఁ జొత్తున్ సుతా. 342

సీ. ఏపుణ్యసతికి నీ వింకఁ [5]జేపడియెదో, యెక్కడఁ బడియెదో యే నెఱుంగ
నేపుణ్యురాలొకో యిప్పుడు నినుఁ బుత్త్రుఁగాఁ గాంచుటకు మేలికలను గాంచు
లలిఁ బాంసుకేళి నల్లన [6]నడపాడుచు, నవ్యక్తమధురవాక్యామృతంబు
వీనులఁ గురియుచు వెడఁదకన్నులుఁ బిన్ననవ్వును శుభలక్షణములు నమరఁ
ఆ. దేజరిల్లు నిన్నుఁ దెఱవ యెవ్వతె యొక్కొ, యడరఁ గ్రుచ్చి యురమునందుఁ జేర్చి
వేడ్క మిగిలి వేనవేలభంగులఁ గొని,యాడి యాడి ముద్దులాడుఁ గొడుక.

ఉ. లాలితయౌవనోజ్జ్వలవిలాసమునం దిలకించి సుందరా
భీలవిచేష్టితం బమర [7]భీమవనోద్భవసింహరేఖమై
వ్రాలవె యింక నీ వెలమి వామవిలోచన లంగజన్మలీ
లాలసలై విపక్షులు భయాలసులై ధృతి యేది జూడఁగన్. 344

ఆ. ఎచట నున్ననైన నెల్లప్పుడును నిన్నుఁ, గన్నులారఁ జూడఁ గాంచుఁ గాన
తనయ నిన్నుఁ గనినతపనుండు గడుధన్యుఁ, డయ్యె మందభాగ్య నైతి నేను.

చ. ఇనుఁ డఱచేత మాటువడు నెన్నఁడుఁ గల్గునె నిన్ను నెమ్మనేఁ
గనియెదఁ గాక యింక నొకకాలమునం దయినం దనూన నీ
వినుతశరీరభావమును వీనులసన్మణికుండలంబులున్
ఘనతరవజ్రవర్మముఁ బ్రకాశత నొందక యుండ నేర్చునే. 346

చ. దివి భువి నంతరిక్షమున దిక్కుల గాడ్పున నగ్నియందు న

---

1. దెప్పంబునం బంధించి. 2. గ. దియ్యనై. 3. గ. యారన్. 4. జ. వఱుతం 5. ఆ. నందనుఁడవై. 6. ఆ. నడయాడుచు. 7. క. భీమమనోద్భవసారరేఖ : చ. భీమతనూద్భవసింహరేఖ ఛ. భీమమనోద్భవసింహరేఖ. జ. భీమమనోద్భటసారరేఖ. 'హిమవద్వనసంభూతం సింహం కేసరిణం యథా' అని మూలము.

ర్ణవములయందు ఘోరవిపినంబులయందును నీకు నెల్లెడఁ
శివ మగుఁ గాక దిక్పతులు సిద్ధులు సాధ్యులు రుద్రులాశ్వినుల్
పవనులుఁ బుత్త్రి నిన్నుఁ గృపఁ బాయక యెప్పుడుఁ గాచుచుండెడున్. 347

వ. అని యేడ్చుచుం గుంతి యచ్చటం దడయ వెఱచి గూఢప్రకారంబునఁ గన్యాంతఃపురంబునకు వచ్చి యెప్పటియట్ల వర్తిల్లుచుండెనట మంజూషయు నశ్వనదీవేగంబునఁ జర్మణ్వతికిం జని యందుండి యమునాగతంబై యటఁ జని భాగీరథిం బడి సూతవిషయంబునం జంపానగరంబు చేరువ నరుగుచుండె నాసమయంబున.

సీ. ధృతరాష్ట్రసఖుఁడై సత్యయతిరథుండను సూతుఁ, డతిసతులుఁ దానును నతివిభూతి
గంగలో జలకేళి సంగతుండై యుండి, తుంగతరంగానుషంగవశతఁ
జనుదెంచు మంజూషఁ గని కడు వేడుకఁ, దనపరిజనములఁ బనిచి పట్టి
తెప్పించి ధీయుక్తి యొప్ప నేకతమున, నప్పెట్టెఁ దెఱచి తా నప్పుడందు

ఆ. వినుతహేమకవచుఁ గనకకుండలధరు, ననుపమానతేజుఁ ఘనుఁ గుమారుఁ
గని మనంబులోన ననయంబు విస్మయం, బొనరఁ గ్రుచ్చి యెత్తికొని ముదమున.

వ. తనజీవితేశ్వరి యైనరాధకుం జూపి యిట్లనియె. 350

క. అనపత్యుల మైన మనకు, మనపాలిఁటి వేలుపిక్కుమారుని నిచ్చెన్
వనజాక్షి యితఁడు మానుష, జనితుఁడు గాఁడరయ దేవసంభవుఁడు సుమీ.

క. అని దానిచేతి కిచ్చినఁ, గొని యురమున నదిమికొని యెఁ గొడుకు నతివ య
వ్వనితకు బాలెంత తెఱంగునఁ జన్నులు సేఁపె నపుడు కూరిమి పేర్మిన్. 352

వ. ఇట్లా దంపతులు ప్రమోదసంపద సొంపారం గుమారుం గొని నిజమందిరంబున కరిగి యాత్మీయకులోచితంబు లగుజాతకర్మాదిసంస్కారంబు లొనరించి సహజకుండలాలంకృతకర్ణుం డగుటం జేసి వానికిఁ గర్ణుం డని నామకరణంబు సేసి రంత.

క. వసువర్మధరుఁడు గావున, వసుసేనుం డనఁగఁ బేరు వానికి నిడి రిం
పెసఁగఁగ భూసురు లాదిత్యసుతుం డిబ్భంగి సూతతనయుం డయ్యెన్. 354

వ. తద్వృత్తాంత బంతయుఁ గుంతి తనయాప్తచరులవలన విని శిథిలీకృతసంతాప యయి యుండె నతిరథుండును సంప్రాప్తయౌవనుం డైనకొడుకుం దోడ్కొని వచ్చి ద్రోణాచార్యులయొద్ద నస్త్రశిక్ష సేయం బెట్టినా సూతసూనుండు మఱియుఁ గృపాచార్యువలనను జామదగ్న్యువలనను వివిధాస్త్రలాభంబు నొంది క్రమంబున దుర్యోధనుతోడ బద్ధసఖ్యుం డై యతనికిఁ బ్రియంబు సేయం దివిరి దివిజరాజనందనుతో మచ్చరించుచుఁ బాండవుల కప్రియంబు సేయుచుండె. 355

ఉ. ఆతనియస్త్రవిద్యయు సమంచితకుండల[1]వజ్రవర్మవి
ఖ్యాతియు నాత్మలోఁ దలఁచి కౌరవనాయక ధర్మసూనుఁ డు
ద్భీతమనస్కుఁ డై యతఁ డభేద్యబలుం డని సంతతంబు నై

1. గ. వర్మ-కర్మ.

ర్యాతిశయంబు డించి హృదయవ్యథఁ బొందుచు నుండెఁ గానలోన్. 356

వ. అయ్యుధిష్ఠిరునకుఁ బ్రియం బాచరింపం గోరి కవచకుండలంబులు గొనుట కై పురందరుం డొక్కనాఁడు బ్రాహ్మణరూపంబునం జని మధ్యాహ్నసమయంబునఁ గర్ణుండు సూర్యోపాస్తి సేయుచుండి బ్రాహ్మణులకు నభీప్సితంబు లిచ్చుతఱిం గని భిక్షాం దేహి యనుటయుఁ గర్ణుం డతని కి ట్లనియె. 357

చ. అలసవిలాసలాలసరసాన్వితలైన నితంబినీజనుల్
వలసిన భూరిసస్యపరివస్తుసమగ్రము లైనగ్రామముల్
వలసిన నుల్లసన్మణిసువర్ణవిభూషణగోధనావళుల్
వలసినఁ గోరు మిచ్చెద ధ్రువంబుగ నావుడు నాతఁ డి ట్లనున్. 358

క. విను మివి యెయ్యవియును నా,కు నభీష్టముఁ గావు నీదుకుండలములు స
ద్వినుతకవచంబు నిచ్చినఁ, గొనియెద నీ నోపుదేని గుణరత్ననిధీ. 359

చ. అనవుడుఁ గర్ణుఁ డిట్లనియె నక్కట యేను విశిష్టవస్తువుల్
గొనకొని యిత్తు నాఁగ నిటు గోరెద వీవు దలంప నప్రయో
జన మగువాని భూమిసురసత్తమ యెంతయు బేల వైతి ము
న్నెనయఁగ నిట్టు లెవ్వరును నెయ్యెడ వేఁడిరె యెజ్జగంబులన్. 360

క. కుండలములుఁ గవచము న,ట్లుండఁగ ని మ్మనఘ వేఁడు మెండుధనంబుల్
నిండింతు నీమనోగత, మొం డేమియు ననకు మింక నూర్జితచరితా. 361

వ. అనిన నతం డెవ్విధంబున నొడంబడక కవచకుండలంబులయంద బద్ధాభిలాషుం డయి పలికినఁ గర్ణుండు వానిం బ్రార్థించియుఁ బూజించియు ననేకమణికనకాది ద్రవ్యంబులు నివేదించియు నెట్లును నొడంబఱుప నేరక యతని కి ట్లనియె. 362

తే. సహజములు నాకు నిక్కవచంబుఁ గుండ
లములు నివి లేక యున్న నే సమరభూమిఁ
గడిఁదిశత్రులచేత భంగంబు వడుదుఁ
గాన యీఁజాలనయ్యెద వీని నేను. 363

క. నానాజనపదబహుళము, నానాధనసంయుతంబు [1]నారాజ్యము స
మ్మానంబున నిచ్చెదఁ గొన, వే ననుఁ గారింప కింక విప్రవరేణ్యా. 364

వ. అనియును నతనియందు సుముఖత్వంబు గానక కానీనుండు దరహసితాననుం డగుచుఁ గృతకభూసురు నుపలక్షించి యి ట్లనియె. 365

చ. ఎఱిఁగితి నేను నిన్ను విబుధేంద్రుఁడ వీవు జగత్త్రయంబు గ్ర
చ్చఱ భవదీయరక్షణమునందు వెలుంగుచు నుండు నిట్టి ని
న్నుఱవుగ నేను వేఁడుకొన యుక్తుఁడఁ గాక మొఱంగి నన్ను న
క్కఱ పడి నీవు వేఁడు టిది గర్జమె నిర్జితదైత్య చెప్పుమా. 366

1. గ. నాకామ్యము.

తే. అనిన నింద్రుఁ డి ట్లనియె మీ । యయ్య పద్మ
హితుఁడు మున్నింత సెప్పె నీ । కిష్ట మెసఁగఁ
గాన యెఱిఁగితి నీ వింకఁ । గడప నేల
యనఘ మాబోఁటులకుఁ బ్రియం । బైనపనిని. 367

వ. అనిన రాధేయుండు దేవా య ట్లయిన నఖిలశత్రుఘాతిని యైననీయమోఘశక్తి నాకుం గృప సేసి కవచకుండలంబులు గొను మనినం బాకశాసనుం డి ట్లనియె. 368

ఉ. ఇచ్చెద శక్తి నీకు విను । మేర్పడ నాజి మదీయశత్రులం
గ్రచ్చఱఁ జంపి జంపి యది । గ్రమ్మఱి చేతికి వచ్చుచుండు నీ
కిచ్చుట యట్లు గాదు భువి । నెందును దుర్జయుఁ డైననీరిపుం
జెచ్చెరఁ దున్మి నొక్కరున । చేకుఱ నన్ను భజించుఁ గ్రమ్మఱన్. 369

వ. ఇట్టిది సమయంబుగాఁ బరిగ్రహింపు మనినఁ గర్ణుండు నాకుం గల పగతుం డొక్కరుండు వాని వధియించుటయ మదీయమనోరథం బనుటయుఁ బురందరుండు దరహాసితవదనుం డై. 370

ఉ. నీయభిలాష మేను మది । నిక్క మెఱుంగుదు నుగ్రశౌర్యుఁ డే
జోయుతుఁ బార్థు నోర్తు నని । చూచెదు నీ కది యేల తీరు రా
ధేయ దయావిధేయుఁడు వి।ధేయజగత్త్రయుఁ డవ్యయుండు నా
రాయణుఁ డమ్మహాత్మునకు । రక్షకుఁ డేరికి వాఁడు సాధ్యుఁడే. 371

వ. అనినం దపననందనుం డది య ట్లుండె నాకు సహజం బైనకవచంబు నొలిచి యిచ్చిన మదీయదేహంబు గరంబు వికృతం బగు నది యే మని యవధరించి తనిన నింద్రుండు నీశరీరంబు భవజ్జనకుం డైనయరుణకిరణువర్ణం బెట్టి దట్టిదీప్తిం జెలు వొందు నని పలికి వానికి నమోఘశక్తి యొసంగి దీని నాపత్కాలంబునం దక్కఁ బెఱయప్పుడు ప్రయోగించిన నీకు నపాయం బగు నని చెప్పెఁ దదనంతరంబ యవ్వీరుండు గవచకుండలబులం బుచ్చి యతనికిచ్చె. 372

చ. అలఘునిశాతశస్త్రమున । నంగము లన్నియు నిర్వికారుఁడై
యొలువఁ దొడంగినట్టియెడ । హా యని కిన్నరయక్షసిద్ధసా
ధ్యులు దివినుండి యార్చుచును । దూర్యరవంబు సెలంగ నద్భుతం
బెలయఁగఁ బుష్పవృష్టిఁ గురియించిరి కర్ణుపయిం బ్రియంబునన్. 373

వ. ఇట్లు సూతపుత్త్రుం వికృతగాత్త్రుం జేసి వాసవుండు ప్రమదవికాసభాసితుం డగుచు నిజలోకంబున కరిగెఁ దద్వృత్తాంతం బంతయు విని కౌంతేయు లత్యంత సంతోషంబునం బొదలిరి గాంధారేయులు దుఃఖవిదారితహృదయు లై రని యిట్లు కుండలాహరణంబు సవిస్తరంబుగాఁ జెప్పిన విని జనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె. 374

అనయంబు దుస్తర మగునవ్వనవాసము నిస్తరించి ద్వాదశవర్షం
బునకడపట నేమివిధం, బొనరించిరి మత్పితామహుల్ మునినాథా  375

అనిన నమ్మహీపతికి నమ్మహీదేవుం డిట్లనియె నట్లు మార్కండేయువలనం బుణ్య
కథలు విని పాండవు లనంతరంబ క్రమ్మఱ ద్వైతవనంబున కరిగి యందున్న యెడ
నొక్కనాఁడు సుఖాసీనుం డయి యున్నధర్మరాజుపాలికి నొకబ్రాహ్మణుండు
సంభ్రమంబున బఱతెంచి యిట్లనియె.  376

—: ధర్మరాజు బ్రాహ్మణునియరణిఁ దెచ్చుటకుఁబోవుట. :—

తరుశాఖఁ దగిల్చిననా,యరణి యొకమృగంబు వచ్చి యతిరయమున న
త్తరువున నొరసికొనంగా, ధరణీశ్వర తగిలెఁ జువ్వె తచ్ఛృంగమునన్.  377

దానిఁ గొని పఱచె నమ్మృగ, మానతనృపలోక నాకు నయ్యరణిఁ దగం
గా నిపుడు దేరఁ బనుపవె, భూనుత నిత్యవిధి లోపమునఁ జన కుండన్.  378

అనవుడు నాక్షణంబ మనుజాధిపుఁ డుద్ధతచాపహస్తుఁ డై
యనుజులుఁ దాను నెంతయు రయంబున నాహరిణేంద్రుపజ్జఁగై
కొని చని కూడ ముట్టి మెఱుఁగుల్ నిగుడం బటుసాయకంబు లే
సిన నొకయమ్ము నమ్మృగము సెందద చేరద యమ్మృతంబుగన్.  379

అదియును వారి నతిదూరంబుగా నెలయించికొని చని యొక్కఘోరవిపినంబున
నదృశ్యం బైన నయ్యత్నంబు విఫలం బగుటకు విషాదంబు నొందుచు నయ్యేవురు
నతిశ్రాంతు లై శీతలచ్ఛాయం బగునొక్కవటమహీరుహంబు క్రింద విశ్రమించి
రవుడు నకులుండు ధర్మనందనున కిట్లనియె.  380

కులశీలోన్నతియు విని,శ్చలకరుణారతియు ధర్మసంగ్రహమతియుం
గలమనకు నివ్విధంబున, నలజడి వచ్చుటకు మూల మది యెయ్యదియో.  381

అనిన నమ్మహాప్రాజ్ఞుం డతని కిట్లనియె.  382

వినుము సుఖమునకు దుఃఖం,బునకుం గారణము దనదుపూర్వకృతం బై
చను కర్మమ కారణ మిది, యని యన్యము గలుగ నేర దండోక్తియున్.

అనుటయు భీమసేనుండు నకులున కిట్లనియె.  384

ఆ. ప్రాతికామి వోయి పాంచాలిఁ గొలువులో
పలికిఁ దేర నపుడ యలుక యెసఁగ
నాంబికేయసుతుల నందఱఁ దునుమక
నునికి నిట్టియెడరు మనకుఁ బుట్టె.  385

చ. అనవుడు నర్జునుం డనియె నాసభ సూతసుతుండు పేర్చిప
ల్కినపటువాక్యముల్ వినియుఁ గిన్కఁ గుఁబూనక యేఁ దొలంగి కా
ననమున కిట్లు కాతరజనంబులచాడ్పున నేఁగుదెంచుటన్
మనకు దురంతదుఃఖములు మానక పైకొని వచ్చెఁ దమ్ముఁడా.  386

వ. అనిన యనంతరంబ సహదేవుం డి ట్లనియె. 387

ఆ. దుష్టశీలుఁ డైన దుర్ద్యూతకితవు, గాంధారుఁ బట్టి యేను దడయ కప్పుడ
తునుమ కునికి నిట్టిదుర్దశ పాలైతి, మనఘ మనము కాననాంతరముల. 388

వ. అనియిట్లందఱు నన్నితెఱంగులఁ బలుకుచుండ నజాతశత్రుండు నకులుం జూచి భవదీయసోదరు లత్యంతపిపాసితు లైనవారు నీ విమ్మహీరుహం బెక్కి జలంబు లున్నయెడ యరయు మనిన నతండును దద్వచనానురూపంబున నవ్వనస్పతిసమారోహణంబు సేసి దెసలు గలయం బరికించి దూరంబున సలిలంబు లున్నవని యన్న కెఱింగించిన నతం డట్లేని నీవ పోయి జలపానంబు సేసి మాకును జలంబులు గొని రమ్మని పనుచుటయును మాద్రేయుండు వృక్షావతీర్ణుండయి రయంబునం జని ముందట నతిమనోహరం బగుతటాకంబుఁ గని జలంబులు ద్రావంబోయిన నొక్కయశరీరభూతం బి ట్లనియె. 389

—* నకులాదులు యక్షుని నిరాకరించి నీరుద్రావి మూర్ఛితు లగుట. *—

క. ఓయన్న యీతటాకము, నాయది నీవీజలము గొనఁగ వలతేనిన్
నాయడిగిన ప్రశ్నములకు, ధీయుత యుత్తరము లిమ్ము తేటపడంగాన్. 390

క. అనుటయు నవ్వాక్యముదెస, ననాదరము సేసి నకులుఁ డక్కొలనం ది
య్యనినీరు ద్రావి నిశ్చే,తనుఁ డై యాక్షణమ పడియెఁ దత్తీరమునన్. 391

వ. అటధర్మపుత్త్రుండు సహదేవుం గనుంగొని నకులుండు జలంబులకుం జని తడసె నీ వరిగి యతనిం దోడ్కొని జలంబులు గొనుచు రమ్మని పనిచిన నక్కుమారుం డతిశీఘ్రగమనంబునం బోయి పద్మినీతీరంబునం బడియున్నయన్న తెఱంగుఁ జూచి విస్మయశోకవ్యాకులహృదయుం డగుచు నిది యేమినిమిత్తంబున నయ్యెనో యని యూహించుచుఁ బెల్లడరుతృష్ణాభరంబు సహింప నోపక జలంబుల దెస నాసఁ జేసి కొలనికి డిగ్గిన నెప్పటిభూతం బి ట్లనియె. 392

ఆ. అనఘ యీజలాశయము నాయధీనంబు, సాహసంబుఁ జేసి చనదు చొరఁగ
నాదుప్రశ్నములకు నలి నుత్తరములిచ్చి, వారి గొనుము నీకు వలసినట్లు.

క. అనిన నది యాదరింపక, ఘనుఁ డాసలిలములు ద్రావి గ్రక్కున విషమె
క్కినవిధమునఁ బరవశుఁడై, ఘనసాలమహీరుహంబుకరణిం బడియెన్. 394

సీ. అంత నంతకసూనుఁ డంతరంగంబున, సంతాప మెసఁగ వాసవతనూజుఁ
గనుఁగొని యన్న నీయనుఁగుఁదమ్ములువోయి, కడుఁదడవయ్యె నిక్కాననమున
నెయ్యది పుట్టెనో చయ్యన నీ వేఁగి, వారిని దోడ్కొని వారిఁగొనుచుఁ
జను దెమ్ము నావుడు ఘనభుజుం డధికర, యంబున నరిగి జలాశయంబు

ఆ. తీరభూమిఁ బడినవారి నవారిత, మహితశౌర్యధనుల మాద్రిసుతులఁ
జూచి విస్మయైకగోచరుఁడై సవ్య,సాచి యుల్లమున విషాదమడర. 395

నాలుగుదిక్కులుం గనుంగొని, యాలో నెవ్వరిని గాన కత్యంతపిపా
సాలసుండై సలిలంబులు, గ్రోలంగ సమకట్టి యెయ్యెం గొలనికి డాసెన్. 396

వ. డాయుటయు నాకాశవాణి యిట్లని పీతెంచె. 397

సీ. బలిమిం జొచ్చిన నెట్టివారి కయినం బ్రాణంబుపై వచ్చు నీ
సలిలావాసము మత్పరిగ్రహము తృష్ణాచ్ఛేద మొందం జలం
బులు ద్రావన్ వలతేనిం బ్రశ్నములకుం బొం దొందంగా నుత్తరం
బులు నా కిమ్మనుమన్ మనంబునం బృథాపుత్త్రుండు సక్రోధుండై. 398

మ. మునిచ్చిలి వచ్చి దుర్వచనముల్ పచరించినం జెల్లనిత్తునే
చెచ్చెర నీమొలుం గడంగ జేసెద నిప్పుడు సూడు మంచు వి
వ్వచ్చుండు శబ్దవేధిశరవర్గముం దద్వచనంబుచక్కటిం
గ్రచ్చఱ నించె మార్వ్రిరవకంపితసర్వదిగంత[1]రాళుండై. 399

ఆ. ఇట్లు లేయుటయును నెప్పటివాక్యంబు, మఱియు వినంగంబడిన మఘవసూను
డలసికొలనుసొచ్చి యంబుపానముసేసి, యిలకునొఱగె వివశహృదయుండగుచు.

వ. తదనంతరంబ యుధిష్ఠిరుండు భీమసేను నాలోకించి కవలును గవ్వడియును నింత
వడి దడయుటకు నిమిత్తం బెయ్యదియో నీవు నరుగు మనినం గిమ్మీరవైరి
మారుతజవంబున నమ్మువ్వురుం జనినచొప్పునం జని పద్మాకరకూలంబునందు
నిద్రావివశులుంబోలెం బడి యున్నతమ్ములం గని దుఃఖితుండై. 401

తరలము. ఇది మనుష్యకృతంబు గాదు సురేంద్రకిన్నరపన్నగ
త్రిదశనిర్మిత మైనకర్మము దీని నింతయు నేర్పడం
బిదపం జూచెదం గాక యంచు విభీతిదూరుండు నీరువ
ట్టొదవం దత్సలిలాశయంబు సముత్సుకుం డయి చొచ్చినన్. 402

వ. అంతరిక్షగోచరం బైనవచనం బిట్లని వినంబడియె నయ్యా నీ వి ట్లేల సాహ
సంబు సేసె దిక్కులను మత్పూర్వపరిగ్రహంబు నీ వోపుదేని నాయడిగిన
యర్థంబులకు నుత్తరంబు లిచ్చి జలంబులు ద్రావు మనిన నప్పలుకులు గై
కొనక వృకోదరుండు నిపీతసలిలుం డై యచ్చోటన మూర్ఛితుం డై పడియె
నీట పాండవాగ్రజుండు. 403

క. తమ్ములు నలువురు నొక్కట, నమ్మెయి మసలుటకు నాత్మ నత్యంతవిషా
దమ్ములయి సముత్థితుం డై, క్రమ్మఱ నమ్మార్గమపుడు గైకొని నడచెన్. 404

సీ. అపగతజనశబ్ద మై యనభివ్యక్తమార్గ మై యవిరళదుర్గశైల
తరుగుల్మవల్లీవితాన మైగజసింహ, శరభశార్దూలసూకరలులాయ
బహుళ మై బహువిధపక్షికోలాహల, భయద మైకడుం బర పయినయడవి
ననుజుల వెదకుచు ననఘుండు సని కాంచెం, గమలాకరంబుతీరమునం బడిన

1. క. గ. జ. భాగుండై.

ఆ. వారిఁ బూరువంశవరుల భీమార్జున,యముల నమితబలుల విమలమతులఁ
బ్రళయపతితలోకపాలసంకాశుల, భూరిపుణ్యధనుల వీరవరుల. 405

మ. కని డెందంబునఁ దల్లడం బడర దీర్ఘశ్వాసుఁడై సర్వమున్
దనుకంపం దాల్మి చలింప విస్మయపరీతస్వాంతుఁడై శోకబా
ష్పనిరుద్ధాకులలోచనుం డగుచు మూర్ఛల్ పైకొనం గొంతసే
పు నరేంద్రోత్తముఁ డుండెఁ జిత్రమునరూపంబు బోలెం దా నచ్చటన్. 406

వ. పదంపడి డెందంబు ధృతిపొందుననిడికొని యతం డన్నలువుర నుపలక్షించి నలు
దెసలుం బరికించి యాత్మగతంబున. 407

తే. ఒరులు వచ్చినచొప్పు లే దరిగినట్టి,చొప్పు లేదు పెనంగినచొప్పు లేదు
ఘనభుజులయంగకంబులు గనుఁగొనంగ,నక్షతము లేల యొక్కొ యిట్లయిరివీరు.

ఉ. క్రూరుఁడు ధార్తరాష్ట్రుఁ డతికుత్సితుఁ డెంతయు బాపబుద్ధి గాం
ధారుఁడు పెక్కుమాయలకుఁ దావల మక్కట యద్దురాత్మకుల్
వారక యెద్దియేని నొకవంచనమై నిటు సేసిరొక్కొ యె
వ్వారలు నాత్మ నమ్ముదురె వక్రవిచారులఁ బాపకారులన్. 409

క. వదనంబుల తెలివియుఁ గర,పద రుచియుం జెడదు వీరు పడుటకుఁ గత మీ
యుదకము విషదిగ్ధం బని, మదిఁ దలపఁ బోల దేమి[1]మాయయొ యెఱుఁగన్.

చ. పుడమియు సర్వసంపదయుఁ బొల్పఱ వైరులపాలు సేసియీ
యడవికి వచ్చి భీకరమృగావలిపొత్తున నున్నవీరి నా
న్నడికొని యిట్లు సేసెనె యమనాథులఁబోలె విధాత్రుఁడింక నె
క్కడఁ జనువాఁడ నేది కడగాఁ దరియింతు దురంతదుఃఖముల్. 411

సీ. పుత్త్రులుదుఃఖార్తిఁ బొగులుట కనిశంబుఁ, బొక్కుచు నున్నయప్పుణ్యచరిత
మాతల్లి పాండునృపమహిషి నా కెదురుగా, వచ్చి కౌఁగిటఁ జేర్చి వత్స నాఁడు
దమ్ములఁ గుఱ్ఱలు నీవుఁ దగ విపినంబున, కరిగితి రిప్పు డయ్యనుజు లెందు
జనిరి నీ వొక్కఁడవు చనుదెంచి తిది యేమి, యనిన నాయమతోడ నకట యేమి

ఆ. యనఁగ నేర్చువాఁడ నాచార్యవిదురశాం,తనవకృపులు నను ముదంబుతోడఁ
గుశల మడిగి రేని గుశలమే మనువాఁడఁ, [2]దలఁగ రానియెడరు దగిలె నాకు.

వ. అని పెక్కుతెఱంగుల వగచి యాధర్మజుండు దప్పి కోర్వక నీళ్ళుద్రావుటకై
సరోవరంబులోనికి దిగుటయు నశరీరభూతం బి ట్లనియె.

మ. విను మే నొక్కబకంబ నిక్కొలను పృథ్వీనాథ నాసొమ్ము నీ
యనుజుల్ మద్వచనంబు గైకొనక తోయాస్వాదులై యివ్విధం
బునఁ బ్రాణచ్యుతిఁ బొంది రీవును గడున్ మోహంబునన్ సాహసం
బునకుం జొచ్చిన నట్ల యయ్యెదు సుమీ [3]మున్నుమ్మట్ట వారించితిన్. 413

1. గ. మాయయొయెఱుఁగవన్. 2. ఙ. దలఁపఁ గాని. 3. గ. ఙ. మున్నున్న.

క. ఏ నడిగినయర్థములకు, భూనుత యుత్తరము లిచ్చి ♦ పొలుపారఁ బయః
పానము సేయుము నావుడు, నానిర్మలచరితుఁ డంబ ♦ రాభిముఖుం డై. 415

వ. అయ్యా నీవు బకరూపధరుండ వై యున్నరుద్రుండవో పావకుండవో పవనుండవో యట్లు గానినాఁడు కులపర్వతప్రతిము లయిన నాతమ్ములం బడఁ ద్రోచునట్టి బలంబు పులుఁగులకుం గలదె దేవాసురగంధర్వయక్షాదులకు దుర్జయు లైన యివ్వీరులనిట్లుసేసి నీవు గానివాఁడవపోలెందొంగియున్న వాఁడవు నాకునద్భుత భయకౌతుకంబు లొక్కటం బొడమెడు నీ వెవ్వండవు నీతలం పెయ్యది చెప్పి నాహృదయవేదన నపనయింపవే యనిన నదృశ్యభూతం బి ట్లనియె. 416

ఆ. కౌరవేంద్ర బకముఁ ♦ గాను నే విను మొక్క-,యక్షవరుఁడ నిచట ♦ నస్మదీయ
నికృతిజేసిపడిరి ♦ నీ తమ్ములందఱు, ననుచు నాక్షణంబ ♦ యతనియెదుర. 417

మ. నిలిచెం దాళసముచ్ఛ్రితాంగుఁడు మహానిర్ఘోషసంతర్జితా
ఖిలభూతప్రకరుండు దీర్ఘవిపులగ్రీవుండు దంష్ట్రాసము
జ్జ్వలవక్త్రుండు విరూపలోచనుఁడు దీప్తవిస్ఫారతేజోఘనుం
డలఘుం డాసరసీతటాగ్రమున నయ్యక్షుండు ఘోరాకృతిన్. 418

వ. ఇట్లు నిలిచి కౌంతేయాగ్రజున కి ట్లనియె. 419

క. నాయనుమతి లేకుండఁగ, నీయుదకము ద్రావిరేని ♦ నెవ్వారైనన్
ధీయుత చత్తురు నీ వలు, సేయవు సమ్యగ్విచార ♦ శీలుఁడ వగుటన్. 420

వ. కావున మదీయంబు లగుప్రశ్నంబుల కుత్తరంబు సెప్పుమనిన నతండు మహాత్మా నీచిత్తరిబునకు వచ్చునట్లుగాఁ జెప్పు. నాబోటివానికి శక్యం బగునే యైనను నానేర్చువిధంబునం జెప్పెద నడుగు మనిన నయ్యక్షుం డి ట్లనియె. 421

—* ధర్మరాజు యక్షప్రశ్నముల కుత్తరంబు లిచ్చుట. *—

క. దినకరు నెయ్యది నడపును, దినకరు నెవ్వారు గొలిచి ♦ తిరుగుదు రద్దే
వునియస్తమించు టేమిట, ననఘ తదాధారభూత ♦ మది యెయ్యదియో. 422

తే. అనిన ధర్మజుఁ డి ట్లను ♦ నబ్జహితుని
నడపు బ్రహ్మంబు సురకోటి ♦ నడఁచుఁ గొలిచి
ధర్మచే నస్తమితుఁ డగుఁ ♦ దపనుఁ డమ్మ
హాత్మునకు సత్య మాధార ♦ మండ్రు బుధులు. 423

వ. అనిన విని యక్షుం డి ట్లనియె. 424

క. ఏమిట శ్రోత్రియుఁ డనఁ జను, నేమిటఁ గడుమహిమ వడయు ♦ నిమ్మగఁ బురుషుం
డేమిట సహాయయుతుఁ డగు, నేమిట నగు బుద్ధిమంతుఁ ♦ డేర్పడఁ జెపుమా.

వ. అనిన నతం డి ట్లనియె. 426

క. శ్రుతమువలన శ్రోత్రియుఁ డగు, నతులతపోయుక్తిఁ గడుమ ♦ హత్త్వమువడయున్
ధృతిచే సహాయయుతుఁ డగు, నతిశయముగ బుద్ధిమంతుఁ ♦ డగు బుధసేవన్.

చ. నరునకు నాత్మ యెవ్వఁడు ఘనంబుగ దైవిక మైన చుట్ట మె
వ్వ రతనికిం దదీయ మగువర్తన మేమిట నిర్వహించు భూ
వర యతఁ డేమి పూని యనవద్యతఁ బొందు నెఱుంగఁ జెప్పు మీ
వరుదుగ నన్న నక్కురుకులాగ్రణి యాతనితోడ ని ట్లనున్. 443

తే. ఆత్మజుఁడు సువ్వెపురుషున కాత్మయయ్యె, నాతనికి భార్యదైవికమైనచుట్ట
మతనిజీవిక పర్జన్యకతనఁ జెల్లు, నతఁడు దానము గొనియాడ్యయతిశయిల్లు.

చ. అన విని మేటిధర్మ మగునట్టిది యెయ్యది యెట్టి దెప్పుడుం
గనియెఁగఁ బండి యుండు నెసకంబుగ నెయ్యది నిగ్రహించినం
దనరుఁ బ్రమోదసిద్ధి నియతంబుగ నెవ్వరితోడిసంధియెం
దును వికలంబు గాదు పరితోష మెలర్ప నుపన్యసింపవే. 445

వ. అని దివ్యుండు పలికిన నాదివ్యబోధనుం డి ట్లనియె 446

ఆ. విను మహింస మేటి యనఁ జను ధర్మంబు, యోగకర్మ మెపుడు నొనరఁబండి
యుండు మనసుక్రొవ్వు ఖండింపఁగా మోద, మెసఁగు సుజనసంధి యెడల దెందు.

తే. అనిననతఁడు లోకమున కెయ్యదియు దిక్కు, జలము నన్నమునెద్దాన సంభవించు
విషమనంగ నెయ్యది శ్రాద్ధవిధికి నెద్ది, సమయ మనిన నిట్లని చెప్పె జనవిభుండు.

తే. సజ్జనులు దిక్కుసూవె యీసర్వమునకు, నభముధరణియుజలమునన్నమ్ము నుద్భ
వించు నెలవులు విష మగువిప్రధనము, లనఘ శ్రాద్ధకాలము బ్రాహ్మణాగమంబు.

వ. అని తెలిపిన నయ్యక్షుండు ధర్మనందనుతో మనుజుం డెయ్యది పరిత్యజించి సర్వ
జన ప్రియుండును నిశ్శోకుండును నర్థవంతుండును సుఖియును నగునవిన నమ్మహీ
పతి యతని కి ట్లనియె. 450

తే. సర్వజనసమ్మతుండగు గర్వముడిగి, క్రోధ మడచి శోకనముకు గొలువుగాఁడు
వినవెయర్థాఢ్యుఁడగులోభ మొనరవిడిచి, తృష్ణవర్జించిసౌఖ్యంబు తెరువుఁగాంచు.

వ. అనినయనంతరంబ యద్దివ్యుం డతనితోఁ బురుషశబ్దవాచ్యుం డెట్టివాఁడు మఱియు
సర్వధని యగువాఁడెవ్వండునిశ్చయింపు మనినఁ బాండవజ్యేష్ఠుం డి ట్లనియె. 45[?]

క. దివి ముట్టి ధరణి యంతట, నివిడి మెఱయు చుండు నెవ్వనియశోరమ య
ట్టివిశిష్టచరిత్రుఁడు య, క్షవరా పురుషుండునాఁ బ్రకాశత నొందున్.

ఆ. ప్రియము నప్రియంబుఁ బెల్ల గుసౌఖ్యదుఃఖములు భూతభావికార్యములును
నెవ్వనికి సమంబు లివి సర్వధని యనఁ, బరఁగుఁజువ్వె యట్టిభవ్యుఁడనఘ

వ. అని వివరించిన విని యుధిష్ఠిరు దెసఁ బ్రసాదమధురం బైనయాలోకనంబునిగు
వయ్యక్షవరుండు మహాత్మా మదీయంబు లైన ప్రశ్నంబులన్నింటికి సదుత్తరంబ
లిచ్చితి నీవలనం బ్రీతుండ నైతి నీతమ్ములం దొక్కనిప్రాణంబులిచ్చెద వేఁడ
మనిన నతండు. 45

1. గ. గుదురు గాఁడు.